అప్పకవియతులనుగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు.

క. భీమన పది చెప్పె నసం, తామాత్యుఁడు చేసె నెనుకయతు లిరువదినా
ల్గామీఁదఁ గొందఱు కవి, గ్రామణు లిరువదియేడు గావించి రొగిన్. (3-7)

ఆ. పూర్వకవులలక్ష్యములుగూర్చి సత్కవి,జనను లవునటంచు సమ్మతింప
విశ్రమంబులేను వివరింతు నాలుగు, పదులమీఁద నొకటి విదితముగను. (3-8)

భీమన కవిజనాశ్రయమున పది, అనంతుఁడు ఛందోదర్పణమున ఇరువదినాల్గు, కొందఱు కవిగ్రామణులు ఇరువదియేడు గావించినారనియు, తాను లక్ష్యములను పరిశోధించి నలుబదియొక్కయతులను వివరించి నాననియు నప్పకవి చెప్పియున్నాఁడు.

ఇరువదియేడుయతులు చెప్పినకవిగ్రామణులలో చిత్రకవి పెద్దన యొకడు. ఈతఁడు లక్షణసారసంగ్రహమును రచించిన లాక్షణికకవి. అప్పకవి యీతనిగ్రంథమునుండి రెండుపద్యములను 2, 241 (3-193), గ్రహించియే యున్నాడు. మఱియు నాగ్రంథమునగల హనుమోదాహరణమునుండి పంక్తులను యథామాత్రకముగ గ్రహించియున్నాడు. ఆ గ్రంథపీఠికనుండి యీయుదంతమంతయుఁ దెలియఁగలదు.

క్రీ. శ. 1656 లో నప్పకవీయము వెలసిననాటనుండి యీ గ్రంథము ననుసరించి మనఛందోగ్రంథము లెన్నియో మార్పులు చెందినవి.

ఆంధ్రశబ్దచింతామణిని నన్నయకారోపించినట్లుగా, కవిజనాశ్రయమును వేములవాడ భీమకవి కారోపించి దానిప్రాథమికత్వమును ప్రమాణీకరించుచునే తనమతమున కనుకూలముగా పాఠములం దున్నవని నిరూపించినాడు. అందుచేత తరువాతివా రప్పకవీయము ననుసరించి కవిజనాశ్రయపు వ్రాతప్రతులయందు పదియతులను చేర్చిరి. నేడు ముద్రిత కవిజనాశ్రయములో నట్లే పదియతు లున్నవి. కాని అప్పకవికి ముందు కొన్నివ్రాతప్రతులలో నాల్గుయతులుమాత్రమే యున్నట్లుగ నీతరువాత లభించిన తాళపత్రగ్రంథములమూలమున నెఱుకపడుచున్నది. కవిజనాశ్రయమున నన్నయనాటి ఛందస్సంప్రదాయమే చక్కగా నిరూపితమైనది. నన్నయరచనలో ఉపసర్గయతులు, అఖండయతులు మున్నగునవి లేనేలేవు. అప్పకవి తనకాలమునాటి

ఛందస్సంప్రదాయములు ప్రాచీనకవులకాలమునుండియున్నవని చూపించి తన గ్రంథప్రామాణికతకొఱకు నీ సాహసము నొనర్చినాఁడు కవిజనాశ్రయము కూలంకషముగాఁ బరిశోధించినవారి కీవిషయము తేటతెల్లము కాఁగలదు.

ఇట్లే లింగముగుంట తిమ్మనసులక్షణసారములోని పద్యములును నప్పకవీయాలమున మార్పుచెందినవి. సులక్షణసారపు వ్రాఁత ప్రతుల సమ్యక్పరిశీలనమువలన, నీమార్పు లప్పకవివలననే యని నిర్ధారింప వచ్చును.

అప్పకవి యుదాహరించిన లక్ష్యలక్షణ గ్రంథోదాహృతు లన్నియు నీవఱకు కంతకంటె ముందున్న లాక్షణికులు సేకరించినవియే అయినను తానుమాత్రము 'సకలగ్రంథములను జదువక తెలియునె లక్షణప్రపంచంబెల్లన్' (1-6) అనియు, 'గ్రంథములన్నియు వెదకివెదకి సారమెల్ల వివరింపఁదగున్' (1-7) అని చెప్పుకొన్నాఁడు. అప్పకవి తాను ముద్దరాజు రామనకవిసంజీవనినుండి 60 పద్యము లుద్ధరించినాఁడు. ఇతర లాక్షణికులనుండి పద్యములను గైకొన్నాఁడు. అయితే నేమి తా నా గ్రంథములలో నుండి స్వమతానుకూలములైనవి మాత్రమే గ్రహించి ఛందోలక్షణములను చాల సంకుచితము గావించినాఁడు. అప్పకవికాలముననే అనఁగా క్రీ. శ. 1676 ప్రాంతమున మహాలాక్షణికుడు గణపవరపు వేంకటకవి (ప్రబంధరాజవిజయవేంకటేశ్వరవిలాసకర్త) [1] 'ఆంధ్రప్రయోగరత్నాకరము' అను ప్రశస్తగ్రంథము రచియించినాఁడు. అందప్పకవీయమున లేని యపూర్వగ్రంథము లెన్నింటినుండియో ప్రయోగములు చూపఁబడినవి. అప్పకవి వెనుక క్రీ. శ. 1750 లో కవిసార్వభౌముఁడు కూచిమంచి తిమ్మకవి [2]సర్వలక్షణసారసంగ్రహమును రచించి, అందప్పకవీయమున లేని యతులను ప్రాసలను పేర్కొని ఛందోలక్షణములను కొంతవఱకు విశాలము కావించినాఁడు. కాని అప్పకవీయముతో

1. ఈగ్రంథము తంజాపూరిపుస్తకశాలలో మాత్రమే కలదు. తత్క్షణమే ముద్రితము కాఁదగిన యుత్తమలక్షణగ్రంథము.

2. ఇది మంజువాణీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. సంస్కరించిన ముద్రణ మావశ్యము. పైరెండుగ్రంథములు శ్రీవావిళ్లవారే ముద్రింపనున్నారు.

పాటు తక్కినవానిని జోడించి, వ్యాసంగముచేయునేర్పాటు లేక పోవుటచే అప్పకవి యభిప్రాయములే పాతుకొనిపోయినవి. ఆపైని పొత్తపు వేంకటరమణకవి యనునతఁడు "లక్షణశిరోమణి" అను నొక విపులమైన ఛందోగ్రంథమును రచించియున్నాడు. ఇందు లక్షణములు పూర్తిగ నుండుటయేగాక లక్ష్యములును నపూర్వగ్రంథములనుండి యుదాహృతములైనవి.

తెనుఁగుభాషాజీవితమునకు యతిప్రాసలు ప్రాణములు. 1. శబ్ద స్వరూప నిర్ణయము, 2. శబ్దసాధుత్వాసాధుత్వ విచారణ, 3. శబ్దవ్యుత్పత్తిపరిజ్ఞానము, 4. తెనుఁగులిపి పరిణామము, 5. స్వరవ్యంజనతత్త్వము, 6. శబ్దాలంకారవివేచనము అనువీనికి యతిప్రాసలు తోడ్పడినట్లుగా వేఱొకమార్గము తోడ్పడదు. వ్యాకరణచ్ఛందోఽలంకారములు మూఁడింటికి నాధారములగుటచేత పూర్వలాక్షణికు లీయతిప్రాసల తత్త్వమును గుర్తించి, ఆయాకవుల ప్రయోగములను మనకు సేకరించి చూపియున్నారు. ఈసందర్భమున వారిపరిశ్రమ మెంతయును కొనియాడ తగినదని చెప్పకతప్పదు.

పై విషయమును పురస్కరించుకొని విమర్శించిన యప్పకవికి ముందు వెనుకటి లాక్షణికుల యభిప్రాయములను సమన్వయము చేయుచు నప్పకవీయప్రత్యేకవిశిష్టతను తెలుపవలయునేకాని కేవల మప్పకవిమతమునే నిర్ధారించుట యసమంజసమనియు నాంధ్రభాషాచారిత్రకపరిణామమునకు విరుద్ధమనియు విజ్ఞులకు తోఁచకపోదు. ఆనాటికంటె నీనాఁడు వాఙ్మయమునం దెన్నియో గ్రంథములు మనకు లభ్యములగుచున్నవి. తాళపత్రప్రతులుకూడ లభ్యమగుచున్నవి. కాఁబట్టి ప్రాచీనభాషాసంప్రదాయముల నెఱుంగుటకు నేఁడు మన కెంతయో యవకాశము కలదు. ముందుగా అప్పకవి 41 యతులయందును చెప్పని వానిని తెలుపుచున్నాను.

ఋ - రు యతి.

ఈ యతని ప్రసిద్ధకవులువాడినను అప్పకవి సంగ్రహింపలేదు.

పాల్కురికిసోమనాథుఁడు పండితారాధ్యచరిత్రములో (523 పుట) "రురువర్ణదేహంబు - ఋగ్వేదమునకు" అని వాదప్రకరణమున నీయతి

నుపయోగించినాఁడు. ఇది పాఠభేదములవలన మార్పురానిపంక్తి. ఇది చరణవ్యూహములో "ఋగ్వేదో రుదవర్ణశ్చ కుంచితశ్మశ్రుకేశవాన్ విభక్తకంఠః పద్మాక్షో హ్యాయతే మితవిగ్రహః" అనుదానియను వాదము. ఇచ్చట ఋ - రు - యతియేగదా! ఇది శివకవిప్రయుక్తమైచో యీ క్రింది తిక్కనసోమయాజిగారిప్రయోగమును గమనింపుడు.

మహాభారతము శల్యపర్వములో (2 - 260) మంకణమహాముని మాహాత్మ్యాభివర్ణనలో.

సీ. అతఁడు సరస్వతినవగాహనము సేయుచుండి యాచేరువనొర్తు తడుపు
గట్టక నీళ్లాడఁగా జూడఁ దనదు శుక్లము నిర్గమించినఘటసురక్షి
తము సేయ సప్తభేదములొంది యది సత్పురుషులైరి వారు మరుద్గణంబు
నకు సుజనకారణంబైరి.........

పై ఘట్టమున "సప్త, ఋషులు" ఋ - రు యతినివారణకొఱకు సత్పురుషులైనారు. ఘటసురక్షితమైన వీర్యమునుండి నిర్గమించినవారు సప్తఋషులుగాని 'సత్పురుషులు' గారు. ఈపాఠము ముద్రితప్రతులన్నింటిలో నిట్లే యున్నది. కాని వ్రాఁతప్రతులలో పాఠములను చూడండి. ఇవి భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు సేకరించినవి. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోనివి.

ఘటసురక్షితము కాయ సప్తభేదమునంది యదిసప్త
రుషులైరి వారు మరుద్గణంబు (D 260. 212 పత్రము)
సప్తభేదము లొందె నవి సప్తఋషు లయ్యెవారు మరుద్గణంబు
(D 262. 41 పత్రము చివరపంక్తి)
తము సేయ సప్తభేదము నందినది సప్తఋషులైరి వారు మరుద్గణంబు (D 264.)

207 పత్రము 2వ పంక్తి (ఇచటి 'రి' కి 'రు' కి యతి లేదుగదా!) పై తాళపత్రప్రతులపాఠములనుబట్టి సప్తఋషులు అన్నపాఠమె గ్రాహ్యముగదా. 1852 సంవత్సరమున బ్రౌనుదొరవారు తమ నిఘంటువున 854 పుటలో నీపాఠము నిచ్చియున్నారు. మఱియు ప్రసిద్ధపండితుఁడును, పరవస్తు చిన్నయసూరి సమకాలికుఁడును మహాభారతమునకు కూలంకషవ్యాఖ్య వ్రాసిన మహావిద్వాంసుఁడునగు భారతము లక్ష్మీపతి

సోమయాజి యీపాఠమును గ్రహించుటయేగాక, *"శకటరేఫనిర్ణయము" అను గ్రంథమున 120, 121 పుటలలోని నీయతిని నిర్ధారించియున్నాడు. గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపలేదు. గ్రంథము ముద్రితమే గాన నందు చూడనగును.

కాని యీకాలమున యతిప్రాసస్థానములనుగూడ దిద్దుటకు వెనుదీయని పండితనామధేయు లుండుటచేత వ్రాతప్రతులపాఠమే ప్రామాణికమనుటకు నాభాగమునకు సంస్కృతమూలము నిచ్చుచున్నాను.

"సప్తసారస్వతం చైవ తీర్థం పుణ్యం తథా స్మృతమ్
శృణు మంకణ కస్యాపి కౌమార బ్రహ్మచారిణః
అపగామవగాఢస్య రాజన్ ప్రక్రీడితం మహత్
దృష్ట్వా యదృచ్ఛయా తత్ర స్త్రియమంభసి భారత
స్నాయంతీం రుచిరాపాంగీం దిగ్వాససమనిందితామ్
సరస్వత్యాం మహారాజ చస్కందే వీర్యమంభసి
తద్రేతస్సతు జగ్రాహ కలశే వై మహాతపాః
సప్తథా ప్రవిభాగంతు కలశస్థం జగామహ
తత్రర్షయస్స ప్తజాతా జజ్ఞిరే మరుతాం గణాః."

సంస్కృతమహాభారతము శల్యపర్వము. 39 అ. 32-35 శ్లో.

1239 పుట వావిళ్లముద్రణము. కావున నిది ఋ-రు యతి యిచ్చట రుషులను - రిషులుగా మార్చుటకు వీలులేదు. మహాభారతమునకే నీయతి మఱియొండు రెండుచోటులను గలదు. అది యీపైని తెలుపుదును. ఇంతియేగాక, పావులూరిమల్లన గణితమున నీయతి గలదు. వీరభద్రవిజయమున (3-239) (బమ్మెరపోతనకృతము) ఋతుసంవత్సరమాసపక్షజనితార్యూఢాయి" అని స్పష్టముగా నిది కలదు. ఈయతితత్త్వమునుగుఱించి వేఱొకచో తెలిపెదను. పైయుద్ధృతాంశముబట్టి భారత మెంత జాగరూకతతో పరిశీలింపవలెనో ప్రామాణికులు గ్రహింతురుగాక.

---

* ఈగ్రంథము క్రీ. శ. 1903లో మంజువాణీముద్రాక్షరశాలలో ముద్రితమైనది. దీనితోపాటు, ద్విరేఫవర్ణదర్పణము మొదలగువాని నన్నింటిని జేకరించి రేఫఱకారములగూర్చిన యుద్గ్రంథము శ్రీవావిళ్లవారే త్వరలో ముద్రింపనున్నారు.

ఉ - ఋ - యతి. ప్రాచీనకవులు వాడిన నీయతియు సంగ్రహింపబడలేదు.

1. దేవునకు ననుంగువాఁడ ననియుంత్సుకతన్
(వృషాధిపశతకము-98 పద్యము. పాల్కురికి సోమనాథుఁడు.)
2. కావున దగ నర్జునుండు పవనోద్భవుఁడున్
(ఆంధ్రభాగవతము దశమస్కంధము ఉ. భా. 714 పుట.)
3. కావున చండాలుఁడకాదు సందియము లే దూహింప
* (ధర్మఖండము ఈదురుపల్లి భవానీశంకరకవి 227 పుట.)
4. నిల్వుండని కూర్చుండఁజేయ రుత్సవ యుతులై
(పద్యబసవపురాణము పిడుపర్తి సోమన 1-152)
5. ఒక్కని డించిపోవుటయు ఋతిల్లి
(92 పుట నవనాథచరిత్ర గౌరన మదరాసు విశ్వవిద్యాలయప్రచురణ)
ఉండంగఁ దగిన తావులను విశ్వాస్య. 177 పుట.
6. ఓజమై జరయుం చావును దెవ్వల్లేని. 21 పుట.
ఉడిపికోలూనిపోవుచునుండి. 41 పుట.
ద్విపదభారతము తిమ్మకవి (ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రచురణ).

పై ప్రయోగసరళి ననుసరించి యనంతునిఛందోదర్పణమున

క. మొదల......శుభం, బొదవును భయములను హాని వొందు నృసింహా (1-27)

యతి ప్రమాదపతితముగాదు- సరియైనదియే.

ఇంకను భాగవతము, ఏకాదశద్వాదశస్కంధముల నీయతి ప్రయుక్తమైనది.

జ్ఞ - క యతి—

ఈయతిని తిక్కనకుముందు పాల్కురికిసోమనాథుఁడు వాడియున్నాఁడు—

కర్మమధర్మమజ్ఞానమాగడము;(పండితారాధ్యచరిత్ర. పురాతనప్రకరణము 284పుట)

ప్రౌఢకవిమల్లన రుక్మాంగదచరిత్రలో

---

* ఈగ్రంథము శ్రీ పీఠికాపురమహారాజువారు ముద్రించినది. కీ. శే. విమర్శాదర్శక నడకుదిటి వీరరాజుపంతులుగారు పీఠిక 34 పుటలో దీనిగూర్చి చర్చించియున్నారు.

క. ......గాక, జ్ఞానంబునం గడవ మిగులం గల్మషమొందున్ 2-68

అప్పకవి వెనుక నీయతి వాడినకవు లిద్దఱుముగ్గురు కలరు. శిష్టు సర్వశాస్త్రి కృతమగు జ్ఞానప్రసూనాంబికాశతకమున నిది పలుసార్లు ప్రయుక్తమైనది.

మఱియు నీసందర్భమున నీక్రింది ప్రాసలు గమనింపదగినవి.

అజ్ఞాన మనియెడు నంధకారమున మగ్నుడనై నిన్ను మఱచియుండితిని.
(సోమనాథ స్తవము)

ర్జ్గ—ర్గ

శార్ఙ్గం బేమఱు వంచు వంచుకొను చంచద్విభ్రమభ్రూలతల్
జార్గొప్పం గొరకొప్పు చొప్పడరు నల్లం జిల్వచెల్వంబునూ
గార్గోముల్ పలికమ్మవాతెఱల తీయంబొండ్లు, మేలూరుబిం
దూర్గాయల్ జనపర్ణ భాజనములం దొప్పార నర్పింపఁగన్

బహుళాశ్వచరిత్ర, దామెర వెంగళభూపాలుఁడు (4-53) క్రీ. శ. 1600 ప్రాంతము.

స్నా - త - యతి—

పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణము పుట 291 లో

ధారాంబువుల "రుద్రకృతస్నానులై పరుస"

అని యీయతి వాడినాఁడు

దీనిననుసరించి శ్రీనాథుఁడు హరవిలాసములో

ధీనిధి...విభూతిమంగళ, స్నానమొనర్చి ధౌతపరిధానముఁ గట్టి...

అని దీనిని వాడినాఁడు. కాశీఖండమున—

స్నానమహిమంబు భక్తితాత్పర్యగరిమ

అని ప్రయుక్తమైనది. ఇంకను దీనికి ప్రయోగములు గలవు. సంస్కృత పదములు తెనుఁగుభాషాసంప్రదాయము ననుసరించి, యుచ్చారణనను బట్టి తెలుఁగులిపిలో వ్యాప్తిలోనున్న లేఖనసంప్రదాయములను నప్పకవి చక్కబఱచియున్నాఁడు.

యాపనము - యవ్వనము—

అప్పకవీయము 2-106 లో యాపన యాపతి దౌవారిక మొద

లఘుశబ్దములలో ద్వితీయవక్రతమములు మొదల నిలుచునని చెప్పి నాఁడు. దీనికి కారణము కవులు ప్రాసలలో దీని నుపయోగించుటయే.

యౌవనము - యవ్వనము—

ఈశబ్దము సంస్కృతమున యకారవక్రతమము - తద్భవమున 'జవ్వనము' అనురూపము కలదు. ఉచ్చారణమున 'యవ్వనము' అని యుండుటచే 'యవ్వనము' అనురూపము కవిప్రయుక్తమైనది.

1. "క్రొవ్విరితమ్మితావిగొని క్రోలి మదంబ్బునం దేలి తెంటికాం
డెవ్విరి పువ్వుకంపుసోఁగయింప్పని భంగ్గి మహేశుండయ్యెమా
యవ్వనవార్ధి పూర్ణసురతార్థివివర్ధితుండై మదించ్చిమై
దివ్వెండలోకవర్తనకు దేవత లెంత విహీనభాగ్యులో"

నన్నెచోడదేవుని కుమారసంభవము (8-157)

(ఈపాఠము ద్వితీయభాగమున లఘుటీకయందుఁ జూపఁబడినది- వ్రాఁతపుస్తకము ననుసరించి పైని వ్రాసినాఁడను.)

2. "నవ్వుచుఁ జెక్కుమీటి నలినస్ఫుటలోచనమాట లేల నీ
యవ్వనలక్ష్మికిన్ ఘటుఁడ నైతి ననుం గరుణింపు మంచువాఁ
డువ్విళులూరుచుం బలుక నుత్పలగంధియుఁ నోమహాత్మ నీ
కివ్విధ మెట్లు చొప్పడియెనే నొకబ్రాఁతియె నీదుకోర్కికిన్"

అనంతకవి భోజరాజీయము. (7-108.) (క్రీ. శ. 1420 ప్రాంతము)

3. "అవ్వనముల దమయమై
యవ్వనమున నొకటి కొకటి యతిముచు మిగులన్
క్రొవ్విక దుమురికవిసిన
వవ్విపినంబుల మృగంబు లవనీనాథా!"

మడికిసింగన పద్మపురాణము (1-91) (క్రీ. శ. 1420 ప్రాంతము)

4. "యవ్వని కోమలాంగి మఱి యవ్వనితామణి నిన్నుఁ జూడరా
దవ్వనిపోదు నీవలపుదవ్వను బ్రౌఢిక లేదు ముగ్ధవా
త్రువ్వనికాంత దీనిమెడ గ్రువ్వనిపేరుగఁ దోలు మెప్పుడుం
ద్రెవ్వనిబాంధవంబు లెడద్రెవ్వ నిఁకేటికి వేంకటేశ్వరా!" (శృంగారవృత్తపద్యశతకము 37. తాళ్లపాక పెద తిరుమలాచార్యకృతము. క్రీ. శ. 1580 ప్రాంతము.)

ఉ. ఎవ్వరి వరించు మనసించుక నేని కుమారికామణీ
యవ్వన సర్వసుందరశుభాకృతికి న్దగు మోహనాంగుఁడే
డివ్వనరాశివేష్టిత మహాతలనామములంచు లేకఁ దా
నెవ్వగఁ జిత్రభానుఁ డెద నిత్యముఁ జింతిలుచుండె నయ్యెడన్. [ప్రాంతము.
ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము 2-491 తక్కెళ్లపాటి లింగన క్రీ. శ. 1680

పై నివివరించినకవులు వర్ణక్రమము నెఱుంగనివారని చెప్పుటకు వీలులేదుకదా! అనంతామాత్యుఁడు మొదలగుకవులు ప్రామాణికులని చెప్పుటకు సందేహములేదు. శబ్దము మూర్ధ్ని రాని ప్రాసస్థానమున నున్నది. ఇట్లే హాకారవివేకమును 2-161 పద్యములలో నీక్రిందిప్రయోగముల వలన చెప్పియున్నాఁడు.

సింహము - సింహ్వము—

"కనకహర్మ్యంబులై కనుపట్టుసానువ, ద్దంహ్వరాంతరములు సింహ్వమధ్య
శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము. 4-62 (క్రీ. శ. 1580)

గహ్వరశబ్దము బిందుపూర్వకముగ సంస్కృతమున లేదు. ఉచ్చారణ ననుసరించి యీప్రాసమును కవి ప్రయోగించియుండును. ఇట్లే తాళ్లపాక చిన్నన్న యష్టమహిషీకల్యాణమున (కీ. శ. 1545) "గంహ్వరీధరగుహాకడ తెంచి యొక్క సింహ్వంబు నరనాథసింహుపై కెగసి" ప్రయోగించియున్నాఁడు. సింహశబ్దము తిరిగి ప్రయోగించినకవి యీ విధముగ ప్రాసవేయుటకుఁ గారణ మూహింపఁదగియున్నది.

విహ్వల - వింహ్వల

"వింహ్వలితనరకపీరము చక్రము, సైంహికేయగళ సంహారచక్రము"
తాళ్లపాక పెదతిరుమలయ్య సుదర్శనరగడ (క్రీ. శ. 1530 ప్రాంతము.)

రాగితేకులపై 'వింహ్వలిత' అని కలదు. కాని 'వింహ్వలిత' అను రూపము సంస్కృతమున లేదు.

అప్పకవి వలపలి గిలక ప్రాసః—

శివకవులగ్రంథములలో ప్రసిద్ధమైన వలపలిగిలకప్రాసను తిక్కన యుపయోగించెను. దానికి తిక్కన్నకుముందుగల కవులప్రయోగములు

చూపక రేఫలోపము క్రింద నా ప్రాసము చూపియున్నాడు. (2-2421) భర్గుండ - తర్గంగా - నుగ్గాడన్ - మ్రగ్గింతున్ - 11 - 34 అని నన్నె చోడుఁడును, కర్మ - నిర్మాత - తమ్ములు - ఇమ్ముల - అని మల్లికార్జునపండితుఁడును బిజ్జలునకు-కర్జము అని పాల్కురికి సోమనాథుఁడును నీప్రాసము వాడియేయున్నారు. రేఫతోకూడిన శబ్దములన్నియు వలపలిగిలక సంప్రదాయమును ననుసరించి కమ్మ౯ - భగ్గ౯ - కజ్జ౯ అనురీతిని వ్రాయుట తెలుఁగులిపిలో నపవాదములేని సూత్రమని చెప్పవచ్చును. నన్నయ యీనియమమును చక్కగ పాటించినాఁడు. తిక్కన రేఫసంయుక్తమైనప్పుడు సంయుక్తాక్షరమైన రేఫతో యతి కూర్చినాఁడు. కాని క్రీ. శ. 1500 ప్రాంతమువఱకు నక్కడక్కడ కవులు వలపలిగిలకప్రాసమును పాటించినారు.

అప్పకవీయమును చారిత్రకదృష్టితో పరిశీలింప ప్రాచీన లేఖన సంప్రదాయములు భాషాసంప్రదాయములు మనకెన్నో పొడగట్టును. దిక్ప్రదర్శనముగా కొన్నిమాత్రమే చూపితిని.

అప్పకవి భారతకవులను వారి యనుయాయులనే లాక్షణికులుగాను ప్రామాణికులుగాను గ్రహించినాఁడు. కాని, వారిగ్రంథముల లోని పాఠములను, తనకాలమునాటి భాషాసంప్రదాయములకనువగునట్లు మార్చియున్నాఁడు.

ఖండాఖండప్రాస — ఈప్రాసమును నన్నయ తిక్కనాదికవులుపయోగించిరని (పీఁవు - నన్నయ - చీఁకటి - తిక్కన,) అప్పకవిచూపుట అర్ధానుస్వారచరిత్రకు విరుద్ధము. అనంతునికాలము క్రీ. శ. 1430 ప్రాంతమువఱకు నీయతి చక్కగా పాటింపబడుచుండెను. అప్పకవి ఖండాఖండప్రాసములు ధారాళముగా వెలసినకాలమువాఁడగుటచే ప్రాచీనకవులుకూడ తనమతము ననుసరించినాడని చెప్పుట కీపాఠముల నుదాహరించినాఁడు. నేఁడు లభ్యములైన దీర్ఘపూర్వకపూర్ణబిందుప్రాసల ప్రయోగములనుబట్టి అప్పకవి యుదాహృతు లెంతమాత్రము సరికావు.

అఖండవడిః—

ఓలమాసపడు అనుపదములో మకువ్యంజనయతి ఆనుశాసనిక పర్వము (1 - 68)లో నిట్లుగలదు.

క. అతిథి నినుఁగోరె నేమియు, మతిఁ గింకిరిపడక యోలమాసపడక నీ, వతనికి...

లింగమగుంట తిమ్మన దీని నుదాహరింపఁగా 'నప్రశస్తలత్వము క్రింద నఖండవడి క్రింద పరిగణించి యప్పకవి దీనిని

క. ......గోరనేనియు, నలికింకిరిపడక యోలమాసపడక

అని యుదాహరించియున్నాఁడు.

అప్పకవికంటె రెండుశతాబ్దులు ముందుగ క్రీ. శ. 1407 ప్రాంత ముననున్న విన్నకోట పెద్దనకావ్యాలంకారచూడామణిలో నీపదమును దేశీయవళిక్రింద నిచ్చియున్నాఁడు చూడుఁడు.

ఉ. కలకరి, కల్లడంబు కడుకట్టిఁడి కమ్మెరలోలమాస గ్ర
చ్చుల యెసలారు లుల్లుగులాడెడి పీలలడి రజ్జులాఁగు గ్రి
క్కిలియుంట నాతెఱంగునను నీయుభయంబు వళిప్రకారమై
తెలియఁ గవిప్రయోగమున మేల మెఱింగి రచింపనేర్చినన్.

సప్తమోల్లాసము 69 పద్యము.

పెద్దన ఓలమాస ఉభయవళి యని చెప్పుచుండగా నప్పకవి యప్రశస్తమనుట, యెంత ప్రామాణికమో విజ్ఞు లూహింతురు గాక!

అభేదవర్గవళ్లు (పుట 14?)

నెపము - నెవము

ఆదిపర్వము 1-126లో మహీవల్లభ! తత్కథము నెవంబున అను పాఠమును, 'మహీవల్లభ! తత్కథము నెపంబున' అని వపలకు నభేద యతిని చూపినాడు. కాని యచ్చట పాఠము నెవమేగాని నెపముకా దని యీ క్రింది శ్రీనాథమహాకవి నైషధప్రయోగము నిర్ధారణచేయు చున్నది.

"చివురుకెమ్మోవిచిలుగాటు నెవముగాక"(1 - 47) ఇచ్చట చివురు రూపాంతరము చిగురుగాని చిపురు కాదుగదా. కావున నెవమనుటయే సరి. కాని వేదమువారి నైషధసర్వంకషవ్యాఖ్య 674 పుటలో చిగురు

కెమ్మోవి చిలుగాటు నెపముగాక అనుపాఠ మల్లే సవరింపఁబడకుండుట వింత !

స్వవర్గజప్రాసమునకు విరాటపర్వములోని (1 - 135)

ఉ. ఎండకు వానకోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోట నాకనా
కొంటినలంగితిన్ని దురకుందఱి తప్పెను

అనుపద్య ముదాహృతమైనది. ఇచట ప్రాచీనపాఠములన్నియు "ఆ+కొండునలంగుదున్ని దురకుందఱిదప్పె"అనియే యున్నవి. ఆకొంటిని అనుభూతకాలికప్రయోగమును తిక్కనచేసినను భ్రాంతిచే నప్పకవి దీనిని చూపినాఁడు. కాని, భావికాలక్రియలో కందును, కొందును, విందును, మందును మొదలగువాని క్రియారూపములలో కొండును, విండును, మండును కండును అనునవియే పూర్వరూపములు. నిర్వచనోత్తరరామాయణములో 'జెర్చునట్లు నీయన్వయనామధేయములు విండున్ జెప్పు. 4-7

భారతములో ఉద్యోగపర్వములో (1 - 237) మార్కొండున్. సౌప్తికపర్వములో 1. తేజము గండున్నె నొండు లేక అను ప్రయోగములు గలవు. తక్కినకవులయం దిట్టిప్రయోగములు గలవు ఇట్టి రూపములాయా క్రియల ప్రాచీనస్వరూపములను, గుర్తించుటకు తోడ్పడును.

అప్పకవిపాఠములను ప్రాచీనప్రయోగములతో నెట్లు సమన్వయముచేయవలెనో చూపుటకు కొన్నింటిని చూపితిని.

ఇట్లెన్నియో యప్పకవి యిచ్చినవిషయములను, నుపలబ్ధములగు గ్రంథాంతరసంవాదములనుబట్టి సవిమర్శముగా నిరూపింపవచ్చును.

ఇందులో యతిప్రాసవిషయికమగు తృతీయాశ్వాసమునకు విపుల పీఠికా వివరణవ్యాఖ్యాసమేతముగఁ బ్రకటితమగును గాన ప్రస్తుతము విరమింతును.

ఉపలబ్ధములగు ఛందోలక్షణగ్రంథములనుగూర్చి కూలంకషముగఁ బరిశోధించిన కేవలభాషాసంప్రదాయములేగాక అజ్ఞాతముగ నున్నకవులు, కావ్యములు మన కెఱుకపడి, మనవాఙ్మయస్వరూపమును తెలుపును.

"ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము" వలె నేడు మనకు "ఆంధ్రచ్ఛందస్సంహితాసర్వస్వము" అత్యవసరమైయున్నది. ముద్రితాముద్రితములగు సమస్తాంధ్రచ్ఛందోలక్షణగ్రంథములును లక్ష్యలక్షణప్రయోగపూర్వకముగను, ఉదాహృతగ్రంథస్థసాధుపాఠనిర్ణాయకముగను, చారిత్రకక్రమనిరూపితముగను వ్యాకరణాలంకారశాస్త్రవిషయికవివరణసహితముగను సంగ్రథితమైన "ఆంధ్రచ్ఛందస్సంహితాసర్వస్వము వెలసిననాడే ఆంధ్రభాషాసారస్వతనిజస్వరూపము సువ్యక్తమై విరాజిల్లగలదు.

అట్టిమహాగ్రంథరచనము శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి మూలముననే యభివ్యక్తమగు నవకాశము గలదు. శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారీమహాకార్యనిర్వాహణమునకు కడంగుదురుగాక!

చెన్నపురి
25-3-1951

ఇట్లు
నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

# పీఠిక

అఖిలాంధ్ర భాషావిద్వల్లోకమున విశేషాదరము నొందినఛందో గ్రంథము అప్పకవీయ మొక్కటియే. ఇయ్యది కాకునూరి అప్పకవి రచితము. ఈతఁడు భారద్వాజసగోత్రుఁడు. ఈతనితండ్రి వెంగన; తల్లి నేసు. పీఠిక 73-వ పద్యమునుబట్టి యీతని పితృవర్గీయులెల్లరు కాకునూరనున గ్రహారమున నుండెడివారని తెలియనగు. కామేపల్లెలోని శ్రీ గోపాలకృష్ణున కీతఁడు భక్తుఁడు. ఆతనిప్రేరణముననే తా నీగ్రంథరచనమునకుఁ గడఁగినట్లు పీఠికలోని 66-వ ప. వలనఁ దెలియుచున్నది. ఇది పితామహాగ్రహారమై యుండవచ్చు. ఈకామేపల్లి పల్నాడు తాలూకాలోని దనియు ఏలేశ్వరమునకు తూర్పున ఏడుయోజనముల లోను కేతవరమునకు నైరృతిదిక్కున మూఁడుయోజనములలోను నున్నదని చెప్పెదరు. పీఠికలోని 33-వ పద్యమునుబట్టి యీతఁడు 17-వ శతాబ్దపువాఁడుగాఁ దెలియుచున్నది. పీ. 78-83-వ పద్యములలో తన వంశావళిని నీతఁడు స్పష్టముగ చెప్పియున్నందున మరల నిచట వివరింప నవసరము లేదు.

అప్పకవి తననాఁటి కుపలభ్యములగుచున్న పెక్కులక్షణగ్రంథములను పరిశీలించి అవియన్నియు నసమగ్రములని యెంచి తా నీసమగ్రగ్రంథమును వ్రాయ నెంచినట్లును దీన నవియన్నియు గతార్థములగు ననియుఁ జెప్పి యదియు నన్నయభట్టారకవిరచితాంధ్రశబ్దచింతామణి కాంధ్రవ్యాఖ్యారూప మనియు చెప్పియున్నాఁడు. కాని లోకమున దీనికి వ్యాకృతిగ్రంథముగఁగాక ఛందోగ్రంథముగనే ప్రచారమున్నది. ఇందు తెలిపినవ్యాకరణ విషయము లత్యల్పములు. ఇయ్యది ఐదాశ్వాసముల యసమగ్రగ్రంథము. ఇందు సవిమర్శముగాఁ దెలిసికొనదగినది వళిప్రాసపరిచ్ఛేద మొక్కటియే. స్థలసంకోచముచే దీనివిమర్శన మిటఁగాక ప్రత్యేకగ్రంథముగ వెలువరింపఁగలము.

తెనుఁగున మొదటిఛందోగ్రంథమైనకవిజనాశ్రయమున నత్యంత పరిమితములుగనుండిన యతు లానాటికానాఁడు పెరిఁగి అప్పకవినాటికి

నలువదికిపైని గానవచ్చుచున్నవి. ఇంకను నిందు చేరనివి కొన్నికలవని యీతనితరువాతివారు చెప్పియున్నారు. తెనుఁగుభాషాస్వరూపనిర్ణాయకములును, స్వరూపపరిరక్షకములునునైన నియతు లిట్టులు పెరిఁగిన వాని ప్రయోజనము సన్నగిల్లునేమో ?

తెనుఁగునాటిపండితప్రవరుల కశేషభాషాపాండిత్యప్రకర్షపూర్వకాలమునసున్నను దేవనాగరిలిపి యొలుఁగనందునను తెనుఁగులిపినినైన సరిగా వర్ణక్రమము వ్రాయుకపోవుటచేతను యతిస్థానముల కొన్నిభ్రమ లేర్పడుచుండెడివి. కనుకనే అప్పకవి శబ్దస్వరూపములఁదెలుపుటలో జాగ్రత్త చూపినాఁడు. కాని యెంతజాగ్రత చూపినను నాకాలమునాటి యలవాటుచే తానుగూడ కొన్నియెడల జారితప్పక తప్పినదిగాదు.

తెనుఁగువ్రాయసగాండ్రు శబ్దగతములైన 'ఋ'కారమును భ్రమచే 'రి' 'రు' కారములుగాను 'సింహ' శబ్దమును 'శింహ్వ' గాను "గహ్వర" శబ్దము "గంహ్వర"గాను ఇంకెన్నియో యిట్టులు మారులిపిని వ్రాయుచుండెడివారు. కనుకనే 'ఋ' వడి పలువిధములై ప్రచారములోనికి వచ్చినది.—

అప్పకవీయద్వితీయాశ్వాసమున 66 వ పద్యపు నాల్గవపాదమందు—"ధ్రువమును ద్రుతమును ధునిక్రారకొమ్ములై తనరారు కాని ఋత్వములుగావు" అని తానుచెప్పియు, చతుర్థాశ్వాసమున హారనర్తన వృత్తమునందును, గోమూత్రికాబంధమునందును ధృవశబ్దమును ధ్రువశబ్దముగా భావించి యతిస్థానమున నిలిపినాఁడు. అటులనే వరాహమను వృత్తమునఁగూడ కనబడుచున్నదిగాని తరువాతివారెవరో దానిని "దృఢముగ" యని సవరించియున్నారు.

ఇటులనే తెనుఁగుశబ్దమున లఘ్వలఘు రేఫములస్థితియు నిర్ణయసాధ్యముకాదు. ఇటులుండ వీనికి యతిప్రాసమిత్రత్వము కఠినముగ నిషిద్ధము. తీవ్రముగ నిషేధించిన యప్పకవియే మూఁడునాల్గుతావుల పొరబడినటులు గానవచ్చుచున్నవి. కొందఱు దానిని (అప్పకవిచేసిన యీపొరపాటును) సరిచేసి యాతని కపకీర్తిలేకుండఁజేయ నెంతురుగాని యది అత్యుత్తమముకాదు. "సిద్ధత్వేవం, అపాణినీయంతు భవతి" యనుభాషోక్తిని గమనింపుడు. "ప్రమాదో ధీమతామపి" గదా!

ఇఁక రెండవయాశ్వాసముననే:—

తే. ఆఁగె లోఁగెను వీఁగెను డాఁగె నేఁగె
వాఁగె ననునివి మొదలగువాక్యములను
బొదలు నక్షరములు చిన్నబొట్టుపై గ
కారములుగాని యనునాసికములుగావు. (2-116)

అనుపద్య మున్నది. ఇయ్యది "వాస్యాక్వచిద్గకారోవ......" ఇత్యాది సూత్ర వివరణములోనిది. ఇట అనునాసికానునాసికవర్ణనిరూపణ మావశ్యకము కాదు కనుక ఈపద్యపునాల్గవపాదము—కారములుగాని యంతస్థకములుగావు అనియుండదగునేమో! అయిన నాడు అర్థానుస్వారపూర్వకమైన గకారము వకారము కాదనియు వకారముగా మారిన గకారమునకు పూర్వమందు నరసున్న లేదనియు నిశ్చయించుకొనవలసి వచ్చును. అపుడు కొందఱిచే 'తీఁగ' శబ్దములో వాడబడునరసున్న యుండఁదగునా యని శంక కలుగుచున్నది.

తీఁగ = తీగె = తీగియ = తీవియ తీవ యనిరూపములున్నట్లున్నది. కాక అప్పకవి "తీగియలు తీవియలు" అని 2-112 పద్యమున చెప్పియున్నాడు. తీగయొక్క రూపాంతరము "తీగియ" యగు యది 'తీవియ' యయిననా డరసున్న యెట్లుండును?

మూఁడవయాశ్వాసమున ప్రత్యేకయతి యనుశీర్షిక క్రింద

తే. ఉత్తరపదాద్యలిపిలోప మొదవకుండు
తఱిని ప్రత్యేకయతి నాఁగఁ దనరుచుండు
నరయ శార్ఙ్గంబు హరచేతియదియు నాఁగ
దివ్యచాపంబు శూలిచేతిది యనంగ.

అని యింతవఱకు ముద్రితమైయున్నది. కాని యిందుదాహరణము స్పష్టముగ దెలియుటలేదు. కాక ఈ ప్రత్యేకయతియందలి ప్రత్యేకత కానరాదు. మేము విచారింపఁగా

"ఉత్తర..............వుచుండు
.................
నరయ..............నాక

యుని యింట నుండఁదగు ననియు దోఁచుచున్నది—అప్పుడు 'అది-అవి' యనుశబ్దము లుత్తరపదము లైననాఁడు అకారమునకు లోపము వికల్పముగా వచ్చును. ఆ వచ్చినపుడుకూడ స్వర(అకార)మైత్రి కూర్ప వచ్చుననుదానినే ప్రత్యేకయతి యనదగును అని అభిప్రాయమైయుండఁ దగు. అపుడుగూడ అప్పకవి లక్ష్యమును సరిగా చూపలేదు.

కొన్నిదినముల క్రిందట శ్రీవేపుల రామశాస్త్రిగారు అప్పకవీయ తృతీయాశ్వాసవివరణమున నీపద్యమున కిటునటు త్రిప్పి కడకీయర్థము నొకింత సూచించిరి కాని పద్యము యథాస్థితముగ నున్నచో నీయర్థ మెటులు ప్రాప్తించునో తెలియఁజేయరైరి. కాని వారుచూపినకళా పూర్ణోదయమునందలి "అనగఁ దన్మూల మెట్టిదియొ యనఁగ" అను నయిదవయాశ్వాసమునందలి యుదాహరణము సరియగునేమో యని తోఁచుచున్నది. కాని దీనిని గూఢస్వరయతిలోఁ జేర్పవచ్చునని వారు వ్రాసియున్నారు. అది సరికాదు. గూఢస్వరయతికి నిచ్చినయుదాహర ణములలో అకారమంతర్భూతమై (వర్ణాంతరసంయోగమున రూపాంత రమునొందినదై) కానవచ్చుచుండుట నాపేరు సార్థకము. కానియిటనో అకారము లుప్తము. ఇది గూఢస్వరయతి యెట్లగును? కనుక నీప్రత్యేక యతి నిట్లూహించుట సరియగునేమో పండితవరులరయుదురుగాక !

మఱియు 3-292 పద్య మింతవఱకు "వట్రువయు ద్విత్వ మును"—అని ముద్రింపఁబడి 'ద్విత్వమును' అనుదానికి "ఐత్వ మును" అనుపాఠాంతరమును జూపియున్నారు. కాని ఈయథ సూచికలోఁ జూపఁబడినదియే సరియగుపాఠ మని మే మీముద్రణమున పరిగ్రహించియున్నాము. ఋకారమును ఐత్వమును వివిధములుగ వ్రాతలలో వ్రాయుచుండుటచే దాని నెఱిఁగిన అప్పకవిప్రాసముల భ్రమింతురని పాఠకులకు నివి ప్రత్యేకాచ్చులుగాని హల్లులు కానేరవని తెలుపుచున్నాఁడు. అయిన నైత్వమున కుదాహరణము చూపలేదు. ఐత్వము ప్రాచీనకాలమున నెటువలె వ్రాయఁబడెడిదో ఈ క్రింది శాసనలేఖనమును చూచిన తెలియగలదు.

పెలయంగ నియ్యొట్టు లుస్సిమనినుఱై విడిడునవోౕలు

... ... ... ... ...

నలియంబయ్యూవ్వరల ... ... ... (శా. ప. మ. 1)

మఱియు నీగ్రంథమందలి చతుర్థాశ్వాసమునందలి 50-వ పద్యము కూడ నీపాఠమునే బలపఱచుచున్నది. చూ. "ఆ. వ్యంజనాక్షరంబు లందుఁ గ్రిందటివ్రాఁత లైన వత్రుసుడులు నైత్వములును" అని యున్నది. ఇటుల చెప్పుచున్న నెన్నియో పెరుఁగును. ముద్రణ సౌకర్యములులేని మూఁడు శతాబ్దుల క్రిందటిరోజులలో తాళపత్ర గ్రంథముల నెన్నిటినో శోధించి యింతటియుద్గ్రంథమును రచించిన అప్పకవి యెడల నెంతయుకృతజ్ఞత చూపవలసియున్నది. కాచిత్కముగ నెచ్చటనేని లోపములున్నను అయ్యవి "ఏకోహిదోషో" యన్నట్లు గుణములచాటున డాఁగును. లోపము లేని గ్రంథ మేదియున్నది?

అప్పకవీయపంచమముద్రణసమయమున భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి ఆజ్ఞపైని నా మిత్రులు విద్వాన్ శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారును నేనును గలిసి అప్పకవీయము నాద్యంతము చూచి చిన్నచిన్నసవరణ లవసరమైనచోట చేసియున్నాము. ఒప్పుతప్పులు పండితులేర్చుదురుగాక! ఇంతటియుద్గ్రంథమును అక్షరశః చూడనవకాశము గల్పించిన శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారి కెంతయు కృతజ్ఞులము.

ఇట్లు,

శ్రీమత్కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు,

వ్యాకరణవిద్యాప్రవీణ.

# విషయసూచిక.

C

శ్రీరస్తు

# అప్పకవీయము

## పీఠిక



యు న్స్వామియు నాఁగఁ బ్రాచిని బ్రతీచిన్ రుక్మిణీదేవి స
త్యాయోషామణియు న్మహోత్సుకత సేయ న్సంగల న్మోద్భవుఁగే
ల్లోయిం దార్క్ష్యమరుత్సుతు ల్గొలువ శ్రీదుండేలు నాప్రోలిమో
పై యాకామెపలి న్వసించు హరి నిత్యంబు న్మముం బ్రోవుతన్. 1

తే. కమల యొందున దనరూపు గాంచి యలిగి
యాత్మ తరళాంతరమున నిజాధినాథు
తను పతఁడు చూపఁ గని చిత్తమునఁ జెలంగు
నట్టికౌస్తుభమణి హృదయమునఁ దలఁతు. 2

క. వననిధినందన కుయ్యేల, యనువునఁ దనరారి వారిజాక్షునివక్షం
బున నొప్పువైజయంతీ, వనమాలిక నా కొసంగు [2]వాగ్వైభవమున్. 3

తే. కౌస్తుభంబును వనమాలికయును దనకు, దిగువగా నొప్ప నొసలిపై దిద్దినట్టి
తిలకమునకు సమంబుగా వెలయునట్టి, చక్రి శ్రీవత్సచిహ్నంబు సంస్మరింతు. 4

మ. ధరఁ గాళిందితటంబునం గలుగుబృందాకాననాంతంబునం
బరితోషాతిశయాళి మోహమున గోపస్త్రీమణుల్ గుంపులై
హరిఁ జేరం జనుదెంతు రెందుఁ జనుదెం చానాద మాలించి స
త్వరయానంబులతోడ నట్టిమురళిన్ వర్ణింతు నిష్టాప్తికిన్. 5

సీ. పాంచజన్యం బనఁ బరఁగి దైత్యారాతి[3]యెడమను పైకేల నెసఁగు నెద్ది
మొగి సుదర్శననామమునను [4]మాధవుదక్షిణాగ్రహస్తంబున నమరు నెద్ది

---

1 కే. 2 వాంఛితఫలమున్ (వా). 3 యడమను బయికేల నమరునెద్ది (వా).
4 కృష్ణుని (వా).

N. B. (వా) వావిళ్లవారిప్రతి. (ప) పరవస్తువారిప్రతి. (పె) పెండ్యాలవారి ప్రతి యని గ్రహించునది.

కౌమోదకీసంజ్ఞ గని కృష్ణుదాపలిరెండవకరమున నుండు నెద్ది
నందకం బనుపేర నారాయణునికుడిక్రిందటిచే వెలుఁగొందు నెద్ది
తే. శార్ఙ్గ మనఁ దనరారి కేశవునివామ, బాహుయుగమూలమునఁ గనుపట్టు నెద్ది
యట్టిహరిదైదుకైదువు లబ్జచక్ర, ఘనగదాఖడ్గచాపముల్ మనుచు మమ్ము. 6
తే. కాలమేఘమునందుఁ బ్రకాశ మొందు, కాఱుమెఱుఁగుతెఱంగునఁ గైటభారి
యంసములపై వెలుంగుపీతాంబరంబు, బంగరుచెఱంగు మాకు శుభంబు లొసఁగు. 7
క. బాలతమాలాగ్రమునం, గ్రాలుశచీనాథుకార్ముకంబో యనఁగా
నీలఘనదేహుఁ డగుగో, పాలుతలన్ మెఱయు బర్హిబర్హము నెంతున్. 8
క. భువనగకచ్ఛపకిరిమా, నవసింహాదిత్యభృగుజనరాఘవయా
దవబుద్ధకల్కు లనుకే, శవుపదిరూపములు మది నజస్రముఁ దలఁతున్. 9
శా. శ్రీమన్మందకటాక్షవీక్షణము లైఁ జిల్కం బయోజేక్షణం
డామోదంబున నర్మగర్భసరసేష్టాలాపముల్ వల్కఁగా
వేమాఱుం దరహాసమాననమునం [1]బెంపొందఁగాఁ గొల్చు శ్రీ
భూముల్ నిచ్చలు మా కొసంగుదురు సంపూర్ణంబు గా నిచ్చలన్. 10
క. దాంతు హరిచరణ[2]భక్తి, స్వాంతు రసాతలనిశాంతు నత్యంతదయా
వంతు సమతీతవిధిక, ల్పాంతుఁ బరమశాంతు నయ్యనంతుఁ దలంతున్. 11
తే. నామదిఁ దలంచెద సుపర్ణనామధేయుం, మురహరవిధేయుం నమరసమూహగేయుఁ
గనకనిభకాయుం భక్షితకాద్రవేయుం, వక్త్రకాంతిజితాత్రేయుం వైనతేయుం. 12
క. తిన్ననివేత్రము కలుముల, కన్నియ [3]వన్నియను హస్తకమలతలమునం
జెన్నొందు జగము మనిపెడు, వెన్నునిదళవాయిఁ దలఁతు విష్వక్సేనున్. 13
ఉ. పాయక కొల్తు రామజనపాలుఁడు జానకిఁ జూడ నంపుచోఁ
దోయధి గోష్పదంబుక్రియఁ దోఁపఁ జిరాలున దాఁటి లంక క
త్యాయతలీలఁ బోయి దివిజారుల దోమలఁబోలెఁ బట్టి బా
హాయతశక్తిఁ గొట్టి సతి నారసి తద్విభుఁ గన్నమారుతిన్. 14
క. శుక భీష్మ విభీషణ శౌ, నక రుక్మాంగద వసిష్ఠ నారద బక దా
ల్భ్య కిరీటి పుండరీకులఁ, బ్రకటితహరిపాదపద్మభక్తులఁ దలఁతున్. 15
వ. అని యివ్విధంబున. 16
క. సాతతహేతి పరిజన, వ్రాతంబుగ శేషశయను వనరుహనయనున్
ఖ్యాతిగ "న హరేస్తు పర, స్త్రాత" యనుట దెలిసి కృతిమొదలఁ దలఁచి వెసన్. 17

1 విప్పొంద. 2 వర్తి. 3 వన్నెయును.

## బ్రహ్మాదిస్తవము

చ. తనజనికారణం బయిన తామరకున్ హితుఁ డౌటచే విక
ర్తనునకు వేయిఘృష్టు లిడి దానికి శత్రుఁడు గాన నేణచి
హ్నునకుఁ బదేను జేసి యవియున్ శిఖిభానుముఖామరాళిచే
దిన మొక టప్పగైకొనను దిద్దను జేయువిధాతఁ గొల్చెదన్. 18

క. శారద విద్యాజాలవి, శారద నను బ్రోచుకొఱకు సారె భజింతున్
శారదనీరదనారద, పారద[1]హారదరహీర పాండుశరీరన్. 19

చ. కడుకఠినంబు లద్రులు జగంబుల నందున సంభవించి పెం
పడరునినుం గరంచ వశమా యని నన్నిపు డంటివే కదా
వడిఁ గనకాద్రి చాపముగ వంచిననీకు హిమాద్రిజాత యా
పడఁతిఁ గరంచు టెంత యనుపార్వతి మెచ్చుశివుం దలంచెదన్. 20

చ. పరిణయవేళయందుఁ దనపాదముఁ [2]బట్టుక సన్నెకంటిపైఁ
దిరముగ మోపి కంతునకుఁ దీరెఁ గదా పగ యంచు నీలకం
ధరుఁడు దరస్మితుం డగుటఁ దద్వలయాహిఫణాగ్రరత్నసం
దరముకురంబునం గని యెద న్ముద మందుభవానిఁ గొల్చెదన్. 21

చ. తనుఁ గని మొక్కయెత్తునని దక్షజయు న్నిటలాక్షుఁడు న్ముదం
బున నిరుచెక్కులుం గదిసి ముద్దు గొనంగ నొకింత నెమ్మొగం
బనువుగ వెన్కకుం దిగిచి యత్నవిహీనపరస్పరాస్యచుం
బనములు దల్లిదండ్రులకుఁ బన్నుగఁ గూర్చు[3]గజాస్యు నెన్నెదన్. 22

చ. జనకునిఁ గొల్వ వచ్చునలచామరకర్ణుని తేజి నందివా
హనుముకుటాహిఁ గాంచి భయమంది పిఱిందికిఁ బోవఁ జూచినం
దనశిఖిమావు దీకొలిపి దానిభయంబు హరించి పూర్వజా
తునకు ముదం బొనర్చుగుహు దుర్ధరశక్తివహు న్భజించెదన్. 23

క. హరిశిఖియమదైత్యాంబుప, మరుద్ధనపశివు లిభాజమహిషనరాంభ
శ్చరహరిణపుష్పకవృష, ప్రరుచిరవాహనులు మమ్ము రక్షింతు రొగిన్. 24

క. రవిశశికుజబుధసురగురు, కవిభానుజరాహుకేతుగణములు నాకుం
దవిలి ఘటంబున [4]నుండుచు, †సవ నిత్తురు గాత సకల సంపద లెపుడున్. 25

---

1 హారతార; హారదరద; దరహార 2 బట్టియుం. 3 గణేశు (వా). 4 నుండెదు (వా). †సవక్ = క్రీడచే, 'సవో యజ్ఞః సవా క్రీడా' అభియుక్తవచనము.

## కవిస్తుతి

సీ. వల్మీకభవుపాదవనరుహంబులు గొల్చి సాత్యవతేయుఁ బూజనము సల్పి
భట్టబాణునివచఃప్రాభవంబు గణించి కాళిదాసుని కిరుగేలు మోడ్చి
పండితాగ్రేసరు దండి వక్కాణించి భవభూతివాక్యజృంభణము మెచ్చి
జయదేవునకు నమస్కారంబు గావించి మల్హాణు హృదయసద్మమున నుంచి
తే. చోరుఁ గడుఁ బ్రస్తుతించి మయూరు నెంచి, మాఘుభూషించి భారవి మదిఁదలంచి
హీరునకు మ్రొక్కి కవితావిహారమతుల, నితరవిద్వత్ప్రకాండుల నతులు చేసి. 26
సీ. శబ్దశాసనుపాదజలజంబులు భజించి యుభయసత్కవిమిత్త్రు [1]నభినుతించి
శంభుదాసునకు నంజలి వేడ్క నొనరించి సహజపాండిత్యుని సంస్మరించి
సకలవిద్యాసనాథకవీంద్రుఁ గొనియాడి సౌజన్యజేయువాక్సరణిఁ బొగడి
తగ నంధ్రకవితాపితామహు వర్ణించి సుజనవిధేయు హెచ్చుగ నుతించి
తే. రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాదిహరివాక్య
గౌరవము పెక్కుభంగుల గణన చేసి, పిదప నితరాంధ్రకవులకుఁ బ్రియమువలికి.
తే. కాళిదాసమయూరాదికవుల కైనఁ, గలవు తప్పు లనంగ నన్యులకు లేవె
దిద్దఁ దగుపట్ల దిద్దుఁడు దిద్ద రాని, యెడల నానేరములు క్షమియించు టొప్పు. 28
వ. అని వర్తమానకవులం బ్రార్థించి. 29
క. వినఁదగు వెండియుఁ బొత్తముఁ, గనఁ దగు బుధజనుల నడుగఁగాఁ దగుఁగా నెం
దును దెలియనిపట్టునఁ ద, ప్పున వల దని భావిజనుల కంజలి మోడ్తున్. 30

## గురుస్తుతి

సీ. ఆదిని రెండవవేదంబు చెప్పినమూర్తిసర్వజ్ఞుఁ గ్రమస్వరాదిఁ
దరువాత శబ్దశాస్త్రముఁ జదివించినకాండూరిగిరిదేశికప్రకాండు
సామీఁద సకలసిద్ధాంతము తెలిపినధీరవర్యుఁ బ్రధానిసూరభట్టు
వెస నన్ను లక్షణవేత్తఁ గావించినఘను మంచికంటియోబనకవీంద్రు
తే. స్మార్తకర్మంబు లెఱిఁగించి సభలఁ బూజ్యుఁ, జేయుననకొలిచలిమల్లసింగనార్యు
నాగమము లుపదేశించినట్టిరాజ, యోగివర్యునిఁ దలఁతు విద్యాగురులను. 31
క. అని యిష్టదేవతాస్తుతి, యును సకలకవీంద్రులనుతియును గురునుతియుం
వినయమున సలిపి తెలుఁగున, ఘనకావ్యం బొకటి సేయఁగాఁ దలఁచుతఱిన్. 32

---

1 నుచ్చరించి (వా).

## స్వప్న ప్రకారము

సీ. ధాత రెండవపరార్థమున నాదిదినంబునఁగటి వరాహకల్పంబునందు
మహితవైవస్వతమనువేళ దేశంబు లర్థించ నైనమహాయుగమునఁ
గలియుగంబునఁ దొలిచరణంబున మానితం బగుచాంద్రమానమునను
శాలివాహననామశకమున గజశైలశరసుధాకిరణులసంఖ్య (1578) నడవ
తే. నంగజాబ్దంబునను దక్షిణాయనమున, జలధరర్తువు మొదలిమాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టి, నట్టియష్టమి నను దేర నధికభక్తి. 33

సీ. చక్రవాళాంతరక్ష్మామధ్యసంస్థితదైవతగోత్రంబు దక్షిణమున
లవణాబ్ధివేష్టితలక్షయోజనసువిస్తారజంబూద్వీపతలమునందు
భరతవర్షంబున భరతఖండంబున మంగళోర్వి గర్మమహితభూమి
మలయవింధ్యాచలమధ్యమంబునఁ గృష్ణయామ్యతీరమున బ్రహ్మాశ్రమమున
తే. దండకాటవి సంధాభిధానపుణ్య, దేశమున శ్రీగిరీశాన్యదిశను గొండ
వీటిపదమటఁ దంగెడవిషయమునను, గామెపల్లిని గోపాలధామమునను. 34

క. కల్పోక్తమార్గమున సం, కల్పము గావించి గోపికాపిభుపూజల్
సల్పి మది నతనిపదములు, నిల్పి పురాణార్థగోష్ఠి నిశ గడపునెడన్. 35

సీ. మిగులఁ జేతులరెంట మేటిశంఖంబును జుట్టుఁగైదువయును బట్టువాఁడు
ముద్దులగుమ్మ లౌముద్దియ లిద్దఱు కైదండ లిడ నీటు గలుగువాఁడు
బంగారుచెఱఁగులపచ్చనిపాంబట్టుదుప్పటి యొల్లెవా టొప్పువాఁడు
హారకేయూరమంజీరకోటీరాది[1]భూషణంబులు చాలఁ[2]బూనువాఁడు
తే. నుదుటఁ గస్తూరితిలకంబు వొదలువాఁడు
తలఁచి చూచిన నాకులదైవ మగుచుఁ
[3]బోలుచునాకులదైవంబుఁ బోలువాఁడు
నిలిచె నొకరుఁడు నాదుముంగలను [4]గలను. 36

వ. ఇట్లు నిలిచిన. 37

క. కరములు రెంటను దాల్చిన, పరికరములు చూచి యతనిఁ బరమేశునిఁ గాఁ
బరికించి లేచి వలగొని, మురియుచు సాష్టాంగదండము లొనర్చి వెసన్. 38

---

1 భూషణంబులఁ జాలఁ (వ). 2 బొదలువాఁడు (వా). 3 బోల్చుఁ (వా).
4 వెసను.

## భగవద్వాక్యము

ఆ. మోడ్పుఁగేలు ఫాలమునఁ జేర్చుకొని యేఁన్నఁ,గరుణ నతఁడు నన్నుఁ గాంచి పలికె
న న్నెఱింగి వందనం బొనర్చితి వత్స, మెప్పు పుట్టె నీదు మెలఁకువకును. 39

ఉ. ఈయువతుల్ రమాధరణు లేను బయోరుహపత్రనేత్రుఁడన్
నీయెడఁ గూర్మి గల్గి ధరణీదివిజోత్తమ వచ్చినాఁడ*శ్వ
శ్శ్రేయస మబ్బు నీకు నిఁక సిద్ధము నన్నయఫక్కి యంధ్రముం
జేయుము మాయనుగ్రహముచేఁ గవు లచ్చెరు వంది మెచ్చఁగన్. 40

క. వినియును గనియును నెఱుఁగని, ఘనఫక్కిం దెనుఁగుఁజేయఁగా నెట్టగు నా
కన వలదు దానిలక్షణ, మును నీ కది గలుగుచందమును విను మింకన్. 41

## గ్రంథప్రభావము

తే. ఆంధ్రశబ్దచింతామణివ్యాకరణము,ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు దొల్లి, పర్వములు మూఁడు శ్రీమహాభారతమున. 42

వ. ఆసమయంబున. 43

తే. భారతముఁ దెనుఁగించుచుఁ దాఁ,రచించి,నట్టిరాఘవపాండవీయము నడంచె
ఛందము నడంచ నీఫక్కి సంగ్రహించె,ననుచు భీమన మ్రుచ్చిలి యడఁచె దాని. 44

వ. తదనంతరంబ. 45

ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది పఠింపఁగాఁ బడియె నెందును దానినె కాని సూత్రసం
పాదనలేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటి కవిరాక్షసుఁ డీనియమంబుఁ జేసినన్. 46

క. ఆమూఁడుపర్వములలో, నామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను, ధీమణి మొదలైనతొంటితెనుఁగుకవీంద్రుల్. 47

తే. రాజరాజనరేంద్రతనూజుఁ డార్య, సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బఠనం బొనర్చె, నన్య లెవ్వ రెఱుంగ రీయంధ్రపక్కి.

క. అతఁడు దనకాళ్లుఁ జేతులు, మఱి నెడి జనకుండు దరుగ మత్స్యేంద్రునిసం
గతి నవి క్రమ్మఱ మొలచిన, క్షితి సిద్ధులఁ గలసి యుక్కసిద్ధుం డయ్యెన్. 49

---

*సూ. శ్వసోవసీయ శ్శ్రేయసః. 5-4-80 పాణిని అష్టాధ్యాయి. శ్వశ్శ్రేయసం శివం భద్రం కళ్యాణం మంగళం శుభమ్. అని అమరము.

క. ఆలోకనుతుఁడు మొన్నటి, కీలకసమమాఘ నమతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ, డోలిఁ దెనుఁగుఁడీక. దాని కొప్పుగఁ జేసెన్. 50
క. ఆదిని భీమకవీంద్రుఁడు, గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర, క్ష్మాదయితునిపట్టి దాని మహి వెలయించెన్. 51
క. ఇల నెనుబదిరెం డార్యలు, గలిగి పరిచ్ఛేదపంచకంబునఁ దగునీ
విలసితఫక్కి మతంగా, చలవిప్రునివలన నీదుసదనముఁ జేరున్. 52
క. మునునారాయణధీరుఁడు, దనకు సహాయుండుగ సంస్కృతము వాగనుశా
సనుఁడు రచియించె దానిం, దెనుఁగింపఁగ నీకుఁ దోడు నే నిపు డగుదున్. 53
క. సురభాషయందు నల్పాక్షరముల బహుసూచితార్థసారము లిమిడిం
తురు సూత్రంబుల నని వి, స్తరముగఁ దెనుఁగింప కున్నఁ దరమే తెలియన్. 54
తే. నారికేళపాకంబుగా నన్నయకవి, ప్రక్రియాకౌముదిని[1] మట్టః బలికెఁ గానఁ
గేవలాంధ్రులు గాన రాత్రోవ నీవు, గోస్తనీపాక మై యుండఁ గూర్పవలయు.
ఆ. శబ్దశాసనుండు సంస్కృతగ్రంథంబు, గానఁ దెలుఁగుమాట గలయ రామి
లక్షణంబె కాని లక్ష్య మొక్కటియును, బలుక కునికిఁ దెలియఁబడవు కొన్ని. 56
తే. ఒక్కసూత్రంబువలన సముద్భవించు, శబ్దములు లెక్కవెట్టంగ శక్య మగునె
నలువ కైనను[2] బలుకులేఁజెలువ కైన, నైన నెఱిఁగింపు మొకకొన్ని యైన నీవు. 57
చ. రమణను సత్కవీంద్రులు పురాణచయం బితిహాసపంక్తి కా
వ్యములును దొల్లి యైన నిపు డైనను ముంగల నైన దీని సూ
త్రములను దక్క వేఱొకవిధంబున నాంధ్రముఁ జేయఁ జాలమిన్
క్షమఁ దెనుఁగింప దీన నవి సర్వముఁ జేయంఫలంబు నీ కగున్. 58
క. తాతనయుం నూత్నదండియుం, నీ తెనుఁగులలక్షణం బొకించుక తెలియన్
జేతః ప్రౌఢిమఁ జెప్పిరి, క్ష్మాతలమున దీని తెఱఁగు గా వవి యొల్లన్. 59
తే. ఆంధ్రభాషామహాకాననాంతరమున, సంతతంబును శబ్దాపశబ్దసరణు
లెఱుఁగ నేరక మది సంశయించు తెలుఁగు, కవులు సుపథంబు లిందును గాంతు రిలను.
తే. కవుల కుపకార మగుటచేఁ గలుగు సుకృత, లాభ మందున నగు సద్యశోభివృద్ధి
దాన సమకూఱు నాకపదంబు దీనిఁ, దెనుఁగుఁ గావించుకంటె శోభనము గలదె.. 61
ఆ. ధరణి నీకు నిష్టదైవ మెప్పుడుఁ గామె, పట్టి నున్న చక్రపాణి యగుట
నంకితంబు దీని నతనికిఁ జేయుము, విప్రవర్య మాకు వేఱు గలదె. 62

1 ఋట్టు. 2 బలుకులచెలికి నైన.

చ. అని యతఁ డానతిచ్చి [1]చన నంతట మేల్కొని నాల్గుదిక్కులుం
గనుఁగొని యద్భుతంబుఁ గుతుకంబును డెందమునం బెనంగ వేఁ
గినఁ గల కే దబద్ధ మని కేరుచు నుండెడువేళ నామతం
గనగనివాసి పుస్తకనికాయధరుం డొకరుండు వచ్చినన్. 63

క. ఆవిప్రు నతిథిఁ గా సం, భావించి భుజింపఁ బెట్టి భాషించు నెడన్
దా విశ్వశ్రేయం బను, నీవచనము సదువ నెచటి దిది యన నతఁడున్. 64

క. నన్నయభట్టీయములో, నెన్నఁగఁ బ్రథమార్య గాదె యాపాత్తములో
నున్నయవి యెనుబదియుం రెం, డన్న మహాద్భుతముఁ బొంది యపు డెల్లరకున్. 65

వ. మదీయస్వప్నవిధం బంతయుఁ దేటపడ నెఱింగించిన నాకర్ణించి సకలజనంబులు నానందంబుఁ బొంది రందుఁ గొందఱు మాతృసంబంధులగు మదీయబంధువులు గూడఁ గులసింధుసౌగంధికబంధులును గృతప్రబంధులును నీతియుగంధరులును గావున నాకి ట్లనిరి. 66

క. వారిఁ గాంచుటచే మోక్షము, సిరిచే నర్థంబు ధాత్రిచే భూమియుం శం
ఖరథాంగమ్ముల విజయము, విరచించు మటన్నకృతిని విద్యయుఁ గలుగున్. 67

ఆ. శ్రేయ మబ్బు ననుచుఁ జెప్పె విష్ణుఁ డనంగ, మంచికల యటంచు నెంచ నేల
అతఁడు సెప్పు మన్న దితనిచే నిప్పుడు, గలిగె నిదియె సాక్షి గాదె మనకు. 68

వ. అదియునుం గాక. 69

## కర్తృవంశావతారము

సీ. శ్రీవిష్ణునాభిరాజీవసంభూతుఁ డేవసుమతీసురునకు వంశకర్త
రామాయణామరభూమిరుహాబ్ధి యేవితతాగమాంతసంవేద్యగురుఁడు
కశ్యపాత్రివసిష్ఠగౌతమభృగువు లేసూనృతభాషణుజోడువారు
పృథులశస్త్రకళాధురీణుండు ద్రోణుఁ డేగురుతపోరాశికిఁ గూర్మిపట్టి
తే. యతఁడు దనరారు సర్వలోకైకయోగ్య, తారకాపథవర్తి విస్తారకీర్తి
దురితకర్మపరిత్యాగి పరమయోగి, వరగుణాస్థాని శ్రీభరద్వాజమౌని. 70

తే. అమ్మహామౌనిగోత్రాబ్ధి నవతరించి, తమ్ములును దాను నన్యోన్యతను దనర్చి
తమ్ములను బోరుననిసోముఁ ద్రస్తరించు, నౌరసోమాహ్వయుఁడు కాకునూరిఘనుఁడు.

తే. అతఁడు మధురను బుధసమూహములఁ దోడరి, వేదశాస్త్రపురాణాదివాదములను
గాకునూరింటఁ జేసినకారణమునఁ, గాకునూరింటివాఁ డన ఘనతఁ గాంచె. 72

1 చను (క.)

సీ. బాలుఁడై కాశికాపట్టణంబున కేఁగి బ్రహ్మేంద్రునొద్ద శాస్త్రములు చదివె
[1]బ్రహ్మరాక్షసిచేతఁ గ్రమము చెప్పంబడి కట్టినగండభాగంబు నొందె
చరిగొండసీమలో సంతరించెను గాకునూరన సర్వాగ్రహార మొకటి
నిడుదవెల్లిని బొద్దిపల్లి [2]నవదళపురిని మాన్యక్షేత్రములు గడించె
తే. నవని సర్వజ్ఞుఁ డగుట గంగాంబికాభి, రాముఁ డగుటను నిక్కంబు సోముఁ డనఁగ
మనియె నిలఁ గాకునూరితిమ్మసుతుండు, సోముఁ డభినవచూతసద్గ్రామమునను. 73

చ. అతఁడు భవత్పితామహున కయ్యెఁ బితామహుఁ డాఘనుండు భా
రతిని దపంబునం గని వరం బడిగెం దనయింట విద్య ప్ర
స్తుత యగుచుండ[3]నందులకు సుమ్ము జగంబునఁ గాకునూరిసం
తతి యగువారు శోభనదినంబుల మున్నుగ వాణిఁ గొల్చుటల్. 74

తే. గంగయాదుఁ గుమారునిగాంచె నొకని, సోముఁ డని చెప్పటెల్లను జోద్యముగనె
కాంచెఁ బెక్కుకుమారుల గంగయందు, సోముఁ డలకాకునూరివంశోత్తముండు. 75

వ. వా రెవ్వ రంటేని. 76

సీ. అమరేశ్వరుండు భోగాతిశయంబున నమరేశ్వరుం డన నతిశయిల్లుఁ
గొండలయ్య దలంప గురుధైర్యమహిమచేఁ గొండలయ్య యనంగఁ గొమరు మీఱు
రంగప్పఁ డాశ్రితరక్షణప్రౌఢికు రంగప్పఁ డన ధాత్రి రంగు గాంచు
లక్ష్మణుం డగ్రజాలాపానువర్తి యై లక్ష్మణుం డన భూతలమున వెలయుఁ
తే. నందులోఁ గాకునూరిరంగాహ్వయుండు, గనియె నలువురుతనయులఁ గన్నమాంబ
యందుఁ దిరుమలభట్టు గంగార్యవర్యు, సెలముఁ బెదసోముఁ జినసోము నిందులోన.

సీ. ఒకనివాకిలిఁ గాచి యుండఁ డెన్నటి కైన నుగ్రుఁడు గాఁడు దా నొక్కనాఁడు
కంట మంటలు రాలఁ గనుఁగొనఁ డెవ్వరి నేరఁ డెన్నటికిని నీరు మోవఁ
గుత్తుకందు విషంబు గూరిచి వర్తింపఁ డనిశంబు పరులను నడిగికొనఁడు
సంతతంబును బౌరుషము తృప్తి గాంచఁడు క్రతువులు దాఁ జేయఁ గాని చెఱుపఁ
తే. డిన్ని సద్గుణములు గల్గెనేని భూని, జోడు సేయంగ వచ్చు నాసోముఁ గాకు
నూరికులవారిజాతచకోరమదవి, రామునకు రంగఘనుపెదసోమునకును. 78

సీ. కొట్టించె నెవ్వఁడు గురువాపి వప్రదక్షిణభాగమున రొంపిచెర్లలోనఁ
గట్టించె నెవ్వఁడు ఘనశిలాసాలంబు రంగుగా శంకరలింగమునకుఁ

---

1 బ్రహ్మరాక్షసుతోడఁ గ్రమము చెప్పుచు బండిగట్టిన గండభాగంబు ప్రౌఢి (వా). 2 నివదళ. 3 నందుకు (వా).

బెట్టించె నెవ్వఁడు పృథుతరారామంబు గుడిపాటికడ వినుకొండత్రోవఁ
బుట్టించె నెవ్వఁ డప్పూరియామ్యదిశ గుంటఁ ద్రవ్వించి పశువులు ద్రావ జలము
తే. క్షితిఁ దలంపఁగ సర్వజ్ఞశేఖరుండు, సత్పథవిహారి ద్విజరాజచారులక్ష
ణాన్వితుం డెవ్వఁ డతఁడు సోమాభిధుండు, కాకునూరికులాఖ్యసాగరభవుండు. 79

ఉ. పట్టెము[1]పోతనార్యసుతవర్యుఁ డనం దగుపెద్ది[2]భట్టుతోఁ
బుట్టినకృష్ణుఁ గైకొని సుపుత్రుల వెంగనఁ గన్నుభట్టు బ
ల్దిట్టను గంగయ న్నుతలఁ దిమ్మను రంగను లింగ గోనమా
రట్టడిఁ గాకునూరిపెదరంగయసోముఁడు గాంచె వేడుకన్. 80

క. వినుతమతిఁ గాకునూరిజ,నవమణి యగుసోమునగ్రనందనుఁ డగువెం
గన బుధుఁ డన నెగడె జగం,బున సోమునినందనుండు బుధుఁ డగు టరుదే. 81

తే. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు
గ్రామముల సీమ గానక కాకునూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
బ్రస్తుతికి నెక్కె మఱి యట బ్రహ్మ యనఁగ. 82

ఆ. కాకునూరివెంగఘనుఁడు సేసమయందుఁ, గాంచె మొదల నప్పకవిని నిన్న
వెనుక సోమనార్య వేంకటపతిఁ గృష్ణు, భట్టు లక్ష్మణాఖ్యబాలుఁ గాంచె. 83

క. శ్రీగిరిని నిలిచి నీవును, భోగివిభూషణునిపట్టపుకవీంద్రుఁడ వై
వాగీశవినుతకామెప, లీగరుడాసనకృపాకలితవాక్ప్రౌఢిన్. 84

సీ. జగతి నాపస్తంబశాఖోక్తషట్కర్మపద్ధతిఖండనిబంధనంబు
కాలబాలార్ణవాఖ్యజ్యోతిషగ్రంథసంహితాసుశ్లోకసంగ్రహంబు
శ్రీమదనంతప్రసిద్ధమహావ్రతకల్పకథాంధ్రోక్తికావ్యరచన
శ్రీనగాధీశసుశ్లేషనిందాస్తుతిభావగర్భితసీసపద్యశతము
తే. లలితకవికల్పకాఖ్యానలక్షణంబు, మహితసాధ్వీజనౌఘధర్మద్విపదము
నంబికావాదనామకయక్షగాన, కృతియుఁ జేసితి కాకునూరికులయప్ప. 85

క. ఇట్టిమహాగోత్రంబునఁ, బుట్టిననీ కిట్టిశుభము వొందుట యరుదే
గట్టిగ నాదేవుఁడు సమ,కట్టినయది తెనుఁగుఁ జేయఁగాఁ [3]వగు ననినన్. 86

క. పరమోత్సుకతను నన్నయ, విరచించినఫక్కి వ్రాసి విప్రుని గాశీ
పురి కనిచి వృద్ధబాంధవ, గురువిబుధులచే ననుజ్ఞ గొని చిత్తమునన్. 87

1 పోచ. 2 రాజు. 3 గనెదం మనక్.

## కవివిచారము

క. లోకంబునఁ గలవిబుధా,నీకములో నెవరిఁ బోల నేరుతు నైనన్
నా కిచ్చె నంధ్రశబ్ద, వ్యాకరణముఁ దెనుఁగుఁ జేయు మని హరి కరుణన్. ౮౮

తే. మహిని వాగనుశాసనమయుఁ డొనర్చు, నిమ్మహాగ్రంథ మనునావయొక్క యాంధ్ర
శబ్దజలరాశి తరియించుజనుల కేను, గర్ణధారుఁడ హరియనుగ్రహము [1]దీవి. ౮౯

ఉ. ఎన్నఁగ నన్నయాఖ్యకవి యీకలి కాదిని జెప్ప దాని భీ
మన్న హరించెఁ గ్రమ్మఱ మహాత్ముఁడు రాజనరేంద్రుపట్టి దా
మొన్న నొసంగె విప్రునకు మూల మతం డొనరించెఁ [2]డీక నా
కన్నది మున్ను విన్నదియుఁ గాదు మహాద్భుత మబ్బె నా కిటన్. 90

క. మూలము చెప్పిననన్నయ, భూలోకబ్రహ్మ యతనిబుద్ధి దెలిసి వ్యా
ఖ్యాలక్ష్యంబు లొనర్చిన, బాలసరస్వతులఁ బోలు ప్రాజ్ఞులు గలరే. 91

క. ఎక్కడిమతంగపర్వత, మెక్కడికామెపలి సుకపు లీలో లేరే
గ్రక్కున నిది దెచుఁగింపక, దక్కుట నను ధన్యుఁ జేయుంతలఁపున నేమో. 92

క. అతిక్కనముఖ్యకవి, వ్రాతముచే నీ తెలుంగువ్యాకరణము ధా
త్రీతలమునఁ గడు నంత,ర్ఖ్యాతం బై తెనుఁగు గాకపోవుట లెల్లన్. 93

వ. మత్పురాతనజననఘనతరతపోవిశేషంబువలనన కదా యని చింతించి నితాంతసంతు
ష్టాంతరంగుండ నై. 94

తే. తనయనుగ్రహమునఁ జెప్పుమనుచు నిన్నఁ,గలను వచ్చినహరి తానె కలఁడు నాకుఁ
దెలియనిపదంబు లెల్లను దెలుప నింక, శంక సేయంగ వల దని సమ్మతించి. 95

వ. ముందు బృందారకభాష నశేషవిద్యాజలజాసనుం డగుశబ్దానుశాసనుండు సంక్షే
పంబుగాఁ గూర్చిన యంధ్రవ్యాకరణంబునందలి, సంజ్ఞా, సంధి, తత్సమ, దేశ్య,
క్రియాపరిచ్ఛేదంబు లయిదునుం దెనుఁగుఁబలుకుల నేను విస్తరించి భాషాపరిచ్ఛే
దంబును, వర్ణపరిచ్ఛేదంబును, వళిప్రాసపరిచ్ఛేదంబును, పద్యపరిచ్ఛేదంబును, సంధి
పరిచ్ఛేదంబును, తత్సమపరిచ్ఛేదంబును, దేశ్యపరిచ్ఛేదంబును, క్రియాపరిచ్ఛేదంబును
ననునామంబుల నభిరామంబు లగునాశ్వాసంబు లెనిమిదిగా నెలకూచి బాలసరస్వతి
సకలభాషాకవి మహోపాధ్యాయ ప్రణీతాంధ్రవ్యాఖ్యానగ్రంథం బాధారంబుగా
రచియింపం బూని. 96

క. దశమీసురగురువాసర, శశితారావజ్రయోగవష్ఠకరణయు
క్తశరాసనలగ్నంబున, శిశిరకరాంశమున మొదలు సేసితిఁ గృతికిన్. 97

---

1 పేర్మి. 2 వింతఁ దాఁ గన్నది.

వ. ఇట్లు కృతప్రారంభుండ నై మదీయేష్టదేవతం గాంచి నమస్కరించి వినుతించి యత
నిం గుఱించి షష్ఠ్యంతములు విన్నవించెద. 98

## షష్ఠ్యంతములు

క. సాయపవేంకటపతిభూ,నాయకదత్తాగ్రహారనగరప్రాగ్దే
శాయతదేవాలయమునఁ, బాయక వసియించుగోపభామాపతికిన్. 99

క. శ్రుతిశాస్త్రాగమజితగీ,ష్పతి పట్టెము పెద్దనార్యసంపాదితపు
ణ్యతరాగ్రహారపూర్వ, క్షితిజశమీయామ్యమున వసించినహరికిన్. 100

క. తంగెడసీమను నిర్జర, గంగాసమనాగనిమ్నగాపూర్వమునం
బింగళిపురదక్షిణమున, రంగుగ నెలకొన్నగోపరత్నంబునకున్. 101

క. కేతవరనామపట్టణ, దైతేయాశాసమన్వితనికేతునకున్
వాతాత్మజతార్క్ష్యసమ,న్వితునకు సమస్తలోకవిఖ్యాతునకున్. 102

క. అలఘుతరశీలునకు మం,గళగుణజాలునకు దనుజకాలున కిందో
పలనీలునకును గామే,పలిగోపాలునకు ఘోషపతిబాలునకున్. 103

తే. అంకితము గాఁగ నేఁ జేయునట్టియంధ్ర, శబ్దచింతామణిగ్రంథసారపాద
పంబునకు నాలవాలంబువగిది నొప్పు, నట్టిభాషాపరిచ్ఛేద మెట్టి దనిన. 104

# భాషాపరిచ్ఛేదము

## ప్రథమాశ్వాసము





భోజతనూజాస
త్యాభామాసహిత తార్క్ష్యవాహనుమద్యుత భ
ద్రేభాధిపపోషణ తుల
సీభూషణ కామెపల్లి శ్రీగోపాలా. 1

క. అవధారు శబ్దశాసను, డవనిఁ గలియుగమున కాది సారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయం, ధ్రవచోవ్యాకరణసూత్రతతిఁ దెనుఁగింతున్. 2

క. భాషానిరూపణం బా, ర్యాషట్కమునందుఁ దొలుత సంధ్రకవిశిరో
భూషణ మగునన్నయ సవి, శేషంబుగఁ జెప్పె సంకుచితవాక్యములన్. 3

### భాషాపరిచ్ఛేదమూలసూత్రంబులు.

#### ఆర్యావృత్తశ్లోకంబులు.

విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరిష్కృతౌ చ[1] వాగర్థా
సా వాగ్యా రసవృత్తి స్సాధ్యో హి రసో యథాతథం కవిభిః. 1

స్వస్థానవేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దపహాయ. 2

ఆద్యా ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్వికృతిః
కేవలతయానుసర్ప త్యుభే చ యేయం యథాతథా భాషా. 3

తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి
ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా ప్రవాహినీ దేశ్యా. 4

సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽనన్యాదృశ శ్చ నిత్యశ్చ
సంస్కారార్థో నియమోఽనియమా ద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః. 5

---

1 శబ్దార్థా.

విరళాన్ పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః
ఇహ తు ప్రవ్యాహార్యా సజ్జేతితసుప్రసిద్ధ మేవ పదమ్. 6

ఇతి శ్రీసకలభాషావాగనుశాసనపన్నయభట్టవిరచితాంధ్రశబ్ద
చిన్తామణౌ భాషాపరిచ్ఛేదః ప్రథమః.

వ. ఈ శ్లోకంబు లాఱునుం బండ్రెండు సూత్రంబు లయ్యె నవి యెల్ల నిందు వివరించెద.

## పూర్వగ్రంథనామసంగ్రహము.

తే. సంస్కృతమునకు నాంధ్రభాషకును దొల్లి, లక్షణములు శాకల్యమల్లనసుధీంద్ర
విన్నకోటపెద్దనసుకవిప్రముఖులు, క్షితి నొనర్చిరి లోకోపకృతిగఁ జెక్క. 4

వ. అవి యెయ్యవి యనినం బ్రతాపరుద్రీయంబును, గువలయానందంబును, జంద్రాలోకంబును, రసమంజరియును, సాహిత్యచంద్రోదయంబును, సాహిత్యరత్నాకరంబును, వృత్తరత్నాకరంబును, జమత్కారచంద్రికయు, షడ్భాషాచంద్రికయును, షడ్భాషావివరణంబును, త్రివిక్రమవృత్తియు, హేమచంద్రఫక్కికయును, గవిభల్లటఫక్కికయును, నధోక్షజఫక్కికయును, శబ్దానుశాసనీయంబును, కవిరాక్షసీయంబును, గవికంఠపాశంబును, గవిమూషికమార్జాలంబును, గవిగజాంకుశంబును, గవిసర్పగారుడంబును, గవిజనాశ్రయంబును, గవిలోకసంజీవనియును, గవికంఠాభరణంబును, గావ్యాలంకారచూడామణియును, గావ్యచింతామణియు, నథర్వణచ్ఛందంబును, గోకర్ణచ్ఛందంబును, శ్రీధరచ్ఛందంబును, ననంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును, నలంకారసంగ్రహంబును, నలంకారరత్నావళియు, నాంధ్రభాషాభూషణంబును, రేఫఱకారనిర్ణయంబును, లక్షణవిలాసంబును, సులక్షణసారంబును, సర్వలక్షణసారసంగ్రహంబును, లక్షణదీపికయును, శారదాదీపికయును, శారదాముకుటంబును, శారదాతిలకంబును, వాగీంద్రచూడామణియును, నరసభూపాలీయంబును మొదలుగా నీక్షింప లక్షణగ్రంథంబులు లక్షోపలక్షలు గల వందు. 5

క. ఒకదానికంటె మఱి వే, ఱొకటి విశేషంబుఁ జెప్పుచుండుకతమునన్
సకలగ్రంథములు జదువక తెలియునె లక్షణప్రపంచం బెల్లన్. 6

## ప్రబంధమహిమ.

క. ఇది చదివినపిమ్మట మఱి, యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా వొడమున్
బడఁబడి గ్రంథము లన్నియు, వెదకి వెదకి సార మెల్ల వివరింపంగన్. 7

తే. పర్వతము లెల్ల నొక్కదర్పణమునందుఁ, జూపడు తెఱంగునను గవితోపయోగ
లక్షణములన్నియును సరళంబుగాఁగ, నెఱుఁగఁబడు నిందుఁ దెలియ నూహించిరేని.

తే. సారభావకు శబ్దశాస్త్రంబుపగిదిఁ దెను గు (న) కావశ్యకం బిది దీనిఁ జదివి
చెప్పిన ప్రబంధము జగత్ప్రసిద్ధి నొందు, నురక రచియించినది యప్రయోజకమగు. 9

క. రత్నములకు నిల సత్కృతి, రత్నములకు మఱి తురంగరత్నములకు స్త్రీ
రత్నములకు లక్షణములె, యత్నంబునఁ జూడవలయు నంద్రు మనీషుల్. 10

క. ఈక్షితిని రాజరాజును, భిక్షునిగాఁ దిట్టఁ గూటిపేదను యత్నా
ధ్యక్షునిగా దీవింపను, లాక్షణికుఁడె యెన్నిభంగుల సమర్థుఁ డగున్. 11

తే. ఉత్తముఁడు లక్ష్యలక్షణవృత్తవేది, పరఁగు మధ్యముఁ డన లక్ష్యపద్యవేది
సొరిది నధముఁడు లక్షణశ్లోకవేది, లక్షణజ్ఞుల కివియ పో లక్షణములు. 12

క. తొలుతను లక్షణసూత్రంబు లెఱిఁగి పిఱుంద లక్ష్యములు దెలియంగా
వలయును గావున లక్షణములు లక్ష్యంబులును బాఠముగఁ జేయఁ దగున్. 13

శబ్దానుశాసనమూలసూత్రము:—

విశ్వశ్రేయః కావ్యమ్. 1.

క. ధర్మములలోన నుత్తమ, ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సుధర్మను వసియించుఁ బెక్కుదైవతయుగముల్. 14

క. తనయుండు చెఱువును గావ్యంబు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును ననునిర్యేడును, జను శాస్త్రములందు సప్తసంతతు లనఁగన్. 15

తే. దుష్కృతము లెన్ని చేసినఁ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి సలుపునతఁడు
కుతుకమునఁ దననూటొక్కకులము వారి
నరకములఁ బాపి ముక్తికి నడపు నిజము. 16

క. ఇల సప్తసంతతులలోఁ, బలఁ గావ్యము దక్క దేవభవనవనాదుల్
ఖిలము లగుఁ గొన్నివర్షంబుల కని చంపువు రచించె భోజుం డెఱుకన్. 17

తే. నిలిపి రెక్కడ నచటనె నిలిచియుండు
నగ్రహారాదిసంతతు లరసి చూడ
నవియు గృతిముఖరచనచే నఖిలదిశల
నెగడుఁ గావునఁ గావ్య మన్నిటికిఁ దొడవు. 18

క. పురివఱదనీరు గోదావరిఁ గలసిన యోగ్య మైనవడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాంతరమునఁ జెప్పఁబడి పావనచరిత్రుఁ డగున్. 19

క. క్షితి నెవ్వనినామము సత్కృతి నెన్నిదినంబు లుండు దివి నాపుణ్యా
వ్రతుఁ డంతకాల ముండును, ధృతి నింద్రద్యుమ్నునికి దృష్టాంతముగాన్. 20
క. తనకు హితార్థము లెఱిఁగించు నఘంబు లడంచు ధనము శోభనము యశం
బును గూర్చు నఖిలసురులక్, గనఁబడఁ గాఁ జేయుం నెపుడుఁ గావ్యము కవికిన్.
తే. మేటిబ్రహ్మర్షి యయ్యె వల్మీకభవుఁడు, గాంచె రవిని మయూరుండు గడియలోన
[1]హారిణరోగము వాసె శ్రీహర్షజునకుఁ, గావ్యమునఁ జెందరానిసద్గతులు గలవె. 22
చ. అలరఁ బురాణకావ్యముల నార్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియ జతుర్యుగంబులను దీవుల నేఁడిట నెంద ఱెందఱో
యిల జననంబు నొంది మని యేఁగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁడేనియును బ్రస్తుతి కెక్కఁ డెఱుంగ మెక్కడన్. 23
తే. రామకథలోనఁ గపులు వారాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పంగ నఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్ప కున్న, నదియుం నొకసోగ [2]దీవి య టాద్రు గాదె.
క. వివరించె యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జగంబుల నేత
త్ప్రవిమలకావ్యము మిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవుపాల తెఱఁగునన్. 25
తే. ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న, నంఘ్రిభవునికావ్యంబు గ్రాహ్యంబు గాదు
పాయసం బైన సంస్కారపక్వ మైనఁ, గాకజుష్టంబు హవ్యంబు గానియట్లు. 26

## కావ్యభేదములు

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు వాక్యభేదమున నివ్వటిలు నర్థ
మర్థవశంబున నమరును భావంబు భావసంగతిఁ గనుపట్టు రసము
రసప్రశస్తిచేఁ బొసఁగును బద్యంబు పద్యరాశిని గూర్పఁబడును గావ్య
తే. మట్టికావ్యంబు ద్వివిధ మై యతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధచాటుప్రబంధము లన
సర్గములసంస్కృతమున నాశ్వాసములను, దెనుఁగునఁ బ్రబంధమనునదితనరుఁ గృష్ణ.
సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును శైలంబు వేఁటయు సాగరంబు
మౌనీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానవికారంబును వనవిహారంబులు వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరాభ్యుదయంబు విప్రలంభోదితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస. 28

---

1 హారిణ=శ్వేత. హారిణరోగము=శ్వేతరోగము. 2 నెరిగి.

క. నిడుదలు నెఱయక్కరములు, పొడవులు చాఁపులును దీర్ఘములు నన నొక్కటై
వడివ్రాలు కుఱుచ లలరును, గిడుసులు గుజ్జులు ననంగ ఁజెలి హ్రస్వలిపుల్. 10

క. సున్న యన బొట్టనంగా, నెన్న ననుస్వారసంజ్ఞ లిలవలపల రెం
డున్నవి విసర్గ మనఁ జనుఁ, బన్నగపతిశయన ధవళపంకజనయనా. 11

ఆ. గజడదబలు మొదలుగా వర్గవర్గంబు; నందు మూఁడు మూఁడు నౌ యొకండు
యాదిలిపులు నాల్గు నన్యవర్ణయుతంబు, లైనశసలు ఘోష లనఁగఁ దనరు. 12

తే. ఒత్తు జడ్డయుం ద్విత్వసంయుక్తములును, మహిని సంయోగవర్ణనామంబు లయ్యెఁ
బైస్వరము లేక కడుఁ దేలఁ బలుకఁబడిన, వ్యంజనంబులు పొల్లు లనం జెలంగు. 13

మూ. సూ.—ప్రాణా స్సమాసతోఽచో బిన్దు రనుస్వార ఏ జఘో వక్రః,
వక్రతమ ఐజ్ఝల స్స్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః,
కచటతపాః పరుషాఖ్యా గజడదబా స్తు సరళా స్థిరా ఇతరే,
ఏతా స్సంజ్ఞా స్సర్వా జ్ఞాత్వా పశ్చా త్ప్రవర్తయే దత్ర. 1

సీ. అచ్చులు ప్రాణంబు లని చెప్పఁబడు ననుస్వారంబు బిందుప్రశస్తిఁ గాంచు
నేత్వంబు నోత్వంబు నెసఁగు వక్రము లన వానిమీఁదివి రెండు వక్రతమము
లిలఁ బ్రాణు లనుపేర నేపారు హల్లులు ద్రుత మనంగ నకార మతిశయిల్లు
వర్గాదులను గలవర్ణంబు లైదును బరుషనామంబు లై ప్రణుతి కెక్కుఁ
తే. బంచవర్గతృతీయముల్ పరమపురుష, సరళముల్ శేషహల్లులు స్థిరము లయ్యె
శబ్దశాస్త్రంబు గాన నీసంజ్ఞ లెల్లఁ, దెలిసి యీగ్రంథమునఁ బ్రవర్తించు టొప్పు. 14

వర్ణోత్పత్తిస్థానంబులు

క. ఇమ్మహి ద్విస్థానోద్భ,వమ్ములు వక్రయమవక్రతమయుగ్మవకా
రమ్ములు మఱియేకస్థల, జమ్ము లితరవర్ణములు భుజంగశయానా. 15

సీ. ఉదయించు నత్వంబు మొదలుగా రెండురెండచ్చులు వరుసతో నఱుతఁ దాలు
వుల నోష్ఠముల నవుదల దంతములఁ గంఠతాలువుల గళోష్ఠతలములందు
బొట్టు నాసను గళంబున విసర్గంబును గాదివర్ణము లైదు నైదు గూడి
తగఁ గంఠతాలుమస్తకరదోష్ఠములు నంతస్థము ల్తాలుమస్తకరదముల
తే. నూర్ధ్వదంతాధరంబుల నూష్మలిపులు, క్రమతఁ దాలుశిరోదంతకంఠములను
బలువ్రాయి శిరంబున బండిరాను, స్థానభేదంబు లేదు దంతములఁ జజలు. 16

వ. బలువ్రాయి యనఁగా దొడ్డళకార మనుట. 17

తే. అలఘుఋళదంత్యచజలకు హ్రస్వవక్ర, ములకు నింపుఁ బ్రత్యేకించి పలుకనిమెడఁ
గ్రమతఁ దత్తత్ప్రథానవర్ణముల కెప్పు, యనెను వానికి నని తెలియంగ వలయు.

తే. అచ్చు లొకవర్గ మయ్యె స్పర్శాక్షరంబు, లయిదువర్గంబు లయ్యె యాద్యష్టకంబు
దలఁప నొకవర్గ మింకఁ గొందఱు నశంబు, నూష్మములు నొకవర్గ మైయొప్పుచుండు.

శుద్ధాంధ్రలిపి లేఖనక్రమము

క. మొదల నకారాద్యచ్చులు, పదియాఱును వానిపిఱుఁద బాణాసురదు
ర్మదహర కాదిలిపులు ము, ప్పదిమూఁడును బుట్టి వాక్ప్రపంచం బయ్యెన్. 20

మూ. సూ.—. బాలేందుపరిధిశృంగావర్తకుశగ్రంథిదాత్రపరశుసమాః,
ఆద్యా ఇభకరతులార్ధస్తదీర్ఘా శ్మాలసన్నిభా వన్యాః. 2

సీ. విదియచంద్రునిమాడ్కి నెలయు నత్వము దానినడివంక శృంగంబుకొన గుణింపఁ
బ్రభవించుఁ దక్కినప్రాణంబు లెల్లను నడిమికి గుడిఁ జుట్టి విడువ నిత్తు
కుడి నావుకొమ్ముకైవడి వ్రాయ నుత్వంబు క్రిందను సుడి నిల్ప ఋత్వ మయ్యె
వలపల మీఁదికి మెలి గొన్న ౠస్వర మొదమ నెత్వం బొప్పుఁ గొడవలిక్రియ

తే. యామ్యమున గండ్రగొడ్డలియు ట్లొనర్పఁ, గ్రాలు నోత్వ మిన్నింటిదీర్ఘములు కుడిని
గరిశరాకృతిఁ దవరుడాకడవలపల, నమరు నైత్వౌత్వములు త్రిశూలములకరణి. 21

*వీనికి రూపములు.

[illegible]-ఇది అకారము, [illegible]-ఇది ఆకారము, [illegible]-ఇది ఇకారము, [illegible]-ఇది ఈకారము, [illegible]-ఇది ఉకారము, [illegible] ఇది ఊకారము, [illegible]-ఇది ఋకారము, [illegible]-ఇది ౠకారము, [illegible]-ఇది ఌకారము, [illegible] ఇది ౡకారము, [illegible]-ఇది ఎకారము, [illegible]-ఇది ఏకారము, [illegible]-ఇది ఐకారము, [illegible]-ఇది ఒకారము, [illegible]-ఇది ఓకారము, [illegible]-ఇది ఔకారము, "అనుక్తమన్యవత్" అనున్యాయము చేత నీశబ్దానుశాసనసూత్రమునందుఁ జెప్పిన యనుస్వారమును, విసర్జనీయమును, సకలదేశప్రశస్తమైన నాగరలిపియందు నెటువలెనో యటులఁ దెలిసికొనునది. తత్స్వరూపంబులు-లం-అం-ఇది పూర్ణానుస్వారము, లః-అః-ఇది విసర్జనీయము, ఇవి యచ్చులనంబడు.

అనుస్వారనిర్ణయము

మూ. సూ.—సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః,
హ్రస్వాత్పూర్ణోఽపి భవేద్దీర్ఘాచ్చేత్ఖండ ఏవ సజ్ఞేయః.

* ఈరూపములు సరియైనవికావు. పూర్వకాలపువ్రాత ఎట్లుండెనో తెలియగోరువారు బర్నెలువ్రాసిన 'సౌ దిండియన్ పేలియోగ్రఫీ' అనుపుస్తకముగాని, ఆంధ్రవిజ్ఞానసర్వస్వముగాని చూడవలెను.

సీ. పొసఁగ దీర్ఘాఖండపూర్ణంబు లనుపదంబులు సంజ్ఞ లౌ గట్టిబొట్టులకును
హ్రస్వఖండార్ధంబు లనుశబ్దములు మూఁడు సరసున్నలకుఁ బేరు లగుచు నుండు
శబ్దంబుతోడనె జనియించుబిందువు సిద్ధంబు నాఁగఁ బ్రసిద్ధ మగుచు
బుడమి నకారంబు చెడి రైనయానుస్వారంబు సాధ్యసంజ్ఞమున వెలయు
తే. నిక్క మీసిద్ధసాధ్యంబు లొక్కటొకటి, ఖండపూర్ణంబు లన ద్విప్రకార మయ్యె
నవియె క్రమ్మఱ హ్రస్వదీర్ఘాక్షరముల, మీఁద రెండు తెఱంగులై మెఱయుఁ గృష్ణ.
ఆ. వెలఁది చెలఁగి నిన్నుఁ దలఁచిన నన సిద్ధ, ఖండబిందు వయ్యెఁ గమలనాభ
పొంక మైనయింతిపొందు పొం పగు నన, సిద్ధపూర్ణబిందు విద్ధచరిత. 23
క. భువిఁ గొలిచెదఁ గాళిందీ, ధవు ననుచును వికృతులను ద్రుతంబులు చెడి బిం
దువు లైన వెల్ల సాధ్యో, ద్భవఖండము లయ్యెఁ గామెపల్లినివేశా. 24
క. కెందమ్ములు చెంగలువలు, ముందర చెంగావిచీర ముంగొం గన నీ
చందము లెల్లను నందిత, బృందారక సాధ్యపూర్ణబిందువు లయ్యెన్. 25

మూ. సూ:—హ్రస్వాత్పూర్ణోఽపి భవేద్దీర్ఘాచ్చ ఖండ ఏవ వి(స)జ్ఞేయః.

తే. జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞఁ బొసంగు
ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁ బూర్ణంబులను జేయ వచ్చుఁ గృతులఁ
బూర్ణములు ఖండములు సేయఁ బొసఁగ వెందు. 26
క. కొలఁకులకుఁ గొలంకులు నాఁ, దలఁపులకుఁ దలంపు లిట్లు తగ సిద్ధము లై
చెలు వందుఁ జెఱుతసున్నలు, వెలయును బూర్ణంబు లగుచు విమతభరతల్పా. 27
క. జలజాక్షుఁ గొలుతు ననుచో, జలజాక్షుం గొలుతు ననుచు సాధ్యార్ధము భూ
తలమున సెరసున్నయు నై, చెలు వగుఁ గామెపలివాస సిద్ధోల్లాసా. 28
తే. నిడుద లగునక్కరములపై నిలిచినట్టి, యర్ధబిందువు [1]లన్నియు నరసి చూడ
ధరణి సిద్ధంబు లైన సాధ్యంబు లైన, ఖండములె కాని పూర్ణముల్ గావు సుమ్ము.
ఆ. లోఁగ వించుకైన తాఁగతనంబున, దోఁచి పలువ లెల్ల దూఁచినావు
గీఁజుబూర కొమ్ము నేఁ జన వలె నన్న, నిడుదమీఁద సున్న నిలుచు నగము. 30
తే. పొల్లులను బంచవర్గంబులందు మొదలి, వర్ణములకును మూఁడవవర్ణములకుఁ
దక్క నితరాక్షరములకు దాపలికడ, నాంధ్రపదమధ్యమునఁ బుట్టదయ్యె బొట్టు.

1 లెల్లను.

సీ. కొంకక పీఁకనై కొన్నతోఁ జనుదెంచి ముంగల వాఁగిన మురు వధించె
మించి చెయ్యార్చక మేనిసీకుముఁ ద్రుంచి సెంజిలి రోఁజుకన్నియలఁ గొనియె
మింటికిఁ టును గలమేటిపృష్ఠము దెచ్చి మెండుగా వేఁడిన మెలఁత కిచ్చె
వింతసేఁతల గోపకాంతల నలపించి [1]పొం దూఁది బహువిధంబుల రమించె
తే. కంపుతూఁపులు గలవన్నె కానిఁ గాంచెఁ, గంబమునఁ బుట్టెఁ దాఁ చేటికరణి నొప్పె
సార హరి యనఁ బూర్ణంబు లక్షములును, బరువసరళాదులను గనుపట్టు నిట్లు. 32
తే. సగముజాబిల్లివలె వ్రాయ సగముసున్న, నిండుజాబిల్లివలె వ్రాయ నిండుసున్న
యరయ్యెసీ భేదము తెలింగి యాంధ్రకృతుల, వ్రాయఁదగుబిందువులు పాండవేయపక్ష.
వ. ఁ ఇది యర్ధబిందువు. ం ఇది పూర్ణబిందువు. (ఇంకను అచ్చులన్ని వరుసను వ్రాయుచున్నాము. (?) )

**మూ. సూ:** దరశార్ఙ్గపిప్పలదళాంకుశపన్నగసన్నిభాః క్రమాత్పరుషాః,
స్తంభ విరేఖాధికైస్తైస్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః. 5

సీ. శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశపన్నగాకృతులను మీఁద నర్ధరేఖ
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబు లైదును వరుసఁ జెన్నారుచుండుఁ
గ్రిందఁ గంబముపోల్కి గీఁటొక్కటిడిన నాద్యములు రెండవలిపు లై పొసంగుఁ
బైనున్న గీఁటు లిబ్బడి సేయఁ బ్రథమాక్షరంబులు సరళవర్ణంబు లగును
తే. గంబమొక్కటి రేఖాయుఁగంబుక్రింద, వ్రాసినఁ ద్వితీయమును జతుర్థంబు నగును
నిలువుగీఁటులు రెండునుం గలసి తమ్ముఁ, గడియఁ దొల్లింటి వనునాసికంబు లగును.

## హల్లులకు రూపంబులు

క - ఇది క్ కారము, ఖ - ఇది ఖ్ కారము, గ - ఇది గ్ కారము, ఘ - ఇది ఘ్ కారము, ఙ - ఇది ఙ్ కారము, చ - ఇది చ్ కారము, ౘ - ఇది ౘ్ కారము, ఛ - ఇది ఛ్ కారము, జ - ఇది జ్ కారము, ౙ - ఇది ౙ్ కారము, ఝ - ఇది ఝ్ కారము, ఞ - ఇది ఞ్ కారము, ట - ఇది ట్ కారము, ఠ - ఇది ఠ్ కారము, డ - ఇది డ్ కారము, ఢ - ఇది ఢ్ కారము, ణ - ఇది ణ్ కారము, త - ఇది త్ కారము, థ - ఇది థ్ కారము, ద - ఇది ద్ కారము, ధ - ఇది ధ్ కారము, న - ఇది న్ కారము, ప - ఇది ప్ కారము, ఫ - ఇది ఫ్ కారము, బ - ఇది బ్ కారము, భ - ఇది భ్ కారము, మ - ఇది మ్ కారము. ఇవి స్పర్శము లనంబడును.

1 పొం దూఁచి.(వ).

మూ. సూ:—కీర[1]తరిహాస్తిమస్తకశుక్తితులాపవవితర్ద్రిపీఠపమాః,
అంతస్థాశ్చోష్మాణో దంత్యచజౌ గురురలౌ చ బిందుయుతౌ.6

'తరి' అనఁగా నావకుపేరు.

తే. శుకతరిమతంగభవకుంభశుక్తిసన్నిభంబు లంతస్థము-ఖ తులాభద్రపీఠ
వేదికాహాలనిభములు శాదిలిపులు, దంత్యచజగురురలలకుఁ దనరు బొట్టు. 35

య - ఇది య్ కారము, ర - ఇది ర్ కారము, ల - ఇది ల్ కారము, వ - ఇది వ్ కారము, ళ - ఇది ళ్ కారము. ఇవి యంతస్థము లనంబడు.

శ - ఇది శ్ వర్ణము, ష - ఇది ష్ కారము, స - ఇది స్ కారము, హ - ఇది హ్ కారము, ళ - ఇది ళ్ కారము. ఇవి యూష్మము లనఁబడు.

క. హల్లు లయి తాము పుట్టియుం, హల్లులు ప్రాణములతోడ నంబుధికేనయా
వల్లభ కూడి కదా తల, మల్లో గుడులు శృంగములను మొదలుగఁ దాల్చున్. 36

వ. అది యెట్లనిన. 37

## క్ కారముతోడ నచ్చులుకూర్చి గుణించెడివిధము

క - ఇది క్. క్ కారమునకు తలకట్టు ఇచ్చిన క. తలకట్టున దీర్ఘమిచ్చిన కా. క్ కారమునకు గుడిఇచ్చిన కి. గుడిలో దీర్ఘమిచ్చిన కీ. క్ కారమునకు కొమ్మునిచ్చిన కు. కొమ్మున దీర్ఘమిచ్చిన కూ. క్ కారమునకు వట్రువసుడియిచ్చిన కృ. వట్రువసుడిని దీర్ఘమిచ్చిన కౄ. క్ కారమునకు ఌత్వమిచ్చిన కౢ. ఌత్వమునకు దీర్ఘమిచ్చిన కౣ. క్ కారమునకు ఎత్వమిచ్చిన కె. ఎత్వమునకు దీర్ఘమిచ్చిన కే. క్ కారమునకు ఒత్వమిచ్చిన కొ. ఒత్వమునకు దీర్ఘమిచ్చిన కో. క్ కారమునకు ఐత్వమిచ్చిన కై. క్ కారమునకు ఔత్వమిచ్చిన కౌ. క్ కారమునకు అరసున్న పెట్టిన కఁ. నెరసున్న పెట్టిన కం. క్ కారమునకు విసర్గములు పెట్టిన కః. ఇటువలెనే హల్లుల కెల్లను వ్రాయవలయునని తెలిసికొనునది.

ఇది స్వరగుణితము.

తే. ఎన్నిహల్లులు జడ్డలై యున్న నేమి, పొల్లులకు మీఁద నుండెడుహల్లు లెల్లఁ
గడపటను వ్రాయుద్విత్వ మొక్కటియె తాల్చు, దానితలకట్టు మొదలైన వానినెల్ల.

[1] నా.

వ. ప్రద్యుమ్నుఁడు — [illegible] ఇటువలెఁ గ్రిందను వ్రాసిన
యొత్తులకే తలకట్లు మొదలైనవి వ్రాయునది ఈ లిపియందు రేఫమునకు నొత్తులు
వ్రాయునదిగాని వలపలగిలక లేదు. అది యె ట్లనిన. 40

తే. మొదల రేఫాక్షరంబు నావిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు
ముందు జడ్డయుం వెస రేఫమునకు బదులు
గిలుక [1]లిఖియించియుం వచింతు రిలఁ గుమతులు. 41

వ. స్వర్గమనుటకు — [illegible] యిటుల వ్రాయునది. 42

క. పద్యాది ప్రాణంబుల, నాద్యంతాంతస్థములుగ నజ్ఝులు కృతులం
జైద్యహార వ్రాయుదురు తమ, విద్యాధికు లెల్లఁ జూచి వికవిక నవ్వన్. 43

క. ఇరు లీఁగ లుఋత లూ ళ్ళైవ్వరు నేమిటి కొక్కఁడోపు వానికి ననునీ
కరణిపదంబుల మొదలివి, స్వరము లనుచుఁ దెలిసి వ్రాయఁ జనుఁ బద్యాదిన్. 44

క. బలుబొట్టులపైవర్ణం, బుల క్రిందట నవియె మరల మూర్ధమతులు జ
డ్డలు చేసి వ్రాయుచుందురు, విలిఖింపరు వాని నెందు ద్విత్వము లార్యుల్. 45

ఆ. హల్లుమీఁద నున్నహల్లు దానికి ద్విత్వ,మొందుఁ గాని వేఱె యొకటి గాదు
సంధివేళ నది విచారించి వ్రాయుచోఁ, బాప రెందు దాని బ్రాజ్ఞు లెల్ల. 46

## పంచాశద్వర్ణనిర్ణయము

మూ. సూ:-ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనాస్స్యుః,
సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్. 7

తే. అయిదుపదు లగు సురభాష కక్షరమ్ము
లందుఁ బది ప్రాకృతమునకు నడఁగిపోవు
[2]దొలఁగి చనుఁ బదియును మూఁడు దెలుఁగుబాం
కెనఁగుఁ దత్సమపదముల నేఁబదియును. 47

వరరుచివచనము:—

శ్లో. ద్విధాక ఏచో నుస్వారో విసర్గ షోడశ స్వరాః,
స్పర్శా అంతస్థలోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధల స్మృతాః.

---

1 విభజించియుం లిఖింతు రిలఁ గుమతులు. 2 దొలఁగిచనునవి పదమూఁడు.

టీ. ద్విధా=రెండువిధములైన, అకః = అక్ప్రత్యాహారము, అక్కు లనఁగా—అ ఇ ఉ ఋ ౡ అనెడి ఈయయిదక్షరములకుఁ బేరు. అది యెట్లనఁగాః—

పాణినీయసూత్రములుః—

హలన్త్యమ్.

వృ. ఉపదేశేఽన్త్యం హలిత్స్యాత్.

టీ ఉపదేశే=[1]మునిత్రయము యొక్కయాద్యోచ్చారణమునందలి, అంత్యం = తుదిది అయినటువంటి, హల్=వ్యంజనాక్షరము (తుదపొల్లు), ఇత్=ఇత్తనుసంజ్ఞ గలది, స్యాత్=అగును. ఇందుచేత నిత్తనఁగ మాహేశ్వర సూత్రముకొనను న్న పొల్లు అనుట.

ఆది రంత్యేన సహేతా.

వృ. అంత్యేన ఇతా సహితః ఆదిః మధ్యగానాం స్వస్య చ సంజ్ఞా స్యాత్.

టీ. అంత్యేన=కడపటిదైన, ఇతా=ఇత్తుతోడ, సహితః = కూడుకొన్న, ఆదిః= మొదటియక్షరము, మధ్యగానాం=నడుమనుండెడు నక్షరములకును, స్వస్యచ=తనకును, సంజ్ఞా స్యాత్=పేరగును. కడపట నున్న యిత్తుతోఁ గూడుకొన్నటువంటి మొదటి యక్షరము నడుమనుండెడు నక్షరములకును దనకును పేరగును. ఇటన్నందుచేత తుదనున్న కకారమునకు పొల్లు పనిలే దాయెను గనుక. (?)

సూః—తస్య లోపః.

వృ. తస్య=ఇతో లోప స్స్యాత్.

టీ. అట్టికొన నున్న యిత్తునకు లోప మగును. ఇందున్న కవర్ణము పొల్లులోపము కాఁగాను జిక్కిన యయిదక్షరములును హ్రస్వములుగాను దీర్ఘములుగాను నుచ్చరించిన అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ౡ, ౡా, యాని పదియాయెను. ఏచః=ఏ,ఓ, ఐ, ఔ, చ్ అను ఏచ్ప్రత్యాహారమునందు మానుపటిపలె కొన నున్న చకారము పొల్లు గనుక మిగిలినవి నాలు గాయెను.

సూః—"ఏజ్ హ్రస్వో నాస్తి"

అను సూత్రముచేత ఈయేచ్చునకు హ్రస్వము లేదు గనుక ఏ, ఓకారములు గీర్వాణభాషయందు కుఱుచలులేవు. అనుస్వారః = పూర్ణబిందు వొకటి (సంస్కృతము నందు పూర్ణ మేకాని ఖండము లేదు.) విసర్గః = విసర్జనీయ మొకటి ఇవన్నియుం కూడఁ గాను, స్వరాః=అచ్చులు, షోడశ = పదియాఱు, స్పర్శాః = స్పర్శములు ఇరువదియైదు, అంతస్థోష్మాణః = అంతస్థములు నాలుగును దొడ్డళకారమును, ఊష్మములు నాలుగును, హలః=వ్యంజనములు, చతుస్త్రింశత్ = ముప్పదినాలుగు, అచ్చులు పదునాఱు, హల్లులు ముప్పదినాలుగు, ఉభయములు గూడ నేఁబది వర్ణము లాయెను.

---

1 సూత్రమునందు (పూ. ము) సూత్రములేకాక ధాత్వాదులుగూడ యుపదేశము అనఁబడును.

తే. అచ్చు లాకవసియాఱును వ్యంజనములు
పాండుపుత్రసహాయ ముప్పదియు మూఁడు
దొడ్డళా యందులోపల దొరల నయ్యె
సమరభాషకు నేఁబది యక్షరములు. 49

సీ. ఏకసీళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ
కాళనాళవ్యాళగోళహింతాళంబు లనుచు సంస్కృతభాషయందు లేదొ
గయ్యాళి త్రుళ్లి నంగళ్లు వజ్రపుతళ్కు తాళి యటంచు నాంధ్రమున లేదొ
పాళెం బెఱుంగసికూళ విరాళి పిసాళించు ననుచు దేశ్యమున లేదొ
తే. యాగమజ్ఞులు దొడ్డబీజాక్షరంబు, లందు లేకున్కి సన్నంబు నదియుఁ గూడ
నొకటిగాఁ జేసి బీజోపయోగి గాన, తాను జేకొని రది శబ్దసరణి గాదు. 50

వ. ఆగమజ్ఞులు పంచాశద్వర్ణంబులలో నున్న క్షకారమును గూడుకొన్నందునకు మహా
విద్యలోని శ్లోకంబులు. 51

శ్లో. మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానం తు మేహనమ్
నాభి స్తు మణిపూరాఖ్యం హృదయాబ్జ మనాహతమ్,
తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్,
సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదో విదుః.

శా. ఆధార స్తు చతుర్దళో రుణరుచి ర్వాసాంతవర్ణాశ్రయః
స్వాధిష్ఠాన మనేకవైద్యుతనిభం బాలాంతషట్పత్రకమ్,
రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం
పత్రై ర్ద్వాదశభి స్తనాహతపురీ హైమీ కఠాంతాన్వితా.

శా. ద్వ్యష్టారం స్వరషోడశై శ్చ సహితం జ్యోతిర్విశుద్ధాంబుజం
హాం క్షేత్యక్షరపద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ,
తస్మా దూర్ధ్వ మధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయీ సదాశివపురీ శక్త్యై(?) నము శ్శాశ్వతమ్.

తే. కాను షా జడ్డ యైన క్షకార మగుట, దలఁప కేఁబదిలిపులలో దానిఁగూర్చి
తొలఁత భిన్నాక్షరం బైన దొడ్డళాను, విడిచిపెట్టె ననంతుండు వెట్టి గాఁడె. 52

వ. ఛందమునందు ననంతుఁడు చెప్పినవిధము. 53

క. యరలవ లంతస్థలు నాఁ, బరఁగును శషసహలు దేఁటపడు నూష్మ లనన్
సొరిది క్షకారము గూడుక, సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 54

క. ళళలకు భేదము లే దను, పలుకున ళా దొలఁగి యైదుపదు లగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి, తెలుఁగున ఱళ లనఁగ రెం డధిక మగుఁ గృష్ణా 55

## ప్రాకృతోనాక్షరపరిగణన హేమచంద్రాచార్యవచనము:—

శ్లో. ఋౡవర్ణా హ్రస్వదీర్ఘా వైజాద్యా వనునాసికా,
శషౌచ దశ తే న్యూనాః ప్రాకృతోక్తిషు సర్వతః.

టీ. హ్రస్వదీర్ఘా=హ్రస్వము దీర్ఘమును ఐనటువంటి, ఋౡవర్ణా = ఋకార ౡకారములును, అనఁగా ఋ, ౠ, ఌ, ౡ అనునవి ఈరెండును, ఐచ్=ఐఔలును, ఆద్యౌ = మొదటి వైనటువంటి రెండును, అనునాసికౌ = అనునాసికములును, అనఁగా మొదటి రెండనునాసికము లైనఙకార ఞకారములనునవి, శషౌచ=శవర్ణషకారములును, తేదశ=ఆపదివర్ణములును, ప్రాకృతోక్తిషు = ప్రాకృతవచనములయందు, న్యూనాః= తక్కువ. అనఁగా సంస్కృతభాషకుఁ జెప్పిన యేబదింటిలో ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష అనునీపదివర్ణములు ప్రాకృతభాషకుఁ దక్కువ యగుచున్న వనుట.

తే. సప్తమస్వరముఖచతుష్టయము ద్వాద, శస్వరంబును లోకసంఖ్యాస్వరంబు
నుర్వి నాద్యనునాసికయుగము శషలు, ప్రాకృతంబున నిక్క మీపదియుం లేవు. 56

వ. లోకసంఖ్యాస్వర మనఁగా గణితశాస్త్రోక్తసంఖ్యను జతుర్దశలోకములు గనుక పదు
నాలవస్వర మనుట. ఔకారమునకు పేరు. 57

## ఆంధ్రభాషావర్ణసంఖ్య

మూ. సూ:—ద్వివిధాదిదు దేవోతోచో వక్రతమా వనుస్వారా,
కగచజయుగ టడణతదనపబమయరయుగలయుగవసహాశ్చహాలః.

సీ. అచ్చులలో సప్తమాక్షరం బాదిగా వరుస నాల్గును దుదివర్ణ మొకఁడు
స్పర్శాక్షరములందుఁ బాచవర్గములను సమము లై యుండునక్షరములు పది
మొదలివ్యంజనవర్గములను రెంటను దుదిఁ గనుపట్టుననునాసికద్వయంబు
నూష్మవర్ణము లన నొప్పునాల్గిటిలోనఁ బ్రథమద్వితీయాక్షరములు రెండు
తే. సెన్న నీయొండు కడమగా నిరువదియును, జగతి శుద్ధాంధ్రదేశ్యభాషాపదముల
వెదకినను లేవు తత్సమపదములందుఁ, దనరు నిన్నియు నది సంస్కృతంబు గాన. 58

క. తుదలను వికృతివిభక్తులు, గడియుంటచేఁ దెలుఁగులందుఁ గలసెను గా కో
యదువర తత్సమపదముల, మొదలాద్యప్రకృతిశబ్దములు దెలుఁగగునే. 59

సీ. దేవతాభాషను దీర్ఘంబులే కాని కలనైనఁ గుఱుచలు గాక యుండు
హారవిశ్వదివససంఖ్యాచ్చులు దెలుఁగులఁ గడు హ్రస్వములును దీర్ఘములు నగును
సంస్కృతంబునఁ దాలుజవనమాత్రమె కాని జగతి నన్యస్థానసంభవంబు
చర్చింప నెఱుఁగనిచజ లాంధ్రమునఁ దాలుజాతంబులును దంతజములు నగును
తే. దలఁప నేకప్రకారమై దైవతోక్తు, లందు భేదంబు లేనిరేఫాక్షరంబు
రేఫము ఱకారమును నన రెండువెఱఁగు, లగుచు వికృతులఁ దనరు దుగ్ధాబ్ధిశయన.

వ. హారవిశ్వదివససంఖ్యాచ్చు లనఁగాను గణితశాస్త్రోక్త సంజ్ఞను, హార యనఁ బదునొకొండవయచ్చు ఎకారము, విశ్వ మనఁగాఁ బదుమూఁడవయచ్చు ఒకారము, దివస మనఁగాఁ బదునేనవయచ్చు అః అనునది. యీమూఁడచ్చులకును దెలుఁగున హ్రస్వమ్మును దీర్ఘమును గల వనుట. అం అనుదానికి దీర్ఘ మురాఁగా ఆం ఆయెను. ఇంతమాత్రమున కచ్చులమొదల నకారంబును ఆకారంబును రెండును ఉన్నవి దానికిం జెప్పరాదా దీనికిఁ జెప్పవలెనా యనఁగా, ఇవి యాకారమునకుఁ జెప్పుటగాదు. అనుస్వారము ప్రత్యేక ముచ్చరింప శక్యము కాదు గనుకఁ బాణిన్యాచార్యులవ్యాకరణమునందు అం ఇత్యనుస్వారః అని అకారముతోఁ గూర్చిచెప్పినాఁడు గనుక అం అనఁగా బిందువునకు సంజ్ఞ. ఆబిందువునకు హ్రస్వదీర్ఘను లెటువలెకలుగు ననఁగా ముంగలిపద్యముచేతను దెలిసికొనునది. 61

ఆ. బిందువునకు రెండు భేదంబు లగు హ్రస్వ, దీర్ఘరూపములను దెలుఁగులందు
హ్రస్వమనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘ, మనఁగఁ బూర్ణబిందు వయ్యెఁ గృష్ణ. 62

క. తక్కువపడియును దొమ్మిది, యెక్కువలిపు లాఱు నయ్యె నేఁబదిలో నీ
లెక్కను ముప్పదియాఱును నే, డక్కరములు నిలిచె శుద్ధ మగునాంధ్రమునన్. 63

వ. తత్తద్వర్ణభేదాభేదంబు లెఱింగించెద. 64

మూ. సూ:—వికృతిపదాదౌ ప్రథమాంతస్థతృతీయానునాసికా న స్తః.

క. తెలుగున యణకారంబులు, గలుగవు శబ్దాదులను యకారముపగిదిన్
బలుకఁబడునవి స్వరము లగు, ఖలపూర్వామరవినాశ కామెపలీశా. 65

క్రారకొమ్ములు.

సీ. క్రుఙ్ క్రుశ క్రూర శిగ్రు క్రుతి *విక్రుత శుక్రూష నిః స్రుతి స్రు స్రివములు
భ్రూణ భ్రుకుంశ బభ్రు భ్రు భ్రువాణంబులు భ్రుకుటిత భ్రూలతా ప్రకటితములు

---

* 'విక్రుతి' పాఠాంతరము.

కద్రువ ద్రుపద ద్రుమ ద్రుహిణ ద్రుహి సౌరద్రు విద్రుమ శత్రువులును
ధ్రువమును ద్రుతమును భువిఁ గ్రారకొమ్ము లై తనరారుఁ గాని ఋత్వములు గావు
తే. వట్రువులు లేవు తెనుఁగున వానిపగిదిఁ, బలుకులిపు లెల్లఁ గ్రారకొమ్ములు నిజంబు
దనుము నిందాఁకఁ జైద్యుఁడు ద్రుష్టైననఁగ,రోహిణీభర్తచరమాద్రిఁ గ్రుంకెననఁగ.

నృసింహపురాణమునందు:—

సీ. పా. క్రూరకిల్బిషశైలకులిశనిపాతంబు ఘనకలుషోరగగరుడమూర్తి. (ఆ. 2. 35.)
వ. మఱియును. 67
చ. శ్రుతిమతధర్మయోగములు చోద్యపుమూల్యము లప్పురంబునఁ
జతురతఁ బుణ్యవస్తువులు సావిముక్తిపదంబు లమ్ము వా
రతులితవిష్ణుశాసనసమాహితు లైనమహాత్ము లంచితో
ద్ధతిఁ గొనువారు భూరివిహితవ్రతపారగు లైనబోధనుల్. (ఆ. 1. 46.) 68

కావ్యాలంకారచూడామణియందు:—

క. భావమె యించుక వదనా, బ్జావళితవికాస మైనహావము శృంగా
రావిర్భావనిదానము, భ్రూవల్లీచుంవచలనమున నెఱుఁగఁబడున్. (ఆ. 2. 22.)

ప్రభావతీప్రద్యుమ్నమునందు:—

సీ. పా. సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప. (ఆ. 2. 15.) 70
ఆ. అద్రువ విద్రువ ననుక్రియాపదంబులయందుఁ, దగిలి వట్రుసుడులపగిది నుండు
వ్రాలు తేలఁ బల్కఁ గ్రారకొమ్ములు గాని, వట్రుసుడులు గావు వనజనాభ. 71

ఋత్వాక్షరంబులు

సీ. ఋష్యమూకాద్రియుఁ ఋష్యశృంగుండును ఋక్షనృగేంద్రుఁడు ఋక్షపదము
ఋతము ఋత్విక్కు నైరృతి ఋతుషట్కమ్ము ఋతుపర్ణభూపతి ఋతుమతియును
ఋషభవాహనుఁడును ఋషియు ఋగ్వేదంబు ఋభురాజుఋణమును ఋద్ధిఋజువు
ననునీపదంబుల కాదివర్ణంబులు సప్తమస్వరము లై జగతి వెలయుఁ
తే. గృష్ణ వృత్రాంతకా హృషీకేశ మదన, జనక పృథ్వీకుమారభంజన యటంచు
పల్కులందును వట్రువ లమరి యుండు, సంస్కృతంబున యదువంశసార్వభౌమ. 72

వక్రభేదంబులు

ఆ. ఏక మోక మిట్టు లేక్వంబు నోత్వంబు, నమరభాష నిడుద లగును గాని
హ్రస్వలిపులు గావు హల్లులై నట్టిన, యగును గేకి కోకిలాలి యనఁగ. 73
ఆ. పెక్కు రేల కృష్ణుఁ డొక్కఁ డోపఁడె పసి, నెలవు నేల యరసి బాలము వోవ
ననఁగ నిట్టు తెనుఁగులందు వక్రయుగంబు, హ్రస్వములును నిడుదవ్రాలు నగును.

## వ్యంజనలోపము

ఆ. పూనె నెగసెఁ బొదవెఁ బొసరెఁ బొంగె నటన్న, పలుకులందు మొదలఁగలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు, నిలుచు వలసినపుడు నీరజాక్ష. 75

పూని యనుటకు విష్ణుచిత్తీయమునందు:—

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె [1]గాంచి యజాండభాండముల్
వానను మీఁదఁ బ్రోవ నడపం గొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వానచలత్వసిద్ధ లె సమస్తజగంబులజాడ్యచేతనల్
గా నుతి కెక్కుసైన్యపతికాంచనవేత్రము నాశ్రయించెదన్. (అ. 1. 4.) 76

హల్లు లోప మై ఊనె యనుటకుఁ బారిజాతాపహరణమునందు:—

క. మానపతి యిట్లు మానని, మానక్రోధము[2]లచేత మరలిచి చింతా
ధీనగతి నుండ మదిలో, మానిన ప్రేమమున నంబుజోదరుఁ డనియెన్.(అ. 1. 114.)

నెగసె యనుటకు నాదిపర్వమునందు:—

ఆ. కర్మబంధములను గ్రక్కునఁ బాయుండుఁ, బుణ్యగతికి నెగయుపురుషునట్లు
బంధనంబు లెల్లఁ బాయుచు భీముఁడు, నీరిలోననుండి నెగయుదెంచె.(అ.5 177.)

విరాటపర్వమునందు:—

సీ. పా. నెగసినకొనలతో నింగి యంతంతకు నవలఁబోవఁగఁ దనరారుదాని. (అ.1.162.)

ఉద్యోగపర్వమునందు:—

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, వెఱచుచు వ్రే గడిరి సొగసి త్రెళ్లి వివశుఁ డై
యఱచిన నోడకు మని హరి, సెఱి చక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయఁగఁ గృపతోన్.
(అ. 3. 301.)

వ్యంజనలోప మైనందులకు శృంగారనైషధమునందు:—

సీ. పా. ఒంటికాలున నిల్చి యూర్మిమారుతములఁ జిగురుటెక్కల రేకు లెగయుచుండ.
(అ. 3. 69.)

పొదవె నన్నందుకు నృసింహపురాణమున:—

తే. ఆదరిపాటున [3]వెస విచ్చి పొదవిపొదవినఁ, [4]దాలఁగి పోవఁగఁ గూడకములయపవనుఁ
డిందుఁదలఁదూర్చుకొనియెనో యిప్పుడనఁగ, నమరుఁదాళవృంతములమందా నిలంబు.

---

1 దాల్చి. 2 లఁజేత మాఱిచి (అచ్చుప్రతి). 3 వెసవి. 4 గలఁగి తలఁగి పోనే రక. 5 నా నింపొనర్చె (అచ్చుప్రతి).

అందే:—

తే. పొదవి యొండొండ దివియును భువియు దెసలుఁ
బొదవికొని యుండుచీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్లు
కరవటం బన జగదండ ఖండ మమరె. (ఆ. 3. 80.) 83

అందే:—

క. అది యట్లు గాదె నిప్పునఁ, జెద లంటునె దేవదేవు శ్రీరమణీశుఁ
మదిఁ దలఁచుకొన్న వానిని, బొందునె యాపదలు రవినిఁ బొందునె తమముల్.(ఆ.4.32.)

అచ్చునకుఁ జిత్రభారతమునందు:—

క. తదనంతరంబ క్రమ్మఱ, యదువిభుఁడు కృపాంచితేక్షణుఁ డై వాణీశ
త్రిదశేశుల కాశ్చర్యం, బొదవ మనిచె నుభయసైన్యయోధుల నెల్లన్. 85

ఉద్యోగపర్వమునందు:—

క. పదపడి దుస్తర మగునీ, పదుమూఁడగునేఁడు గడవఁబడుట యరిది ద
మ్మైదు రెఱుఁగకుండ నాపద, లొదవఁగ సైరించి రిట్టి యునికియుఁ గలదే. (ఆ.1.9.)

పొనరె నన్నంపకు నుద్యోగపర్వమునందు:—

క. ధనమును విద్యయు వంశం, బును దుర్మ్మదులకు మదంబుఁ బొనరించుచు స
జ్జను లైనవారి కడఁకువ, యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా.(ఆ. 2. 35.)

అందే:—

మ. అని నిశ్చెచ్చి వృకోదరుం డతఁడు కార్యం బింత తెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ జేరెలుఁగు సొంపుం జెంద వక్త్రంబుపొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం బొంగారుతద్వ్యాహృత
ధ్వని యై మించుమహోగ్రసింధురముచందం బొంది పొల్చెం దగన్. (ఆ 3.143)

పకారములో నిప్వరమే నిల్చినందుకుఁ బ్రబంధపరమేశ్వరుఁడు చెప్పిన అహోబలమాహాత్మ్యమునందు:—

క. నిను నాశ్రయించియును నే, ననఘా కడ లేనివనట యనువననిధిలో
మునుఁగుదునె ప్రతీకారం, బొనరింపఁ గదయ్య దీని కూహించి కృపన్. 89

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

చ. ధనదునిపుష్పకంబునకుఁ దా నెన వచ్చు నటంచు లోకముల్
వినుతి [1]యొనర్పఁ బొల్పెసఁగి విద్రుమమౌక్తిక నీలవజ్ర కాం

1 యొసంగెఁ (క).

చనయుతము న్నవేగహయసంఘటితంబును నైన తేరు సొం
పొనరఁగ నెక్కి మిక్కిలి సముత్సుకతం బురబాహ్యవీథులన్. 90

పొందె ననుటకు శంభుదాసునిలక్ష్మీనృసింహావతారకథయందు:—

ఉ. పొందవు దుఃఖము ల్భయము వొందదు వొందదు దైన్య మెమ్మెయిం
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్రసౌఖ్యములుఁ బొందు సమున్నతకీర్తు లెందు గో
వింవపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్. (ఆ. 2. 31.) 91

[1]ఒదాదేశహ్రస్వంబులు

తే. కాంచు హ్రస్వద్వితీయవక్త్రంబు నంద, యొక్కఁ డనుపిసిరెండవయక్కరంబు
హ్రస్వ మగుఁ జోగునుపపంబునందు మొదలి,వర్ణమును గబ్బములను గావలసినపుడు.

'అందొఱు' అనుట కాదిపర్వమున:—

క. [2]గెలుపునెడ నేయునెడ వడిఁ, [3]బలుపునెడం బెనఁగునెడ నపారబలంబుల్
మెఱయునెడభీమునకు నం,దొఱుగీడ్పడఁ దొడఁగిరుద్ధతులు రాజసుతుల్. (ఆ. 5. 168.)

ఆరణ్యపర్వమునందు:—

సీ. పా. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షు లందొఱును మనకు.
(ఆ. 1. 269.)

ఒత్వము రానందుకు విరాటపర్వమునందు:—

క. ఎఱుక గలవారి కైనను, గఱపక దక్క రుచితప్రకారము శుభముల్
గొఱలుహితు లట్టిగుటనం,దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్. (ఆ. 1. 116.)

ఒక్కొ యనుటకుఁ గర్ణపర్వమునందు:—

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్నుకై సేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడువ దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి వొగడన్ రారాజుసైన్యంబు లొ
క్కొ మొగిం బెల్లగిలంగ బెట్టిదిమె సక్రోధాంతరంగంబునన్. (ఆ. 2. 352.)

మనుచరిత్రమునందు:—

క. ఇట సవ్వరూథినియు నొ,క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
గటకఝుళంఝుళరవపద, కటకసమాకృష్టకేళికలహంసిక యై. (ఆ. 3. 72.) 97

1 ఓదా (పాఠాంతరము.) 2 కఱచు. 3 బఱచు.

రాఘవపాండవీయమునందు:—

స్రగ్ధర. ఆరాజన్యోత్తముం డి ట్లసురతరభసుం డై భవత్పత్వరవ్యా
హారం బి ట్లోర్చి యుం టన్యయముగఁ గొనకు మాత్మాంగనాశుల్కతాద్య
క్సాగోత్రే ష్వాస మ ట్లిత్రుజిత మగు టెంచంగ నాచేతికాఁటం
గ్రూరేష్వాసంబు లే దొక్కొఁడుగలుగనె మద్ఘోరయుద్ధంబునై నన్. (ఆ 2. 93)

ఒకారము రానందులకుఁ గాశీఖండమున:—

ఉ. కంటికి నిద్ర వచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకున్
వంటక మిందునే, యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె మానుషంబు గలయట్టి మనుష్యున కెంతవానికిన్
గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్. (ఆ. 1. 103) 99

విరాటపర్వమునందు:—

సీ. పా. శక్రాదిసురలతో సంగ్రామ మొనరించి ఖాండవ మేర్చె నొక్కరుఁడు గాఁడె.
(ఆ. 4. 210)

చోటు అనుటకు ద్రోణపర్వమునందు:—

క. కటకట పేరినవెన్నె, త్తుట జొత్తిలి యున్నమోముతోడను గొడు కె
చ్చటఁ బడి యున్నాఁడో య, చ్చోటుఁ జూపెతు నాకు లేరె చూపెద వానిన్.
(ఆ. 2. 251)

విష్ణుచిత్తీయమునందు:—

మ. స్ఫుటభూయోహ్రుతిశంక వార్ధిరవిరశ్ము ల్మిన్నుఁ జేర్పం దటి
చ్ఛటగార్యంబుగఁ గాఁచుకొంచు ఘన మై త్మాధీర వర్షింప న
చ్చోటునుం ద్రోచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు గాకున్న నొ
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే. 102
(ఆ. 4. 145)

హ్రస్వము గానందులకు మనుచరిత్రము:—

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన[1]నెపం బిడి యేడ్చెఁ [2]గలస్వనంబునన్
మీటిన విచ్చుగబ్బిచనుమిట్టల నశ్రులు చింద వందఁగాన్. (ఆ. 2. 70) 103

---

1 నెపంబున నే. 2 గలస్వనంబుతో.

వక్రభేదంబులు. పాణినీయసూత్రము

సూ.—తద్ధితే ష్వచా మాదేః.

వృ. ఞితి ణితి చ తద్ధితే పరే అచా మాదే రచో వృద్ధి స్స్యాత్.

క. హైయంగవీనమునకున్. నైయంకవశబ్దమునకు నైయగ్రోధ
[1]స్త్రైయజితాదుల కాదిని, ప్రాయంగా వలయుఁ బ్రథమవక్రతమంబుల్. 104

క. నైయగ్ర్త్యైయంబక, నైయాకరణాగ్రగణ్యవైయాఘ్రపదీ
వైయాత్యంబుల మొదలను. బ్రాయం దగు బుధులు ప్రథమవక్రతమంబుల్. 105

క. యావనయావతకౌస్తుభ, సౌవర్ణకయావరాజ్యసౌవీరమహీ
దౌవారికశబ్దంబులఁ, దావుకొను ద్వితీయవక్రతమములు మొదలన్. 106

క. సౌవగ్రామికశౌవన, [2]సౌవర్చససౌవిదల్ల సౌవస్వలన
తైస్వరశబ్దముల మొదల, వావిరి నిలుచున్ ద్వితీయవక్రతమంబుల్. 107

కౌస్తుభము అనుటకు నృసింహపురాణమునందు:—

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభనూతనార్కరుచికర్బితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచుసుకృతాత్ము లపాస్తసమస్తకల్మషుల్ (ఆ. 2. 37) 108

క. మెచ్చు లగుకల్పములలో, నచ్చతెచ్చుఁగుపల్కులందు నైతైత్వంబుల్
వచ్చిన నొం డగు రెం డగు, విచ్చలవిడి వలసెనేని విబుధస్తుత్యా. 109

మూ.సూ:—అయుగవృగాదేశౌస్తః క్రమేణ సర్వత్ర వక్రతమయో స్స్యాత్

క. క్రమమున వక్రతమములకు, నమక నయుక్కును నవుక్కు ననియొడునాదే
శములు వికల్పంబున నై, త్యమదాపహ యాంధ్రభాషయం దెల్లెడలన్. 110

ఆ. లోకహితముకొఱకుఁ బైకొని దుష్టుల, లయ మొనర్చి శిష్టు లయిననృపుల
నేల యేల నిలిపెఁ గౌలిచ్చి నలుదెసఁ, దవిలి కృష్ణరాయఁ దవుర యనఁగ. 111

శవర్గాక్షరభేదంబులు

మూ. సూ:—వా స్యా త్క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గపరశస్య.

సీ. పరుగులు పరువులు పగడంబు పవడంబు పగలుట పవలుట పగలు పవలు
నగుబాటు నవుబాటు నలుగురు నలువురు తగులాట తవులాట తొగలు తొవలు

1 వైయక్కృతంబుల

2 ఉసౌవర్చన సౌవిదల్ల సౌదశ్వ (అచ్చు).

త్రాఁగుట త్రావుట ప్రేఁగులు ప్రేవులు ప్రోఁగులు ప్రోవులు సోఁగ సోవ
యిఁగ మివ మఁగు నవు నిగురాకు లివురాకు లీఁగ లీవులు మ్రాఁనిచేఁగ చేవ

తే. తీఁగియలు తీవియలు పఱుఁ దిగిచెఁ దివిచె
ననుచు నిబ్బంగి నొకవేళ నాదివర్ణ
ములకుఁ దక్కంగఁ గొన్నిమాటలకు గృతులఁ
బ్రథమసరళంబులకు వకారములు వచ్చు. 112

పూర్వనైషధమునందు:—

మ. పవిసంగంబునఁ దాప మొందినశచీప్రాణేశుకెంగేలికిం
జివురుంగైదువజోదువైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారపయోమిళన్మలయజస్నానార్ద్రపర్యంత మై
యివతాళించువిదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్. (ఆ. 3. 34) 113

శాంతిపర్వమునందు:—

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిశెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము చేసె వరం బని శౌరి గొంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యలంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె [1]నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్. (ఆ. 1. 35) 114

మార్కండేయపురాణమునందు:—

చ. ఘననిబిడాంధకారరిపు[2]ఖండనచండమయూఖరాజిచే
ననుదినముం బ్రభాతములయం దమృతాంశుమరీచు లేఁగఁగా
వనజము లుల్లసిల్లఁగఁ [3]దోవ ల్మొదుఁగం బ్రథమాద్రిఁ బొల్చిన
ద్దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. (ఆ. 7. 123) 115

తే. ఆఁగె లాఁగెను పీఁగెను డాఁగె నేఁగె, వాఁగె ననునివి మొదలగువాక్యములను
బొదలునక్షరములు చిన్నబొట్లపై గ,కారములు గాని యనునాసికములు గావు. 116

చవర్గాక్షరభేదంబులు

**మూ. సూ:— అ ద్దంత్యా స్తాలవ్యాశ్చ ద్వ్యక్రః సాన్నిత స్స్వర్ణాశ్చ.** 6

ఆ. ధరణి దంత్యములును దాలవ్యములు నన, వికృతిచజలు రెండువిధము లయ్యె
వీనిఁ దెలియ కున్న విశ్రమభంగంబు, దొడరి కావ్యములను దోష మొదవు. 117

---

1 నరుం డటు సంపె. 2 ఖండపిచండ. 3 దొవల్మోగుడం; దొవల్మొనుఁగం.

ఆ. దంతజంబు లెల్లఁ దలకట్టులును వాని, యందు దీర్ఘములును బొంది యుండుఁ
దాలుజాక్షరములు దనరారు హ్రస్వాది, వక్రయుతము లగుచు వనజనాభ. 118

ఆ. చలము మాని కుడువు చట్టకేశవ శ్రాద్ధు, చాల నయ్యెఁ బసిప్రజంబు వెడలె
జతలు గూడి వచ్చి సఖులు చీరెద రేల, జా గనంగ దంతజంబు లయ్యె. 119

ఆ. చెప్పరాని క్రొవ్వచేఁ గంసుపంపున, జెలఁగికొనుచుఁ దన్నుఁ జేరి పెనఁగ
జెట్టి మట్టుబెట్టె జిఱుతనే నందుని, పట్టి యనఁగఁ దాలుభవము లయ్యె. 120

ఆ. చేతఁ జీర లైకు చేరెడువరహాలు, జేసెఁ దంత జిత్తు చేక టొకటి
చేఁదుకొనియెఁ గృష్ణుఁ జేర్చుక యన నిట్లు, పఱలుఁ గొన్ని దీర్ఘవక్రలిపులు. 121

తే. దంత్యముల నరవంకలు ద్రైవభాషఁ, గనము తాలవ్యములఁ దలకట్టు లేవు
ప్రాకృతమునందుఁ దద్భవపదమునందు, దంత్యములె కాని తాలుజాతములు లేవు.

వ. వక్రమునకుఁ దద్భవము వంకలు, అరవంక లనఁగాను గుఱుచ యొత్వములు అనుట, దీర్ఘమునకుఁ దద్భవములు తీఁగలు. 123

ఆ. చెందమామ గాయఁ జెక్కెరవిలుకాఁడు, జాజిపువ్వుటంపజల్లు గురియఁ
జామ గాక కోర్వఁ జాలక వాడి వచ్చు, దనుక బడలె ననఁగ దంత్యచజలు. 124

తే. చంద్రశబ్దమునకుఁ దజ్జంబు చెంద,మాకు జాతికి జాజి శ్యామకును జామ
శర్కరకుఁ జెక్కెరయునగు జలము జల్లు (జమ్మికడఁ గామెపలి నున్న చక్రపాణి.)

వ. చంద్రశబ్దతద్భవంబు చందమామ, జాజికి జాజి, శ్యామకు చామ, శర్కరకు చక్కెర, జలమునకు "లళయో రభేదః" అను సూత్రముచేత జళము, దానికి "లడయో రభేదః" అనుదానిచేత జడ మాయెను. అది ప్రాకృతముచేసిన నాది వర్ణము దంత్యమాయెను. అది తద్భవముచేసి బహువచనముచేసిన జల్లు. 125

క. తొడరు జటాశబ్దమునకు, జడ యనునది తద్భవంబు చదలును జానుం
గడు నచ్చతెనుఁగు లివి పద, పడి మూఁడును దంత్యములుగఁ బలుకఁ దగు హరీ.

వ. జటాశబ్దతద్భవము జడ. 127

ఆ. జడలు మెఱయ వచ్చి సంయమిశ్రేష్ఠుఁడు, చదలుమ్రానిపువ్వ శౌరి కిచ్చె
సరస నున్నదనుచు జా నొప్ప భీష్మక, తనయ కిచ్చె నతఁడు దగ వెలింగి. 128

పారిజాతాపహరణమునందు:—

సీ. గీ. దేహకాంతు[1]లు బాలచంద్రికల నీన, జడలు మోదుద్రపల్లవశంకఁ జేయ. 129

1 లకాలచంద్రికల (అచ్చు పారిజాత).

నైషధమునందు:—

సీ. పా. చపలేతరబంగారు జలరుహంబుల ¹తూండ్లు, భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి. (ఆ. 1. 49)

అనంతుని ఛందమునందు:—

ఉపజాతి. పినాకికోదండము బిట్టు ద్రుంచెన్, ²తా నొప్పఁ గెల్చె న్జమదగ్నిసూనున్
ఘనుం డితం డుర్వి ననంగ రెంటన్, జానైనవృత్తం బుపజాతి యయ్యెన్. 131

క. భూమినిఘంటువుఁ జంచకు, పామరజాతీయ యచట పరికించి బుధ
గ్రామణులు చంచు లని వెసఁ, దా మేశ్వం బిడరు వడికి తలకట్టిడుటన్. 132

తే. ప్రాసముల రెండు నొకటిగాఁ బలుకవచ్చు
వడికి స్వరమైత్రి లేకున్న నడుగ రాదు
తాట్టియొత్వములకు దంత్యములకుఁ దక్క
భేదములు లేవు చజలకు వేదవేద్య. 133

ఆ. రాచనెలఁతలందు నేచెలియును భోజరాజకన్యవంటి యోజ గలదె
చక్కఁదనము గాక సద్గుణంబును గాంచెఁ, జెఱకుఁగోల ఫలముఁ జెందినట్లు. 134

తే. దంత్యతాలవ్యచజలకు ధరణి ప్రాసం, బతని శుద్ధాంధ్రలిపిని భేదంబుకలిమి
ద్వ్యర్థకృతులను దలకట్టు లనుచు నొకట, నిదియు నొకదాన నదియును నిడఁగ రాదు.

రాఘవపాండవీయమునందు:—

ఆ. ఎందు వేఁట రాక యితరు లేమన సుతో
దారసంగసుఖము తప్పఁ ద్రోచి
తకట పాండురాజయశ మెన్నవై తతి
క్రూరదశరథేశకులము రోయ. (అ.1. 29) 136

వ. ఈ పద్యములోను రామాయణార్థమునందు అజయశ మని సమాసము చేసి పలుక జకారము తాలవ్య మాయెను. భారతార్థమునందు పాండురాజ యని సంబుద్ధిగాఁ బలుక ఆవర్ణమే మరల దంత్యం బాయెను. ఇటువలెనే యాదిమహాకవిప్రయోగంబులు చూడఁగాను, దాలవ్య మర్థాంతరమందు దంత్యముగాఁ జెప్పరాదని యెట్టంటే పోయి యనఁగా సాధ్యప్రకృతియందు దంత్యచజలు లేవు గనుక శుద్ధసంస్కృతమైన పాండురాజశబ్దమునందుఁ గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణిక మతము కాదు. అట్లగుటం జేసి కవితాప్రవర్తకులైన సూరపరాజుగారు ఇంత పట్టును విచారించి ప్రయోగించిరి. 137

1 తూట్ల (ప). జానొప్ప (భూ. ము. యతిభంగము.)

## పాణినీయసూత్రము

**సూ:—ఛే చ.**

వృ. హ్రస్వస్య, ఛే పరే తుగాగమ స్స్యాత్సంహితాయాం విషయే. 'హలంత్య,' మితిసూత్రేణ కకారస్య ఇత్సంజ్ఞా. "తస్య లోప" ఇతి లోపః తు, "ఉపదేశేఽజనునాసికఇ" దితి (ఉకారస్యేత్సంజ్ఞాయాం తస్యలోపఇతి) ఉల్లోపః.

**సూ:—స్తోః శ్చునా శ్చుః.**

వృ. స్తోః=సకారతవర్గయోః (శ్చునా=) శకారచవర్గాభ్యాం యోగే (శ్చుః=) శకారచవర్గౌస్తః. [1]శివచ్ఛాయా.

**సూ:—ఆఙ్మాఙో శ్చ.**

వృ. ఏతయో శ్ఛే పరే తుగాగమ స్స్యాత్. ఆచ్ఛాదయతి, మాచ్ఛినత్. 'పదాంతా' ద్వేతి వికల్పాపవాదః.

**సూ:—దీర్ఘాత్.**

వృ. దీర్ఘా చ్ఛే పరే తు క్స్యాత్. హ్రీచ్ఛతి, మ్లేచ్ఛతి.

**సూ:—పదాన్తాద్వా.**

వృ. దీర్ఘాత్పదాన్తాచ్ఛే పరే తు గ్వా స్యాత్, లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా.

సీ. ఛాగపుచ్ఛచ్ఛటాచ్ఛందోయదృచ్ఛాసితచ్ఛత్రపద్మచ్ఛదలాచ్ఛ
విచ్ఛిత్తికచ్ఛాపకచ్ఛపరిచ్ఛేదపృచ్ఛాచ్ఛవిచ్ఛిరతుచ్ఛగుచ్ఛ
పదములు మొద లైనత్రిదశభాషాశబ్దముల నాదిమధ్యాంతములను గలుగు
సప్తమవ్యంజనాక్షరము ప్రాగ్వముమీఁదఁ దనక్రిందఁ దాన ద్విత్వ మగుచుండు
తే. నిడుద లగునక్కరంబులకుడిన నిలుచు, నప్పుడ వికల్పకంబున నట్లన యగు
బంధురవిలాస చంద్రికాభదరహాస, ధర్మపురవాస శ్రీకామెపలినివాస. 138

## టవర్గాక్షరభేదంబులు

ఆ. ఠవర ఠీవి ఠేవ ఠావును ఢాకయు, మొదలుగా ద్వితీయములం చతుర్థ
వర్ణములును గలుగువాక్యంబులును స్వదేశ్యములు గాని వైకృతములు గావు. 139

**విజయవిలాసమునందు:—**

క. ఠొమ్మపయి నీవు పక్షము, లిమ్మొయి నెరపుదు వి దేల యేచెద వకటా
ఠమ్మఁగ నవాతుచక్కెర, గ్రమ్మఁగ మాటాడు ఠవర కలకంఠవరా.(ఆ.3.56)140

---

1 శివ+ఛాయా (శివ+తుక్ = శివ+తు=శివ+త్+ఛాయా=శివచ్ఛాయా.

మనుచరిత్రమునందు:—

క. దివి బినకుహాబాంధవసైం, ధవసంఘం బెంతదవ్వు దగ నే కరుగున్
భువి నంతదవ్వు మేముకు, తవతవ లే కరుగునుము హుటాహుటినడలన్. 141
(ఆ. 1. 76)

పాండురంగమాహాత్మ్యమునందు:—

సీ. గీ. సఖులు పరిహాసకులు వెంటఁ జనఁగ యుంపతి, భుక్తరిత్య క్తపరిధానయుక్తుఁడగుచు
నగరఘుంటాపథంబున నగుచుఁ దిరుగు, నౌఆపుగలకీం జానిమాత్రోపజీవి. 142
(ఆ. 3. 10)

రామాభ్యుదయమునందు:—

సీ. పా. [1]తేవ మీఁఱఁ దటిన్నటీపంక్తిఁ బ్రేంగించి కోపుగా మెఱుములు గొనఁగఁ జేసి.
(ఆ. 6. 18)

సుభద్రాపరిణయమునందు:—

శా. దేవబ్రాహ్మణభక్తిప్రౌఢ ప్రియవక్తృత్వంబుకారుణ్యాది వి
ద్యావైశేష్యముదిక్కు ధర్మమునకున్ దార్ఢ్యాన మర్యాదకున్
తా నౌచిత్యముజీవగఱ్ఱ హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్. (ఆ. 1. 85)

శశిబిందుచరిత్రమునందు:—

క. నాకౌకసులైనను నీ, ఢాకకు నిల్చెదరె కటకటా మముఁబోట్లం
జేకొని సంరక్షింపక, నీ కిటు లుచితంబె యురవణింప నరేంద్రా. 145

సీ. క్ష్వేళంబు క్ష్వేడంబు చోళుఁడు చోడుఁడు తాళంబు తాడంబు దళము దడము
క్రోళంబు క్రోడంబు నాళంబు నాడంబు నీళంబు నీడంబు గౌళి గౌళి
వ్యాళంబు వ్యాడంబు చూళిక చూడిక వళి వడి హేళి సర్వజ్ఞహేడి
జలకేళి జడకేడి వెలలఁడు వెడలఁడు కేళంబు కేడంబు పాళి పాడి

తే. నేవళము నేవడం బిట్టు నిర్జరాంధ్ర
భాషలను రెండు గొన్నిశబ్దంబులందు
నరయ "లడయో రభేద" యటన్నసూత్ర
మున ళకారంబునకు డత్వములు ఘటించు. 146

---

1 తేవ మీరంగఁ దటిన్నటి ప్రేరేచి క్రొవ్వగా మెఱపులు గొనఁగఁజేసి (పూ. ము.).

సీ. డిండీరదీప్తిపోఁడిమి మీఱు నీకీర్తి డిండీరపాండిమఁ దెగడు నవ్వు
డంభ మిచ్చుటను గూడదు కృష్ణ నీ వేఁగి దంభంబు మిత్రవిందకడఁ జేయుం
డాడిమీఫల మియ్యోదకు నేల కొనిపొమ్ము దాడిమీఫలము సుదంత కిమ్ము
డోలిక నూఁగువేడుక నీకుఁ గల్గిన దోలిక లక్షణతోడ నెక్కు

తే. మనుచు నీపద్యమునఁ జరణాదులందు, విలుపుపదముల మొదటను గలుగువ్రాలు
దత్వడత్వంబులందు రెంటను బొసంగు, శాబ్దికమతంబునను వనజాతనయన. 147

తే. దంభడిండీరడోలికాడాడిమాది, శబ్దముల కాదివర్ణంబు సంస్కృతమున
నుపరివర్గతృతీయ మై యొప్పునట్లు, తెలుఁగున డకారము [1]దవర్ణ మొనరుచుండు.

తే. దాక దగ్గిర దిగ్గియ దాయ దోయ, దాపలను దిగ్గు మను వైకృతముల మొదల
డాక డగ్గిర డిగ్గియ డాయ డోయ, డాపలను డిగ్గు మఱి డా కడంగి నిలుచు. 149

రాజశేఖరచరిత్రమునందు:—

శా. డాకేల న్నిజకన్యకామణులు కంఠశ్రేణి గీలించి పీ
తాకంజాతము లాత్మపావనఖరేఖం దార్చి సంగీతవి
ద్యాకౌశల్యము గాన రా మదికి నాహ్లాదంబు సంధిల్లఁ గౌ
రీకల్యాణము వాడి రప్పుడు పురంధ్రీరత్నముల్ వేడుకన్. (ఆ. 3. 167) 150

ద్రోణపర్వమునందు:—

చ. డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమి గోలుపోవ మీ
రు గడఁక [2]దక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధము ల్మహాస్త్రశ
క్తి గెలుతు [3]నేన మత్కలిశతీవ్రశరంబుల వైభవంబు [4]భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. (ఆ. 5. 381) 151

ఉద్యోగపర్వమునందు:—

ఉ. డక్కెను రాజ్య మంచు నకటా యిటు తమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచెద వ దెట్టరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినమాడ్కి నువ్వె యి
ట్లుక్కువుఁ డైన నీకొడుకు నుల్లము ని న్నిటు లాడఁ [5]గూడునే. (ఆ. 2. 52) 152

---

1 దవర్ణమునకు వచ్చు (ప); దవర్ణము నగుచుండు (వా). 2 దక్కిటిల్లనుఁడు (వా); దక్కిదిల్లనుఁడు (ప). 3 జంపఁ దత్కలిశ (వా); ఁజామద త్కలిశ (ప); గోత్రభి త్కలిశ (అచ్చు). 4 భూరిగను విహారభంగుల (వా). 5 గూఱునే (వా).

వైజయంతీవిలాసమునందు:—

తే. డొంగవలె వచ్చి యిక్కడ [1]డొంగినావ, దేమయా బావగారు పెద్దామె కోప
గించినందులకా బళా మంచివాఁడ, వేమనందును ముసలామె యవివేకి. 153
(ఆ. 4. 36)

వ. డంభడిండీరాదిశబ్దములవలెనే యన్నందుచేతను రెండునుగలవు గనుక దకారమునకు.

ఆరణ్యపర్వమునందు:—

క. జగముల నెల్లను నిండిన, పొగడ్తను వెలితి చేసి పొలయొడలికి నై
తగునే జన్మవ్రతములు, దిగ విడువఁగ నిపుడు నాకుఁ ద్రిభువనదీపా.*(ఆ.7.290)

ఉద్యోగపర్వమునందు:—

క. తగ నీలో సాహింపుము, దిగ విడువక ధర్మతనయుం దృఢమతి వై పొం
దగుచందముకొడుకులను, బ్రిగడలకును జెప్పి [2]తేర్పు పెంపేర్పడఁగన్. (ఆ.2.95)

పారిజాతాపహరణమునందు:—

ఉ. తామర[3]డోయలోఁ దవిలి దాఁటెడు తేఁటులుఁబోలెఁ బెన్నెఱుల్
వేమఱుఁ జేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగనీ రటు చల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. (ఆ. 2. 10) 156

తే. పడఁతుక వడంకుగుబ్బలిపడుక చెంతఁ, గడమ ప్రాఁకులకడ నుండుఁ గడఁకతోడ
వేఁడుకొనఁ దగు నాపువ్వుబోఁడి ననఁగ, గడలిపులు గావు సరళము ల్గాని కృష్ణ.

నృసింహపురాణమునందు:—

సీ. పా. వడిగాలి సుడిసిన మిడుఁగురులందందఁబొదవినఁ దాలిమి[4]వదలనీక. (ఆ.2.14)

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మా
యొడ ననిశంబు పెన్పగయుం నీసును రోషము నెమ్మనంబులో
జడి గొని యుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబు గొని వాని జయించుట ద్రెఁగు చూడఁగన్. (ఆ. 2. 135)

రాఘవపాండవీయమునందు:—

సీ. పా. పుడమిఱేఁడీరీతిఁగడఁగి డెందముమ్రొగవ్యాపారఖేలనమఖిలషింప. (ఆ. 1. 19)

---

* అచ్చుప్రతిలో పాఠాంతరము లున్నవి.

1 డొంకి (ప. వా). 2 తీర్పు. 3 దోయలో (ప). 4 ప్రిదుల (అచ్చు).

తే. పోఁడిమియుం నురువడియుంను సాఁడెమునను
బలుకులఁ దృతీయసరళముల్ వలసినపుడు
భువి స్వకీయానునాసికంబులును గాఁగఁ
బలుకఁబడు నాదికవులకబ్బములకలిమి.

### రంగనాథునిరామాయణమునందు ద్విపదము:—

రాణివాసద్రోహి రావణుఁ బట్టి, పోణిమి చెఱుపవా బుధులు నుతింప. 162

### రాఘవపాండవీయమునందు ద్విరదగతి రగడము:—

పోణిమిగ వకుళకుజపూగములఁ బూగముల, రాణఁ దనరారినవరాగములరాగముల.
(ఆ. 2. 6)

### కర్ణపర్వమునందు:—

తే. సారవంత మై కర్ణునిసైన్య మరవ, ణించుఁ గా కేమిటికి నిల్చి నృపవరేణ్య
పూని చేయంగ[1]ఁ దగినవిగానకార్య, మతని సమయించుటయె నాకు నదిభరంబె.
(ఆ. 2. 148)

### శాంతిపర్వమునందు:—

*చ. యజనము దానకర్మములు నధ్యయనంబు తప స్సహింసయుఁ గ్
బ్రజ కనురాగ మైనపరిపాలన శాంతియుఁ సంగరంబున
న్విజితవిభీత మై యుఁరవణించుటయుఁ న్నృపధర్మముల్ కురు
ప్రజలిలకాయమాన సమరంబు సుధర్మము వీనిలోపలన్. (ఆ. 2. 224) 164

### చంద్రికాపరిణయమునందు:—

ఉ. నాణెము [2]నూడ నున్నదితినందను లందఱు నొక్కరాశి దు
ష్ప్రాణుఁడు వీఁ డొకండు నొకరాశి యఁణుండు జగంబు గాల్పఁ గ
ల్యాణవిదూరు లాకడమయందఱు పుణ్యజనాఖ్యులు న్జగ
త్ప్రాణసమాఖ్యుఁ డీఖలుఁడు సైరి నుఁడీ [3]విపరీతలక్షణంల్. 165

## తవర్గాక్షరభేదంబులు

ఆ. పెతకి వాని కతికె జతికిలఁ బడి యావుఁ, బితుక చీర లుతికె గొతికె ననుచుఁ
బలుకుచోఁ దకారముల దకారములును, వలసెనేని నిలుప వచ్చుఁ గృతుల. 166

---

* అచ్చుప్రతిలో పాఠభేదములున్నవి.

1 వలయుఁ బ్రధానకార్య, మతని సమయించుటయ (అచ్చు). 2 నూదగొన్న (ప). 3 విపరీతలక్షణక్ (వా).

కవిగజాంకుశమునందు:—

క. ఓదుగుచు లక్షణ మెఱుఁగక, కొదుకుచుఁ బ్రాసంబు వడియుఁ గూడక మీఁదన్
వెదకుచుఁ బదసంధులు చెడ, నదుకుచు వెడకవిత చెప్పు నతఁడుం గవియే. 166

ఆముక్తమాల్యదయందు:—

చ. కదళిగభీరపువ్వుపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండి పైఁ
గుదురుగ నిల్పి యోపుగతి గూనల నూనియనించి త్రాట ము
న్నుదికినశాటి వ్రేల నది నొక్కటఁ గ్రుంకిడి వత్తు రెంద ఱే
వదలక యాతనింట శనివారమునం [1]బరదేశవైష్ణవుల్. (ఆ. 1. 83) 167

చిత్రభారతమునందు:—

చ. చదివినవారికి న్వినినసభ్యుల కున్నతి వాంఛ సేయుఁబ
ల్లిదులకుఁ గల్గు విప్రులకు లేఁగటితోఁ గనుపట్టులక్ష కె
న్మొదవుల నిచ్చునట్టిఫలము న్హయమేధము సేయుపుణ్యముల్
గొదకక ధాత్రి యంతయు నకుంఠితదాన మొనర్చుశ్రేయమున్. 168

కళాపూర్ణోదయమునందు:—

చ. అది శతతాళదఘ్న మనుసార్థకనామముతోడ నుత్తమ
ప్రాపములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందునఁ బడ్డవానికిన్
బ్రదుకులె యంచు (ఆ. 4. 56) 169

వసిష్ఠరామాయణమునందు:—

చ. కదిసిన[2]నోరుపోయి మఱి కబ్బపుదొంతులసత్పదార్థముల్
గదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్
మదికి [3]నసహ్యమా శునకమార్గమునం [4]జరియించుచున్నత
త్పదకవు లెల్ల మత్కవిత తప్పులు పట్టక యూర కుండుఁడీ. (ఆ. 1. 7) 170

అంతస్థభేదంబులు:—

శబ్దానుశాసనమూలసూత్రము.

మూ. సూ:—లఘువోఽలఘువ శ్చేతి ద్వేధా సన్తస్థ న్వద న్తి శాస్త్రారః,
అన్యేఽన్యవ్యాకరణస్పష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

1 బరదేశి (అచ్చు). 2 నోరువోవుదురు; నోరువోయియోరు. 3 నసహ్యమై
4 జరియింపకున్న నత్పద; జరియింపుచున్న నత్పద.

క. అలఘులఘు నామకంబుల, నలరు నిరుదెఱంగు లగుచు నంతస్థము లీ
తెలుఁగున నయ్యెను రేఫము, యలవలు సెప్పఁబడి యుండు వ్యాకరణములన్. 171

క. ఆద్యంతాంతస్థంబులు, చోద్యం బగుపాణినీయసూత్రమువలనన్
హృద్యము లై యాగమసం, వేద్యాల్లఘ్వలఘువు లన ద్వివిధము లయ్యెన్. 172

వ. యవలు రెండువిధము లయినందునకు.

## పాణినీయసూత్రము.

సూ. హలి సర్వేషామ్.

వృ. భోభగోఅఘోఅపూర్వస్య లఘ్వలఘూచ్చారణస్య యకారస్య లోపస్స్యాద్ధలి సర్వేషాం మతేన; భోదేవాః, భోలక్ష్మీః, భోవిద్వద్బృంద, భగో నమస్తే, అఘో యాహి, దేవా నమ్యాః.

క. పలుకులఁ బ్రాకృతసూత్రము, వలనను ద్వివిధంబు లగుచు వసుమతిలోన
న్వెలయుఁ దృతీయాంతస్థము, వలమును గొంచెంబు ననఁగ వనజదళాక్షా. 173

వలమనఁగా: దొడ్డు అనుట, కొంచెమనఁగా; సన్నమనుట.

## లకారము రెండువిధము లైనందునకు వాల్మీకిసూత్రము:—

సూ. లోళః పైశాచ్యామ్.

వృ. లకారస్య ళ స్స్యాత్, ముకులస్య-ముకుళః. గలస్య-గళః. ప్రలయస్య-ప్రళయః.

క. అంతస్థంబులలోపల, వంతున కనఁగా ద్వితీయవర్ణం బీగ్రం
థాంతరమున నిరుదెఱఁగగుఁ, గంతుజనక రేఫమన ఱకారం బనఁగాన్. 174

## రేఫము ద్వివిధ మైనందుకు

మూ. సూ:—ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః.

రస్తు = రేఫమన్ననో, అత్ర = ఈ యాంధ్రశబ్దచింతామణియందు, ద్వివిధః = రెండువిధములుగా, గృహ్యతే= గ్రహింపఁబడును.

## యకార భేదంబులకు

మూ. సూ:—అద్యః క్రియాసుభూతాద్యర్థసముద్యోతితం వినా సర్వః.

సీ. ఆంధ్రోక్తిమొదల నాద్యంతస్థ ముండదు ప్రాణ మై యది గనుపట్టుఁ గాని
స్వభుగులనడుమను గడను యా కెందును దలకట్టు దక్క నెత్వంబు లేదు
యాను భూతాదిక్రియాద్యోతితములఁ బొసఁగుచునెత్త్వము దలకట్టు గాదు
తలకట్టు వక్రము ల్గాల్చునీ రెండును నలఘుయకారంబు లనఁగఁ బరఁగు

తే. నిప్పు డీవంకఁ గనుఁగొంటి నింతలోన, నెచ్చటికి నేఁగె ననఁగ నాద్యచ్చు లయ్యెఁ
గయ్యు నైనను గానిమ్ము గాయకమునఁ, గాయ వలె శౌరి ననఁ దలకట్టు లయ్యె.
సీ. ఎక్కడఁ గనఁబడిరొ యెపుఁ జక్రి చెలులార యింక నెవ్వరు చనిరొయెదరు వెదుక
నీవేళ నెటకుఁ బోరొయెద వన్న మిన్నక యేఁగె న న్నేమనిరొయెదరు మీరు
హేమాంగదము లిడిరొయెదఁ జెప్పరే వాని నేరీతిఁ బొడఁగనిరొయెదము మనము
హితము దలంపఁ డాయెను నన్నుఁ గని నగియెను సవతుల కిది హేతువయ్యె
తే. ననుచు నిట్లు భూతాదిక్రియాపదాంత,ముల విశేషణభావిక్రియలను దక్క
మొదలియంతస్థమున కేక్వములు త్రిలింగ, దేశభాషను బుట్టవు దిలిజభేది. 176

ఆదియకారంబునకు నుద్యోగపర్వమునందు:—

తే. కొంచెమైనను దగఁ బంచికొడుప మేలు,పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకునైన, నిచ్చుటయె లెస్స యడిగినయెడ నృపాల.
(ఆ. 2. 47)

మధ్యయకారమునకు రుక్మాంగదచరిత్రమునందు:—

మ. ధననాథప్రియకంఠకాళిమము మోదం బొప్ప వీక్షించి చ
య్యన జంబూఫల మంచు డాసి నిజహస్తాగ్రంబు వే సాఁచి యే
పునఁ బల్లాయిను బట్టి రాఁ దిగుచు వేల్పుంబ్రోడ విఘ్నేశ్వరుం
డను మోదంబునఁ జేయుం మత్కృతికి నత్యంతంబు నిర్విఘ్నమున్. (ఆ. 1. 8.)

విజయవిలాసమునందు:—

మ. అనిన న్నీ మదిలోఁ దలంచునది మే లౌ సిద్ధసంకల్పు లీ
రని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి యా
యన రా ర మ్మని గారవించి సుముఖుం డై రాజు గారి ప్పు డే
మసినా రయ్యెవి వార్త లంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. (ఆ. 2. 4.)
వ. భూతాదిక్రియార్థంబులు దెలుపని కడపటి యకారమునకు. 180

విరాటపర్వమునందు:—

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతరసీమఁ జొచ్చి [1]దరియం జని యారసి నెజ్జఁ గాంచి య
త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁచఁగాన్. (ఆ. 2. 331.)

1 కడియన్ (ప.)

చమత్కారమంజరియందు:—

మ. ధరలోనన్ ద్విజరాజనామమున సత్సంగంబున న్సత్కళా
నిరతి న్మించియు నుత్పలప్రియుఁ డన న్నిత్యంబు రాజీవసం
హరణం బే కరజాలముల్ సొనిపి [1]చేయంబూను నీచంద్రుఁ డో
తరుణీ వీనికి నెంత చేసిన దయాదాక్షిణ్యముల్ గల్గునే. 182

క్రియాపదాంతయకారమునకు శృంగారనైషధమున:—

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసనుతేరికి వారువంబ నై
నడచుచు నుర్విలో నిషధనాథున కెవ్వతె యొక్కొ భార్య య
య్యెడు మని చక్రఘోషమున నించుక యించుక గాని యంత యే
ర్పడ విన నైతి నీ వనుచుఁ బల్కినచందము దోఁచె మానినీ. (ఆ. 2. 58.) 183

తే. ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను, గలయకారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజురామన వానిమాఁటిని బద,మధ్యయా లని చెప్పె నిమ్మాట మిథ్య. 184

తే. ఊఁచు నెలకా కగుటచేత నుయ్యె లయ్యెఁ
బయిని యెద కున్కి వక్రోక్తిఁ బయ్యె దయ్యెఁ
దల్లి కాపునకై కట్టఁ [2]దగిన యెత్తు
తేలఁ బల్కఁగఁ దాయెతు దేశ్యమునను. 185

వ. హేలాశబ్దమునకుఁ దద్భవము ఏల. అది కుఱుచ కాకుచేయఁగా హ్రస్వముగాఁ బలికిన ఎల అయినది. ఊఁచెడి ఎల గనుక ఉయ్యెల. హృదయశబ్దమునకు తద్భవము ఎద ఆయెను. [3]దానికి పై నుండెడిది గనుక వక్రసమాసమున పయ్యెద యాయెను. ఎత్తులనఁగా దక్షిణదేశీయమున దండలకు పేరు. దానిజడ్డు తేలఁబలికిన ఎతులాయెను. తాయి యనఁగా తల్లి, ఆతాయి శిశువులకు శరీరరక్షగా కట్టునది యెతులు గనుక తాయెతులు. అటుగనుక శబ్దాదినున్న అచ్చులుగాని హల్లులు గావు. సంధిచేతను లఘుయకారము లైనవి. ఇవి మూఁడును ప్రత్యేకపదములు గాని యేకపదములు గావు. వీనిని తెలియక ముద్దరాజు రామన కవిలోకసంజీవనిలోను చెప్పికొనిన పద్యము. 186

తే. "తాయెతులు నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్యయకారమునకుఁ
దుదిని గ్రియఁ దక్క నెత్వంబు గదియ దాది
నత్వ మొందదు తెనుఁగున నబ్జనాథ. 187

---

1. సేయం (పూ. ము.); నేయం (ప). 2 దగినసరులు (పూ. ము.) 3 దానికి చేటినసుం......సమ పయ్యెద (పాఠాంతరము).

**ఉయ్యెలకు** నరణ్యపర్వమునందు:—

చ. కలి దమయంతిఁ బాప సమకట్టి పొరింబొరిఁ బాయ నోపఁ డా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టులు రెంటియందు న
న్నలుఁడు వివాహరజ్జులు పెనంగ గతాగతకారియై దయ్యె ను
య్యెలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు విధిశ్చితాత్ముఁడై. (ఆ. 2.78)

**పయ్యెదకు** యయాతిచరిత్రమునందు:—

సీ. వలఁ బడ్డజక్కవల్ వలె నున్న జిలుగుపయ్యెదలోనిగుబ్బపాలిండ్లు మెఱయ. 189

**తాయెతులకుఁ** జంద్రభానుచరిత్రమునందు:—

సీ. పా. ఒకయింతి యొరఁగినసికమీఁదముడిపువ్వు బెత్తులఁ[1]దోరయం తాయెతులు చుట్టి."

లఘుయకారమునకు

**మూ. సూ:—**య శ్శ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః
పరం ప్రాణమ్.

తే. తొలిపదము తుదివర్ణంబుతోడఁ బమకు, సంధి లేనిపదాదిగస్వరము లెల్ల
లఘుయకారంబులై భూతలమున వెలయుఁ, దేవకీపుత్ర జాంబవతీకళత్ర. 191

క. సురనది యాత్మజ కాకో, దరపతి యాసనము మరుఁడు తనయుఁడు రతిసుం
దరి యన్న నసుఁగుఁగోడలు,, సిరి [2]యంగన యబ్ధి యిరవు శ్రీహరి కెపుడున్. 192

రేఫభేదంబులు

తే. రేఫము ఱకారమును నన రెండుదెఱఁగు, లగుచు వికృతిపదంబుల నమరియుండు
వాని సంస్కారపూర్వకావ్యప్రయోగ, సరణుల నెఱుంగవలయు సజ్జనవిధేయ. 193

వ. సంస్కార మనఁగా లక్షణవంత మనుట. ఇందులోపల నే భాషాపరిచ్ఛేదమునందుఁ
జెప్పఁబడియున్నది.

తే. ప్రకృతి శబ్దానుశాసనోభయకవిసఖు, శంభుసేవకసోమభాస్కరులచేత
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లి, కరివరద రేఫములును ఱకారములును. 195

రేఫాక్షరసీసమాలిక

శ్రీకామెపల్లిపురీగోపికాజార యసురసంహార నీ కంకితముగ
నాదికవీంద్రకావ్యము లెల్ల శోధించి క్రమత హ్రస్వములు దీర్ఘములు నైన

1 చోరయం (ప). 2 యబ్ధియం వాలుఁ బరపు (పూ. ము).

యచ్చులమీఁదను హల్లులమీఁదను గలుగు రేఫఱకారములు వచింతుఁ
దాళ్లపాకాన్వయోదధిపూర్ణధవళదీధితి [1]పెద్దతిరుమలదేశికుండు
మొదలైనవారలు మును రచించినయవి యెల్లఁ జాలవా యనఁగ వలదు
వెండియు నొకకొన్ని వెదకి కూర్చితిఁ గవిరాజులు మే లని ప్రస్తుతింప
నిక్కి వెఱ్ఱియు నని యిట్టు క్రిందను జడ్డ లుండెడు లిపు లెల్ల బండిఱాలు
వీనిద్విత్వము లోకవేళఁ బోయినఁ బోవు జెఱిపోఁతు కఱిమేఁక గొఱియ యనఁగఁ
జనిరి కాంచితిరి చేకొనియెద రనియెడునవి మొదలైన క్రియాపదముల
తుదలను సంస్కృతపదములందును దద్భవములయందును ఱకారములు లేవు
క్రచ్చఱ బ్రతుకుట గ్రాలుట మొదలగు క్రారము రేఫవర్ణములై యగును
జేకూఱె ననుటకుఁ జేకుఱె నని యిట్లు పొడుగు లెల్లను హ్రస్వములుగఁ జేసి
పలికెడువేళ రేఫములును ఱాలును మునుపటియట్లనే తనరుచుండు
రా దక్కు సకలాక్షరములమీఁదను గ్రార కదియ నకారక్షకారము లన
నట రవర్ణమున కొక్కటికిని బైని నిఘ యని నిల్చుటను రేఫ మనఁగ బరఁగె
నరదంబు సేనాంగ మరుగుట పోవుట యరి కప్పు మర నగ మరుదు వింత
యరయుట వెదకుట యిరవొందు టమరుట యిరుపదంబు యుంగార్థ మిరవు నెళవు
కలనఁ బెట్టురుముట గద్దిక సేయుట యుంరణించు టురు [2]లొడ్డు టురులఁ ద్రోయుఁ
టురుపడించుట[3]పీఁక నొత్తుట యుఱుపడి యుఱియాడుటయుఁ డేఁద మురియఁ జేయుఁ
టెరగలి చిచ్చు మేఁకెరు వెరమానుట యెర గాఁగ భోజనం బిడి యెరియుట
యొరు లొండొరులసొమ్ము లొరయుట [4]యొరిమె కేకరివాఁడిదూఁపులు కరిసెముక్కృషి
కరువలి పుత్తడి కరఁగి యాకరణిని గరుగునఁ బోసి యొక్కరుండు చేసెఁ
గరవాలు ముక్కర కరకరల్ కరకరి కరిగోరుటలు కనికరము వాన
గురియుట తోలుకరి కోరఁ బ్రాణములు కరకరఁ గ్రాలి కరమొప్పఁ గెరలి పడుట
గరిత బంగరు మేను గరు దాల్చెఁ గరిచేడి గరిగె చేఁబట్టుట గరువతనము
గిరిగిర ద్రాయ వేగిరపడి జేగురుకొండపై గురువోతు గురుసు పట్టి
గురువులు బారుచు గురువుగా గురుగాకు గురుగులఁ బెట్టి ముగ్గురును వండి
చెరుచుటయును మరి చెచ్చెర చేటను జెరుగుట చెరువులోఁ జొరువఁ జేసి
చొరక యచ్చెరువుగా చిరుగనికోకల చెరఁగులు చించుట చెరగు మనుట
తరచి యాడుటయుఁ జిత్తరుబొమ్మ తరఁగలు తరిచినమజ్జిగ సరము బడిత
తరము శక్యము మూఁడుతరములచుట్టంబు తరలఁ బారుట తరతర దిరుగుట
తెరిసినకూడు మార్తురమేనినెత్తురు తెరలఁ గాఁగిననెయ్యి తెరవు తోడు

1 పేఁటి(ప); కేద(ఖ్రూ. ము.) 2 లొగ్గ (క.). 3 పీగ (ప). 4 యొరిమి(వా.).

తెర తెర వచ్చుట తెరలు గట్టుట రెండు* తెరఁగులవారిలో దొరలుకొనుట
తొరితొరి చెమ్మట దొరగుట బెదరుట దరిద్రొక్కి జూవరి వరికొలుపుట
దురము సేయుట దురదురఁ బోయి కుదురుట దొరయుట సరియాట దొరకొనుటయు
దొర రాజు దొరకోలు దొరసుట బొసఁగుట నర [1]వెండ్రుకలు పెద్దనరము నురుగు
నెరయఁగాఁ జల్లుట నెరసులు పరుసంబు పరువులు పెట్టుట పరపు నిడుపు
పరిచను దెంచుట పరిగొని పరిపరి పరపుట నించుట పరువడి యనఁ
బరిమారుచుట పెనుపరి నేరుపరి దొడ్డపరి చప్పరంబు దెప్పరము పరగఁ
బరికింప పరసు పొంపిరి పోవఁ బిరిగొని పురపురఁ బొక్కుట పురిటితగవు
పురుడీడు పురికొలుపుట తుట్టెపురుగులు పెరుగుట నిక్కుట పెరుఁగు పెరడు
పెర తేనె పొరిపొరి పొరుగునఁ బొరిగొని పొరిగడుగుట పొరపొచ్చెము పొర
పొరలుట చీపురు పొరకలు బరికటె బరుజులు గజ్జెలు బరవసంబు
బరు లుబ్బఁగా సానవాలు ద్రావుట బరిమేను గంధపుచెక్కమీఁదిబరడు
బిరుడు లబ్బురము గొబ్బెరకాయ పెరయుట బురబురఁ బొంగుట †బురుదనేల
మరులు మోహము బుద్ధి మరపుట తామర మరియాద క్రమ్మర మరలి చనుట
మిరియంబు మిరిపెంబు మురియలు తునియలు మురమురలాడుట మెరమెరయును
మొరపనేలయుఁ దేంట్లు మొరయుట మొరడును ర మ్మని పిలుచుట రచ్చ రంగు
రంకెలు రజ్జులు రమణ రక్కసి రహి రిచ్చలు రిత్తయు రెట్ట రెండు
దేవర వివరంబు తెరువరి తలవరి యెవ్వరు నివ్వరు నవ్వ రనఁగ
వరిచేను వరుజులు వరు(ర)సయుం వరుపును నోవరి విరవిరఁ బోవు టనఁగ
విరిసినవిరు లెల్ల విరియఁ జల్లుట కాలువురు పలువురు నలువురు పదువురు
వెరువరి [2]వెరువాక వెరుసు దూసరివద్దు సరకు లమ్ముట సరి సరకు కొనమి
సిరికి నై సురియల సురుగుట సిరిబడి [3]సారిది మోహారములు హరువు గనుట
మొదలుగా నొక కొన్నిపదముల హ్రస్వాక్షరములపై రేఫంబు లమరియుండు
[4]నారెకు త్తలవరు లారాట మారటం బారఁ గూరినశోక మారఁ గాఁగి
నట్టిపా లారనియనల మారఁగ ధర్మ మారసెఁ దనకన్నులారఁ జూచె
శ్రమ మారెఁ బొంగారెఁ జల్లారెఁ దనరారె సిరికె లెత్తుట యిగురు వెట్టు
టీరేడు జగము లీరెలుఁగు హీనస్వర మీ రన నిమ్ము పేరూరు పల్లె

---

1 వెంట్రుకలు (ప. వా). 2 వెరువార (ప. వా). 3 సారథి (ప. వా). కాని శ. ర. లో సారిది అనియే కాని సారది అనిలేదు. 4 అరిడు.

* శ. ర. లో, తెఱఁగు అనియేకాని తెరఁగు అనిలేదు.

† శ. ర. లో, బురద అనియేకాని బురుద అనిలేదు.

యూఱార్చు టూఱట యూఱక కుఱుచుట దొంగ ఱేకి యనుట యిది యోఱి కనుట
యోఱోఱి యనుమాట కోఱుచుకొనుటయును నోఱ వాఁయునగోనె లోఱసిలుట
*కాఱులు కల్లలు కాఱుమెఱుఁగులు పసుకాఱు ముక్కాఱుపంట ఱిపులు
కాఱు కాఱించుట కడు నొప్పి పెట్టుట కాఱాకు కాఱాట కాఱియంబు
కూఱుట కొఱలుట కూఱుకు నిద్ర చేకూఱుట కూఱిమి కూఱ దినుట
ఱొమ్ములు గూఱగా నేఱుట గాఱంబు గూఱుట దానికిఁ గూఱుతు ననఁ
గోఱికె గోఱుట కోఱప్పనము పంది కోఱాడె కోఱడి కోఱ గిన్నె
గాఱెలు భక్ష్యముల్ గాఱాము బంగారు గోఱు గాఱాబంబు గారవంబు
చీఱికిఁ గొన కైదుచీఱలు చేఱుట చేఱువ చెంతలఁ జేఱఁ దనఁగఁ
జీఱుట పిలుచుట చూఱనఁగాఁ బొడి చేసి ద్రావుట చూఱి చిన్ని కత్తి
తా ఱెల్ల నేఱిరి తీఱనికిఱుకతోఁ దూఱుపుఱాటికిఁ దేఱు తెక్కి
తేఱెవ మనుచు నేతేఱ తేఱకు తేఱ తేఱో సొమ్ములు తోఱముగను
దూఱులు పలుకుట నాఱచీఱలు వింటినాఱి విహ్నారు కహ్నార మనఁగ
నీఱు ద్రావుట పాఱ నీఱయి పోఱ్పుట నేఱుపునేఱేడు నోఱు వడుట
పూఱేడు జగడంబు పేఱుట పేరాఖ్య పేఱిన నేతులు పేఱురంబు
పోఱామి పోఱచి పోఱోఱి యనుటయు పోఱుట పోఱాట పోఱితంబు
బాఱు గట్టుట దైత్య బాఱికిఁ దప్పుట బాఱెడు బీఱంబు బూఱటిలుట
బూఱుగుచెట్టులోఁ బూఱగ యూఁదుట బూఱెలు బేఱంబు బేఱజంబు
బోఱని మ్రోయుట బోఱుఁగొండ లనంగ బోఱలు క్రిందుగా బోఱగిలుట
మాఱట మూర్తి యై మాఱిమసంగుట మాఱేడు వేమాఱు మాఱుతు రన
మీఱలు మేఱలు మోఱతోపు లనంగ ఱాయంచ ఱాచూలి ఱాయడి పడి
ఱాణ ఱాణించుట ఱాయలు ఱాణువ ఱాపాడి ఱాముల్కి ఱాసు ఱావి
ఱాచుట ఱాఁజుట ఱాయుట ఱాలుట ఱాగిల్లుటయును ఱాఱా యనుటయు
ఱాము పొమ్మనుటయు ఱారాపు వలదు పోఱా వినుఱా యేలఱా చలంబు
ఱీతి గాదనక నీఱీతి ఱూపించుట ఱూపుట ఱూపఱి ఱూపు ఱూక
ఱేయి గేదంగిపూఱేకులు ఱేయెండ ఱోఁజు ఱోఁకలి ఱోలు ఱోవెలంది
ఘనులార బాలుఱు కాలారి జాలారి లేఱు కోలారి తలారి [1]కాండ్లు
వాఱువ మశ్వంబు వాఱనికోపంబు వాఱించుకొనుటయు వాఱకులును
వాఱక వాఱ లెవ్వారును దెలియనివారు గా ఱిది యెల్ల వాఱకంబు

* శ. ర. లో శకటరేఫమే కాని లఘురేఫము లేదు.

1 కాండ్రు (పూ. ము); కాండ్లు (ప).

వీరలసాటి లే రీరాజ్యమున నన సారెల జూదంబు సారెసారె
సైరణ లేక వేసారుట సూరెలు సోరణగండ్లును సేరుపసపు
తే. సౌరు సౌరంబు నోడజేరి వింత, వారి యచునిట నాదిగా నొక్కకొన్ని
తెలుఁగుపలుకులఁగోవల దీర్ఘలిఖుల, పైనిఁ దనరారుచుండు రేఫములు కృతుల.

## హ్రస్వాక్షరములమీఁది రేఫములకు రూపములు

అరదము = సేనాంగము
అరుగుట = పోవుట
అరి యనఁగాః దనకంటె దొడ్డరాజునకుఁ బెట్టెడుపన్ను.
అర=అనఁగా సగము. దీనికి లక్ష్యము:—
అరగంటఁజూచుట = సగము కంటఁజూచుట, అరవాయి = సగమునోరు, అరగొఱఁత=సగముతక్కువ. ఇవి మొదలైనవి.
అరుదు = వింత
అరయుట = వెదకుట
ఇర వొందుట = అమరుట
ఇరు=అనఁగా రెండు. దీనికి లక్ష్యములు:—
ఇరువాగు,
ఇరువంక,
ఇరువురు = ఇద్దఱు,
ఇరువాయి = రెండునోరులు.
ఇరుగేలు = రెండుచేతులు.
ఇరుమేను, ఇవిమొదలయినవి:
ఇరవు = నెళవు.
ఉరుముట = జగడమునగద్దించుట
ఉరణించుట
ఉరు లొడ్డుట = వేఁటకానిపని
ఉరులఁద్రోయుట = కోటలు మొదలయినవి పడఁగొట్టుట,

ఉరవడించుట = వీకనొత్తుట
ఉరువడి = బిగ్గర
ఉరియాడుట = డొంద మురియఁ జేయుట
ఎరగలి = చిచ్చు
మేఁకెరువు = మేఁకపెంట్రికలు
ఎరమానుట = [1]ఎరపరికరము విడుచుట, ఎరగా నాహారముఁబెట్టుట.
ఎరియుట
ఒరులు = అన్యులు
ఒండొరులు = ఒకరొకరు
సొమ్ములొరయుట = ఒరగంటను వ్రాయుట
ఒకరిమె = కలిపికోలుతనము, ఒరిమి యనియుం గలదు
కేకరి = వాఁడితూఁపులు
కరిసెము = కృషి
కరువలి = గాలి
పుత్తడి కరఁగుట = కంసాలవానిపని
ఈకరణిని = ఈరీతిని
కరుఁగునఁబోయుట = పోఁతఁబోయుట
ఒక్కరుఁడు
కరవాలు = ఖడ్గము
ముక్కెర = ముత్తెము
కరకరలు
కరకరి
కరిగొరుట

కనికరము = వాడి
వాన గురియుట
తొలకరివానలు
కొరఁబ్రాణము
కరకరఁగ్రాలుట
కరమొప్పుట=మిక్కిలి రెమొప్పుట
కెరలుట
గరిత = పతివ్రత
బంగరు = పైఁడి
మేను గరు దాల్చుట=గగురుపొడుచుట
గరిచేడిగరిగె = పెండ్లి వేళ చేతఁ బట్టుకొనియుండెడుయుంతగరువతనము
=పరకు సేయక పోవుట
గిరగిర వ్రాయుట
వేగిరపడుట
జేగురుకొండ
గురుపోతు
గురుసులవరపు గురుసులు
గురువులు బారుట=గమనవిశేషము
గురువుగాను = దొడ్డగానను
గురుగాకు = గురుగుకూర
గురుగులు = పిడతలు
ముగ్గురు
చెరుచుట
చెచ్చెర

1 విపరీకము విడుచుట (వా).

చేటను చెరుగుట
చెరువు=తటాకము
చొర(రు)వఁ జేసికొనుట
చొరక=చొరకపోవుట
అచ్చెరువు
చిరుగనికోక
చెరఁగులు=అంచులు
చెరగుమనుట
తరచియాడుట
చిత్తరువు=బొమ్మ
తరఁగలు=కరళ్లు
తరచినమజ్జిగ
తరము=బడిత
తరము గాదు అనఁగా-శక్యముగాదనుట
మూఁడుతరములచుట్టము
దేహము తరలఁ బారుట
తరతర
తిరుగుట=సంచరించుట
తిరిసినకూడు
మార్తురు=పగవాఁడు
మేనినెత్తురు
తెరలఁ గాఁగిననేయి
తెరువు తోడు
తెరతెర వచ్చుట
తెరలు గట్టుట
రెండుతెరఁగులు = రెండు తెగలు
తొరలుట = కలయుట
తొరితొరి
చెమట దొరగుట
బెదరుట చింత్యము
దరి ద్రొక్కుట
జాదరి
దరికొలుపుట [సేయుట
దురము సేయుట = జగడము

దురదురఁ బోవుట
కుదురుట
దొరయుట=సరి వచ్చుట
దొరకొనుట
దొర = రాజు
దొరకోలు
దొరసుట = పొసఁగుట
నర వెండ్రుకలు
పెద్దనరము=జీవనరము
నీటినురుగులు
నెరయఁ జల్లుట
నెరసులు
పరుసము
పరువులు వెట్టుట
పరపు నిడుపు
పరిచను పెంచుట
పరిగొనుట
పరిపరి
పరపుట = నించుట
పరువడి
పరిమారుచుట
పెనుపరి
నేరుపరి
దొడ్డపరి
చప్పరము
దెప్పరము
పరగ
పరికింపుట
పరసు
పొంపిరిఁబోవుట
పిరిగొనుట
పురపురఁ బొక్కుట
పురిటితగవు
పురుడు... కూడు
పురికొల్పుట
తుట్టెపురుగులు

పెరుగుట=నిక్కుట
ఫెరుగు
పెరడు=ఇంటివెనుక
పెర=తేనెతెట్టె
పొరిపొరి
పొరుగు
పొరిగొనుట
పొరిగడుగుట
పొరపొచ్చెము
పొర
పొరలుట
చీపురు
పొరకలు
బరిగట్టె
బరుజులు=గజ్జెలు
బరవసము
బరులు=వళులు
బరిమేను=పిసమొల
గంధపుచెక్కమీఁది బరడు తాఁట
బిరుదులు
అబ్బురము
కొబ్బరకాయ
పెరయుట
బురబురఁ బొంగుట
బురదనేల
మరులు=మోహము
బుద్ధిమరుపుట
తామర=పువ్వు
మరియాద
క్రమ్మర
మరలి చనుట
మిరియము
మురిపెము
మురియలు=తునియలు
మురములాడుట=కోపము

మదిలో మెరమెర
మెరపసేల [ట
తేంట్లు మొరయుంట=ఝూంకారము
మొరడు=మోడు
రమ్మని పిలుచుట
రచ్చ
రంగు
రంకెలు వైచుట
రజ్జులాడి
రపుణ
రక్కసి
రహి
రిచ్చపడుట
రిక్తకు రిత్త
రెట్టవడుట
రెండుచేతులు
దేవర
వివరము
తెరువరి
తలవరి=తలారి
ఎవ్వరు
దానమివ్వరు
నవ్వరు
వరిచేను
వరుజులుగట్టుట
వరుస
వరుపు = వాన లేకుంట
ఓవరి
విరవిరఁ బోవుట
విరియుంట=విప్పుట
విరులు=పువ్వులు
విరియఁ జల్లుట
కాలువురు=కాల్బలము
పలువురు
నలువురు

పదువురు
వెరవరి
పెరవాక
వెరుసులు వేయుట
దూసరివడ్లు=ధాన్యవిశేషము
కేసరులు, దినసరులు మొదలయినవన్నియు
సరకు అమ్ముట
సరి
పరకు గొనమి = పరవసేయక పోవుట
సిరి=లక్ష్మి
సురియలు=చూరుకత్తులు
సురుఁగుట=చచ్చుట
సిరిబడి
సొరిది=చాలు
పోహారము = దండునకుఁ బెద్దమోన
హారువు=ఉపాయము

ఇవి హ్రస్వాక్షరముల మీఁది రేఫములు.

దీర్ఘాక్షరములమీఁది రేఫములకురూపములు

ఆరెకులు=తలవరులు
ఆరాటము
ఆరటము [నాడినదుఃఖము
ఆరఁ గూరినశోకము = తీర
ఆరఁ గాఁగినపాలు [యగ్ని
ఆరనియనలము = శమింపని
ఆరగ ధర్మము
ఆరయుంట=పరామర్శించుట
తనకన్నులారఁ జూచుట = కన్నులనిండుగఁజూచుట

శ్రమమారుట = బడలిక దీరుట
పొంగారుట = పొంగుదీరుట
చల్లారుట = చల్లదనము నిం
తనరారుట [డుట
ఈరికలెత్తుట = ఇగురువెట్టుట
ఈరేడుజగములు
ఈరెలుఁగు=హీనస్వరము
ఈరు=ఇమ్ము
ఊరు=గ్రామము [పుట
ఊరార్చుట = దుఃఖ ముడు
ఊరకుండుట=చాలించుట
దొంగ లేరని యడుగుట
ఇది యేరికి=ఎవ్వరి కనుట
ఓరి యని పిలుచుట
ఓరుచుకొనుట
ఓర వోయినగోనెలు
ఓరసిలిపోవుట
కారులు=కల్లలు
కారుమెఱుంగులు
పటుకారు
ముక్కారుపంట
రిపులుకారు
కారించుట = నొప్పిచేయుట
కారాకులు
కారాటము=వ్యాపనము
కారియము = కర్జము
కూరుట = పొరలుట
కూరుకు = నిద్ర
చేకూరుట
కూరిమి
కూరడినుట
ఎమ్ములు గూరఁగా సేయుంట= యెముకలునాటసేయుంట
గాతము కూరుట = నాటుట

దానికిఁ గూఱుతు ననుట
కొఱికె
కొఱుట
కొఱు=అప్పుచము
పంది కొఱాముట
కొఱడి=ఆవరణముగా వేసిన
పాడిమట్టిగోడ
కొఱ=గిన్నె
గాఱెలు=భక్ష్యములు
గాఱాము
బంగాఱు
గోఱు=నఖము
గాఱాబము
గాఱవము
చీఱికిఁ గొనక
అయిదు చీఱలు=కోకలు
చేఱుట
చేఱువ=సమీపము
చేఱఁడు
చీఱుట=పిలుచుట
చూఱు=పోడి
చేఱుద్రావుట
చూఱి=కొంచెపాటికత్తి
తాఱెల్లరు=తమరందఱు
తీఱనికినుక=శమింపనికోపము
తూఱుపువాఁడు
తేఱులు=రథములు
తేఱెదము అనుట
ఏతేఱెవ వచ్చితేని అనుట
తేఱకు తేఱ, తేతేఱ యని
యుం గలదు [యనుట
తేఱొఱి = సొమ్ములు తేఱొఱి
తొఱము
దూఱులుపలుకుట
నాఱచీఱలు

పింటివాఱి
విన్నాఱప
కన్నాఱము
నీఱు ద్రావుట [ట
పొఱ నీఱయి పోవుట=చచ్చు
నేఱుపు
నేఱేడు-చెట్టు
నొఱువకుట
పూఱేడు పిట్ట
జగడము పేఱుట
పేఱు=నామము
పేఱిన నేతులు
పేఱురము = పెద్ద ఱొమ్ము,
పేఱాముదపు గింజలు
మొదలయినవి
పొఱామి
పొఱచి=కూఱ [ట
పొఱొఱి=పొఱా చోఱి యను
పొఱు
పొఱాటము
పొఱితము
బాఱు కట్టుట
దైత్యు బాఱికిఁ దప్పుట
బాఱెస
బీఱము
బూఱటిలుట
బూఱుగచెట్టు
పెద్దబూఱుగ యూఁదుట
బూఱెలు=పిండివంటలు
ఓడబేఱము
బేఱజము
బొఱని మ్రోయుట
బొఱుగొండెలు [లుట
బొఱలు=క్రిందుగాను బొఱగి
మాఱట=మాత్తి

మాఱి మసంగుట
మాఱేడు
వేమాఱు
మాఱుట (?)
మాఱుతుఱు=పగవారు
మీఱలు=మీఱును
మేఱలు
మొఱత్రొప్పు
ఱాయంచ
ఱాచూలి
ఱాయడిపడి
ఱాణ
ఱాణించుట
ఱాయలు
ఱాజువ
ఱాపాడి=ఱాచినపోడి
ఱాముల్కపండు
ఱాను=యథార్థము
ఱావిచెట్టు
ఱాచుట
ఱాఁజుట
ఱాయుట
ఱాలుట
ఱాగిల్లుట
ఱాఱా యని పిలుచుట
ఱాము భా మ్మనుట
ఱాఱాపు
వలనుపొఱా
వినుఱా
ఏలఱా చలము
ఱీతి గాదు=నడితి గాదు
ఈఱీతి
ఱూపించుట
ఱూపుట=ఒకరిని తెలుపుట
ఱూపరి

| | | |
|---|---|---|
| రూపు చెడుట | జాలారి | వారకము |
| బంగారురూక | తేరు | వీరలసాటి లేసు |
| రేయి=రాత్రి | కోలారివాడు | సారెలజూదము |
| రేవంగిపూరేకులు | తలారి కాఁడు | సారెసారె |
| రేయెండ=వెన్నెల | వారువము=గుఱ్ఱము | స్సైరణ లేక |
| రోఁజు పుట్టుట | వారవికోపము=శమింపని కోపము | వేసారుట |
| రోఁకలి | వారించుకొనుట | సూరెలు |
| రోలు | వారకలు | సోరణగండ్లు |
| రోవెలఁది=లంజ | వారక | సేరుసుసు |
| ఘనులార-సంబోధనము | వారలు | సౌరు |
| బాలురు-ప్రథమాబహువచనము | ఎవ్వారు | సౌరంబు |
| కొలారి | తెలియనివారుగారు | ఓడ చేసారి |
| | | వింతహోరలు |

ఇవి దీర్ఘాక్షరములమీఁది రేఫములు

## అకార సీసమాలిక:—

అఱవఱ లనఁ దునియలు నోట నఱచుట యఱిముఱి యఱగొఱ లఱను టబ్బ [1]టఱకటఁ బెట్టుట యఱచేత నఱకాల నఱవలు ద్రావిడు లఱవు డఱిసె లఱిగిపోవుట కొంచె మగు టఱమఱ నేయుం టఱ లేక చను టఱు గఱపుకొనుట అఱువది కో ట్లఱపాఁకుడు గు జ్జుక్కుఱి రూపఱి పొలుపఱి యేపఱచుట పెంపఱి సిగ్గఱి బిట్టఱి పెల్లఱి యఱుఱుల్లు క్రచ్చఱ యక్కఱపడి [2]యఱకమ్మట మఱంటు లఱ టఱకం బిఱిసెయుంట కదియుంట ఱుఱియుంటయును నని నిఱులు చీఁకటి బండిఱుఱుసు క్రిక్కిఱిసియుంట ఱుఱుకటం బిఱుకన్నమిఱిసిచెడుట యుంఱఁడు గైకొనఁ డేరి నుఱుకుట వే చను టుఱుకుదం బెట్టెడ నురుతరార్థ ముఱు వన్నలా వఱు టఱివి బెట్టిద మయ్యె నఱక మానక మొగు లొడ్డి యుంఱిమె నుఱుకఱి బలముఱి యుంఱియ ని ల్లుఱియుంట యుంఱనిరోషంబున నుఱుతపట్టి యెఱపఱికంబున నెఱగుట మ్రొక్కుట యెఱుపు కెం పెఱుకువాఁ డెఱికెఁజెప్పు టెఱకలు నా టెక్కు లెఱుఁగుట తెలియుంట యెఱవుసొమ్ముకరిది యెఱచి మాంస

1 టఱకట పొదుగుట (వ); టఱకడఁ బెట్టుట (వా). శ. ర. లో అఱకడ అనియేకాని అఱకట యనిలేదు. 2 అఱకమ్ము టమఱటులఱకువ యుఱిసియుంట కదియుంట యుఱియుంట కలసుట్టుయుంను.(వ).

మొఱలుట విలపించు టొఱవ నేహం బొఱగాల నుండుట యొఱ కత్తిమూఁత
యొఱకటంబునఁ బోవు టొఱపులు నాఁ డెక్కు[1]లొఱగుబిళ్ల తలాడ యొఱగువంక
కఱపుట నేర్పుట కఱతలు ప్రోక్కిళ్లు కఱదలు బుద్ధులు కఱటి మంకు
కఱకు కాఠిన్యంబు కఱవు దుర్భిక్షంబు కఱ కప్పు మెకములఁ గఱచుఁ గుక్క
కిఱపుట కెఱయును క్కెఱయుంబ క్కెఱయును గురుమాప్రకుఱుగండ్లకుఱుచకుఱులు
కుఱువలిగొనుటయుఁ గుఱుకుఱ కుఱుకలు కుఱుగొని కుఱుఁగడ కుఱుపు వ్రణము
కొఱకొఱలాడుట కొఱఁత తక్కువ పండ్లు గొఱకుట కోపంబు కొఱడు వడుట
కొఱ యనఁగాఁ బని కొఱలుట నిండుట కొఱవిఁ జూఁడుట సొమ్ముకొఱకు ననుట
గఱికె నట్టలు గఱగఱికెలు గఱుగులు గఱిసె దగ్గఱ నంపగఱి పగఱలు
గిఱిగొనుటయు మోటగిఱుకయు గిఱుమెట్టు గిఱులు వ్రాయుటయును గీఱుటయును
గుఱుక వెట్టుట గుఱుగుఱ గుఱ వెట్టుట గుఱకొని గుఱి గుఱుకొండి గుఱుతు
గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు గొఱవంక పిట్టల్లు గొఱక కట్టె
వా చఱచుట గొడవలి కాఁచి చఱచుట కరమునఁ జఱచుట గట్టుచఱులు
చిచ్చఱపిడుగుల్లు చిఱుతయుఁ జిఱునవ్వు చిఱికొట్టి చిఱిమి మచ్చిఱితనమునఁ
జుఱుకు పుట్టఁగ మేను చుఱచుఱః గాల్చుట చెఱువున భుజియించి చెఱక బట్టు
చెఱలాట చెఱుచుట చెఱుమూట చెఱుగుట చెఱసాల చెఱుకులు చెఱిసగంబు
జఱిజత్తి ఘూజఱి జాజఱి జఱిగొని [2]జఱపుట జఱజఱ జఱిగె ననుట
చేతులు వెజఱుట జిఱజిఱఁ ద్రిప్పుట జుంజుఱువెంట్రుకల్ జొఱజొఱ యనఁ
దఱుగుట తెలితియుఁ దక్కువయును గోసి వైచుటయును నగు వలసినపుడు
తుఱుగలి బేహారి తఱుగనిసంపద తఱిగొలుపుటలు ముత్తెఱులు తఱుచు
తఱి వేళ పయనంబు దఱలుట పుచ్చినతఱకలు శత్రుల దఱియఁ జొచ్చెఁ
దఱుముక వచ్చుట తఱిగొని నడచుట తిఱుగ రెండవసారి తిఱిఁబెనుచుట
తిఱుగలి తుఱుము వాతెఱ మోవి యేడ్తెఱ తెఱలినవాసన తెఱుగొలుపుట
తెఱపి నేయుట కన్ను దెఱచుట పాపుట తెఱవలు తెఱకువ తెఱఁగు విధము
తొఱలుట కలయుట తొఱకుట మందఱ నందఱు నెందఱు కొంద ఱింద
ఱిద్దఱు పదఱుచుఁ బెద్దఱికంబున గద్దఱి యద్దిరా కట్టెదుఱను
నఱుజు కొంచెము మ్రాను నఱుకుట నిఱుపేద నుఱుముఁగా నుఱుపుట నెఱవు పాడవు
నెఱి యనఁగా బాగు నెఱదొడ్డు గొప్పయుం నగు నెఱి యనఁగను మిగుల ననుట
[3]నిటుల నెఱపుట నెఱి లేనిమిత్రుఁడు నెఱసుట నిండుట నెఱిక కానె
నెఱఁకు లాయంబులు నెఱులు కేశంబులు పఱపఱః జించుట పఱుసదనము

1 క-ర. ఒరగుబిల్ల (రూ). 2 క-ర. జరపుట. 3 నిటులని (వ).

పఱచుట సేయుట ప్రవహించుటయుం వేగ ముఱుకుటయును నగు సుచితభంగిఁ
బఱికెలు పఱియలు పఱివోవు టంపఱ పఱతెంచి పఱిగొని పఱిపఱియలు
పఱు వైనపువ్వు చూపఱఁ బఱిమార్చుట తెంపఱ పెంపఱఁ దెప్పిఱిలుట
పిఱుఁదము వెనుకను బిఱుఁదు నితంబంబు పిఱుసనుటయుం దొడ్డపిఱికితనము
పుఱియ కపాలంబు పెఱికెలు గోనెలు పెఱిగిచమీసముల్ పెఱుకుకొనుట
పెఱ యితరార్థంబు పెఱుసనిపోవుట బఱబఱ సీడ్చి దబ్బఱ పలుకుట
బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు బుఱుజులు మఱవ మృద్భాండంబు మఱుఁగు చాటు
మఱచుట మఱునాఁడు మఱఁదలు మఱఁదియుం మఱియుం నేమఱుటపల్కు లుమఱుగుట
మఱుపడి క్రమ్మఱ మఱు లేక క్రమ్మఱి పడమఱ మఱఁగాలు పెడమఱలుట
మిఱిచూపు మిఱుమిట్లు ముఱిపెఱి చీఁకటిపెఱి మొండె మఱిముఱి మెఱములిడుట
[1]మెఱుపులు మెఱుసుట మెఱుఁగు లీనుట కను మొఱఁగుట దాఁగుట మొఱక వెలితి
మొఱలు పెట్టుట మొఱ మొఱలుగా మొఱయుట మొఱగుడుతుక్కలు మొఱకుతనము
ఱట్టు ఱంపిల్లుట ఱవ ఱంకు ఱవికెలు ఱవఱవల్ ఱంపము ఱంతు ఱవళి
ఱెక్కలు వైచుట ఱివ్వున ఱువ్వుట ఱెక్క ఱెప్పలు ఱెల్లు [2]ఱెమ్మ ఱొమ్ము
[3]వఱతయుం వఱదయు వఱదు గూయుట వంగవఱుగులు వఱలుట విఱిగిచనుట
విఱివోవు విఱిగాలి విఱివిడి కంబము విఱుగుట వెఱబొమ్మ వెఱచఱచట
వెఱచుట వెఱఁగు నివ్వెఱ సుఱ స్రుక్కుట యను ఱను ఱను టెం యాది గాఁగఁ
గొన్ని తెనుంగుఁబల్కుల హ్రస్వములమీఁదఁ దప్పక బండిఱా లొప్పుచుండు
వెల్లంకితాతన బొల్లెను బండిఱా నిడుదపైఁ గలుగదు నిక్క మనుచుఁ
గావున నేను దీర్ఘములపైఁ గలపెద్దఱా లొక్కకొన్ని యేర్పఱతు నింక
నాఱు సంఖ్యాపద మాఱడి యాఱికెపంట చిచ్చాఱెఁ బాపంబు లాఱె
నాఱని తేజ మూటాఱినముత్తెంబు తడియాఱె శ్రమ మాఱెఁ దాప మాఱె
నాఱపు లాడె నూటాఱె దేహం బెల్ల నూఱడి చాలించు టూఱుగాయ
లుదకంబు లూఱుట యోఁక పఠ్ఠేఱుట యేఱువసీములో నేఱు దాఁటి
కాఱుపోతులు పొంతకాఱి కాఱడవులు కాఱియఁ బెట్టుట గాసిలుటయుఁ
గాఱుట జాఱుట కోఱలు పండ్లు గీఱుట నాఱుటయును దీఱుటయుం నయ్యెఁ
జేఱెడు మాడలు చీఱుట రెండుగాఁ జేయుట యయ్యేల చేఱు లనఁగఁ
జాఱ యెల్లరిని దోఁచుట చోఱమీనులు చాఱల బెబ్బులి చాఱపప్పు
జాఱుకయ్యేదలు బజాఱికన్నియలు హజాఱంబులోన దుజాఱు లనఁగఁ

---

1 శ-ర. మెఱపులు. 2 శ-ర. లో రెమ్మ అనియేకాని ఱెమ్మలేదు. 3 శ-ర. లో వఱద అనియేకాని వఱతలేదు.

దాఱు మెకంబు లీలఱున దీఱను దీఱుట పొదలలోఁ దూఱి చనుట
దేఱి చూచుట గడి దేఱుట ధర్మంబు దేఱుట యింతకుఁ దేఱుదు రన
సొప్పాఱి నాఱు వైచుట నాఱు విడుచుట నీఱు నిప్పులమీఁదినిండుబూఁది
పసపు నూఱుట నూఱుపదులు నన్నూఱు మున్నూఱు అఱవెస దొమ్మన్నూఱుఱు ననఁ
బాఱుఁడు బ్రాహ్మణుఁ డేఱు పాఱుట యింకఁ బాఱుట వెన్నిచ్చి పాఱుటయును
బఱఁతిజేహము గఱు పాఱుట పీఱుట చీఱుట పోఱఁడు చిన్నవాఁడు
బీఱు వోవక యినుమాఱు మాఱడుగుట మాఱి మసంగుట మాఱుపడుట
మాఱుమాటాడుట మాఱుమొగంబు వేమాఱు పెద్దలమాట మీఱి చనుట
ఱాచు సీలపుఱాయి ఱాఁగ వెన్నెలఱేఁడు ఱేసి ఱేసున గంగ ఱేవుఱెప్ప
ఱేఁచుకుక్కలు ఱేల ఱేఁగు ఱ్రేఁచుట ఱోయుట వెదకుట ఱోఁత వడుట

తే. వేఱు వడుటయు వీఱిఁడి వే ఱొకటియు
నాదిగాఁ గొన్ని యాంధ్రవాక్యములయందుఁ
బాదుకొను దీర్ఘములమీఁద బండిఱాలు
వీని నెఱుఁగక కృతి సేయ వెట్టి గలఁడె. 197

## కుఱుచమీఁది ఱకారములకు రూపములు

అఱవఱలు=తునుకలు
నోట నఱచుట=కూయుట
అఱిముఱి=బడిబడినియనుట
అఱగొఱలు
ఆఱముట=అబ్బుట
అఱకటఁ బెట్టుకొనుట = పొదిగిటఁ బెట్టుకొనుట
అఱచేయి
అఱకాలు
అఱవలు=ద్రావిడులు
అఱవుడు=కుప్పసము
అఱిసెలు=అప్పములు
అఱిగిపోవుట = తక్కువయి పోవుట
అఱమఱ సేయుట

అఱ లేక చనుట = అపోహము లేకపోవుట
పెండ్లియఱుగు
అఱపుకొనుట = దక్కించుకొనుట
అఱుపడికొట్టు
అఱపోఱఁడు = పొట్టివాఁడు
ఉక్కఱి
రూపఱి
పొలుపఱి
ఏపఱచుట
పెంపఱి
సిగ్గఱి
బిట్టఱి
పెల్లఱి
అఱమూఁత యిల్లు

క్రచ్చఱ
అక్కఱపడి
అఱకమ్మట [లు
అఱంటులు=అఱఁటికంబము
అఱటులు = స్త్రీలు మెడను గట్టుకొనెడుపూసలు
అఱకము = అన్నమఱుగకుండుట
ఇఱియుట=కదియుట. దీనికి లక్ష్యములు:—
ఇఱిచను=చిన్నచనుగవ
ఇఱికికొనిపోవుట = కదియించుకొనిపోవుట ఇవి మొదలైనవి
ఇఱియుట=నలిగిపోవుట
ఇఱులు=చీఁకటులు

బండిఱుఱుసు [యుట
క్రిక్కిఱియుట=మిక్కిలి కడి
ఇఱుకటము=కసిలి
ఇఱుకు=కొంచెము
అన్నమిఱిసిపోవుట=కడియఁ
బడి ముద్ద కట్టుట
ఉఱఁడు=సురేంద్రు [డైనను
డైకొనఁడు [వుట
ఉఱుకుట=వేగముగఁ బో
ఉఱు అనఁగా మిక్కిలియ
నుట. దీనికి లక్ష్యములు:-
ఉఱునట్టివరము, ఉఱు
తనదుశక్తివాలయఁగ ఇవి
మొదలైనవి
ఉఱువు=లావు
ఉఱుది=బెట్టిదము
ఉఱక=మానక
మేఘుఁడుఱుముట
ఉఱుకఱి
బలముఱి
ఉఱియ=దిట్ట
ఉఱియుట
ఉఱని=తెగువ
ఉఱుతపట్టి
ఎఱపఱికము [క్కుట
అడుగుల కెఱఁగుట = మ్రొ
ఎఱుపువన్నె
ఎఱుకువాఁడు
ఎఱికెచెప్పుట
ఎఱకలు=ఱెక్కలు
ఎఱుఁగు=తెలిసికొనుట [మ్ము
ఎఱువుసొమ్ము=మఱొకరిసొ
ఎఱచి=మాంసము
ఒఱలుట=శోకించుట
ఒఱవ=దేహము

ఒఱగాల నిలుచుట
ఒఱ=కత్తిమీఁదిమూఁత
ఒఱకటపుదోవనుబోవుట
ఒఱపులు=ఎమ్మెలు
ఒఱగుబిళ్ల
ఒఱగు వంక
కఱపుట=నేర్పుట
కఱతలు=పోకిళ్లు
కఱదలు=బుద్ధులు
కఱటి=మంకువాఁడు
కఱకు=కాఠిన్యము. దీనికి ల
క్ష్యములు:-- కఱకెక్కు
ట కఱకులాడుట ఇవి
మొదలైనవి.
కఱవు=దుర్భిక్షము
కఱ=కప్పు. దీనికిలక్ష్యములు:-
కఱకంఠుఁడు, పోఁకకఱ,
తమ్మకఱ, నీలికఱ ఇవి
మొదలైనవి.
కఱచుట దీనికిలక్ష్యములు:-
పండ్లఁ గఱచుట, వేళ్లు
గఱచుట, పూరి గఱచుట,
పింజపింజ గఱచుట ఇవి
మొదలైనవి.
కిఱపుట
కెఱయుట
ఉక్కెఱ=పిండివంట
పక్కెఱ [ము మాసినచీర
కుఱుమాపుచీర=కొంతమాత్ర
కుఱు=కంటు
కుఱుచ=కొంచెము
కుఱులు=వెంట్రుకలు
కుఱువలిగొనుట
కుఱుకుఱు
కుఱుకులు

కుఱుగొని
కుఱుగడ
కుఱుపు=వ్రణము
కొఱకొఱలాడుట
కొఱఁత=తక్కువ
పండ్లు గొఱుకుట
గుఱ్ఱపుకొఱడ [డుచునది
కొఱకు = ఆకాశమునఁ బో
కొఱ = పని. దీనికి లక్ష్యము
లు:- కొఱగామి, కొఱ
గాదు, కొఱమాలుట, కొ
ఱ అవుట కొఱగలవాఁ
డు ఇవి మొదలైనవి.
కొఱలుట=పూర్ణమవుట
కొఱవినిగాల్చుట
వానికొఱకు=చతుర్థి
గఱికెనట్టులు
గఱగఱికెలు
గఱుగుకాయలు
గఱిసె
దగ్గఱ=సమీపము
అంపగఱి
పగఱ=పగవాఁడు
గిఱికొనుట=కుప్పవడుట
మోటగిఱుక
గిఱుమెట్లు=గిఱుకచెప్పులు
గిఱలు వ్రాయుట
గీఱుట [రము
గుఱుకపెట్టుట = నిద్రావికా
గుఱగుఱ
గుఱపెట్టుట
గుఱ్ఱాని
గుఱిగడచుట=మేరదప్పుట
గుఱుకొండి
గుఱుతు

గుఱుమలు=గింజలు
తలగోఱుగుట
గోఱువంకపిట్టలు
గోఱక=కట్టె
వా చఱచుట
కొడవలికాఁచి చఱచుట అడ
చుట దీనికిలక్ష్యములు:-
చేతఁ జఱచుట, వీఁపు
జఱచుట, నేలఁ జఱచుట,
గోడ సున్నము జఱచుట
యివి మొదలైనవి.
గట్టుచఱులు=కొండచరులు
చిచ్చఱ = ఇంగలము దీనికి
లక్ష్యములు:- చిచ్చఱపి
డుగు, చిచ్చఱకన్ను, చి
చ్చఱకోల = ఆగ్నేయా
స్త్రముఇవి మొదలయినవి.
చిఱుత = కొంచెము దీనికి
లక్ష్యములు:- చిఱుతప్రా
యము చిఱుతనడుము
చిఱుతగండు ఇవి మొద
లైనవి.
చిఱు=చిన్న ఇందుకు లక్ష్య
ములు:—చిఱునవ్వు చి
ఱుచెమట చిఱుదొడ
మొదలయినవి.
చిఱికొట్టె
చిఱిమి
ముచ్చిఱితనము
చుఱుకుపుట్టుట
మేను చుఱచుఱఁ గాల్చుట
చెఱువు
చెఱకబట్టుట
చెఱలాడుట
చెఱుచుట

చెఱుముట=రాచుట
చెఱుగుట
చెఱసాల
చెఱుకులు
చెఱిసగము
జఱిజఱి
పూజఱి
జాజఱి
జఱిగొని [ట
జఱపుట = ఆలస్యము చేయు
జఱజఱ
జఱుగుట=నీవుట
వెజఱుట
జిఱజిఱఁ ద్రిప్పుట
జుంజుఱువెంట్రుకలు
జొఱజొఱ
తఱుగుట = వెలితిఅవుట.
దీనికి లక్ష్యములు:—
నెయ్యి తఱుగుట, వ
ఱితము తఱగుటఅనఁగా
తక్కువగుట. దీనికిలక్ష్య
ములు:—ధారణ తఱగు
ట కొంత తఱగుట ఇవి
మొదలయినవి. కొన్ని
చోట్ల తఱగుట, అనఁగా
కోసివైచుట. దీనికి
లక్ష్యములు:— తలతఱ
గుట కూర తఱగుట ఇవి
మొదలయినవి. [డు
తఱుగఱి=నిర్ణయించెడివాఁ
తఱుగని సంపద
తఱి గోలుపుట
ముత్తఱులు=పశులు
తఱుచు=దట్టము
తఱి=వేళ

పయనముతఱలుట
పుచ్చినతఱకలు
శత్రువులను దఱియఁ జూ
తఱుముకవచ్చుట [చ్చుట
తఱిగొని నడచుట
తిఱుగ=రెండవసారి
తిఱిపెనచుట
తుఱఁగలి=కాంతి
తుఱుము
వాతెఱ=మోవి
ఏడ్తెఱ
తెఱలినవాసన
తెఱకొలుపుట
తెఱపిసేయుట
కన్ను తెఱచుట = పాపుట
దీనికి లక్ష్యములు:—
నోరుతెఱచుట, తలుపు
తెఱచుట ఇవి మొద
లైనవి.
తెఱవలు=స్త్రీలు
తెఱువ
తెఱఁగు = విధము దీనికిలక్ష్య
ములు:— తెఱఁగెట్టిద
కో, తెఱఁగొప్ప, తెఱ
గులేమి, ఇత్తెఱఁగున ఇవి
మొదలయినవి.
తొఱలుట=కలయుట
తొఱగుట
ముందఱను
అందఱు
ఎందఱు
కొందఱు
ఇందఱు
ఇద్దఱు
పదఱుట

పెద్దఱికము
గద్దఱికాఁడు
అద్దిఱి
కట్టెదుఱు
నఱుజు = కొంచెము. దీనికి లక్ష్యములు:— నఱుజు పేలు నఱుజుముత్తెములు మొదలగునవి.
మ్రాను నఱుకుట
నిఱుపేద
నుఱుమ=నుగ్గు
ధాన్యము నుఱుపుట
కోకనెఱవు=పొడవు
నెఱి=బాగు. దీనికి లక్ష్యములు:— నెఱిదప్పి పడుట నెఱిచెడుట నెఱిఁబడుట నెఱి మొగము నెఱి కుఱులు నెఱినొచ్చుట నెఱిద్రోవ నెఱిచక్కఁ ద్రోచుట ఇవి మొదలైనవి.
నెఱ యనఁగా దొడ్డ. దీనికి లక్ష్యములు:— నెఱతనము నెఱగూరుట=దొడ్డ నాటుట నెఱనారసము నెఱసఱి నెఱవాఁడులు నెఱదాతలు నెఱబిరుదులు నెఱపంటలు నెఱచందురుఁడు ఇవి మొదలైనవి.
మఱియు నెఱయనఁగా గొప్ప దీనికి లక్ష్యములు:— నెఱమంట నెఱదెవులు నెఱవెంట్రుకలు మొదలైనవి.
నెఱియను=మిగులను
నీటులు నెఱపుట
నెఱిలేనిమిత్రుఁడు
నెఱపుట = అంతట విస్తరించుట
నెఱిక=కాసె
నెఱకులు=ఆయములు
నెఱులు=తలవెంట్రుకలు
కోక పఱపఱ చించుట
పఱుసదనము
పఱచుట = సేయుట. దీనికి లక్ష్యములు:— పఱచిన పొట్టు, చిక్కు వఱచుట, సిగ్గుపఱచుట, భంగపఱచుట-ఇవి మొదలైనవి.
కొన్నిచోట్ల పఱచుట యనఁగా ప్రవహించుట దీనికిలక్ష్యము:— నెత్తురు కాలువలై పఱచుట.
ఒకచోట పఱచుటయన వేగ నుఱుకుట దీనికి లక్ష్యములు:— వెనుకొని పఱచుట, గుఱ్ఱము పఱచుట, శత్రులఁ బఱపుట, అమ్ములఁ బఱపుట-ఇవి మొదలైనవి.
పఱికెలు
పఱియలు సేయుట
పఱివోవుట = ముంచుకొనుట
అంపఱక=ఓపక
పఱతెంచుట=వచ్చుట
పఱిగొనుట = నిండికొనుట
పఱిపఱియలు సేయుట
పఱు పైనపువ్వు
చూఱ పొగడను
పఱిమార్చుట
తెంపఱ
పెంపఱ
తెప్పిఱిలుట
పిఱుఁదను = వెనుకను. దీనికి లక్ష్యములు:— వానిపిఱుఁదనె చొచ్చుట, విఱిగి పిఱిఁదికిఁ బాఱుట ఇవి మొదలైనవి.
ఒకపట్టు పిఱుఁదు = కటిస్థలము
పిఱుసనుట పిఱివోవుట = వెనుకదీసుట
దొడ్డపిఱికితనము
తలపుఱియ=కపాలము
పెఱికెలు=గోనెలు
పొడవు పెఱుగుట
అమ్ములు పెఱుకుట = పీకుట.
పెఱయనమఱియొకటి. దీనికి లక్ష్యములు:— పెఱమూఁకలు పెఱచేఁతలు పెఱవారు పెఱచోట ఇవి మొదలైనవి.
పెఱుసనిపోవుట
బఱబఱ నీడ్చుట
దబ్బఱమాటలు
బిఱబిఱఁ ద్రిప్పుట
బిఱుసు గాల్చుట
కోటబుఱుజులు
మఱువ=మంటికుండ
మఱుఁగు=చాటు. దీనికి లక్ష్యములు:— మాటమఱుఁగు పెట్టుట, కనుమఱుఁగుచోటు, బలవంతుని మఱుఁగు చొచ్చుట, మైమఱుఁగు=కవచము, కొందఱు మఱు అనియనిరి. ఇవి మొదలైనవి.
మఱచిపోవుట

మఱుసాఁడు
మఱపఁలు
మఱఁది
మఱియుం
ఏమఱిపాటు
పలుమఱు
మఱుగుట = మచ్చికయవుట
మఱుపడి
క్రమ్మఱ=తిరుగ
మఱులేక=మఱుఁగులేక
క్రమ్మఱుట=తిరుగుట
పడమఱ=దిక్కు
మఱఁగాలు
పెడమఱలుట
మిఱిచూపుట
మిఱిమిట్లుగొనుట
ముఱిముఱి చీఁకటి
ముఱి=మొండెము
ముఱిముఱి=బడిబడిని
పిల్లమెఱుములు వైచుట
మెఱుపులు మెఱయుంట
మెఱుఁగు లీనుట
కనుమొఱఁగుట=దాఁగుట
మొఱక=వెలితి
మొఱ పెట్టుట
మొఱమొఱ లాడుట
మొఱసుట=కోపవికారము
కుక్కలు మొఱగుట
మొఱకుతనము
ఱట్టువొందుట
ఱంపిల్లుట
వజ్రపుఱవలు
ఱంతువోవుట
పట్టుఁ ఱవికె
ఱవఱవలు=కోపము
ఱంకము
ఱంపు
ఱవిళి
ఱెక్కలువైచుట
ఱివ్వన నెగయుట
ఱాళ్లను ఱువ్వుట
[illegible] ఱెక్కలు
కను ఱెప్పలు
ఱెల్లుగడ్డి
పూఱెమ్మలు
బలుఱొమ్ము
వఱత=వెల్లి
ఏఱిపఱద
పఱదుగూర్చుట
పంగవఱుగు
వఱలుట
పండు విఱిగి చనుట
విఱివోవుట
విఱిగాలి
విఱివిడి
కంబము విఱుగుట
వెఱబొమ్మలు
వెఱచఱచుట
వెఱచుట
వెఱగొందుట
నివ్వెఱపడుట
సుఱసుఱ ప్రుక్కుట
అసు ఱుసు అనుట

## ఇవి కుఱుచలమీఁది ఱకారములు

---

## నిడుదలమీఁది ఱకారములకు రూపములు

ఆఱు = లెక్క దీనికి లక్ష్యములు:- ఆఱుచక్రములు ఆఱమ్ములు ఆఱుమాట లివి మొదలైనవి.

ఆఱడిపోవుట
ఆఱికెపంట
చిచ్చాఱుట
పాపము లాఱుట
ఆఱవితేజము
ఊటాఱిన ముత్యములు
కోకకడియాఱుట
శ్రమ మాఱుట
ఆఱప్రలు
దేహమంతయుం నూటాఱుట
ఊఱడి = విశ్రమించి
ఊఱుగాయలు
నోరూఱుట
ఓఁకపండ్లేఱుట
ఏఱువసీమ
ఏఱుదాఁటుట
కాఱుపోతులు
హాంతకాఱి
కాఱడవులు
కాఱియఁ బెట్టుట = గాసిపెట్టుట
కాఱుట=జాఱు
కోఱలు=నోటిపండ్లు
గీఱుట=నాటుట
పండ్లను గీఱుట=తీపుట
చేటెడు మాడలు
చీఱుట = నడిమికి రెండుగాఁజేయుట
ఊయ్యాలచేఱలు
చూఱ = అందఱిని దోఁచుకొనుట
చోఱమీను=చేఁప
చాఱలబెబ్బులి
చాఱపప్పు
పయ్యెదజాఱుట

బఱాతి(వాండ్లు) కన్నియలు
హజాఱము = పెద్ద కొలువు సావడి
తుజాఱి = ధనముగలవాఁడు
తాఱుట = పఱువెత్తుట
ఈతీఱిన తీఱుట = సేయవలసిన పని తీఱుట
తీఱినమిట్టగుడ్డు
పొదలలో దూఱుట
తేఱిచూచుట = తేఱికొన చూచుట
గడిదేఱుట
ధర్మముదేఱుట
ఇంతకుం దేఱునరు
సొన్నాఱి = అగసాలవాఁడు
వంగనాఱు వైచుట = నాఱు వైచుట
నీఱు అనఁగా నిప్పుపైఁ గప్పి యుండెడు బూడిద
పసపు నూఱుట
నూఱుపదులు
నన్నూఱు, మున్నూఱు, తొమ్మన్నూఱు.
పాఱుఁడు = బ్రాహ్మణుఁడు
ఏఱు పాఱుట
ఇంకఁ బాఱుట
వెన్నిచ్చి పాఱుట
దేహము గఱుపాఱుట

పీఱుట = చిఱుఁగుట
పోఱఁడు = చిన్నవాఁడు
బెఱు వోవుట
ఇఱుమాఱు
మాఱుకుగుట
మాఱి మసఁగుట = గాపు [పట్టుట
మాఱుపడుట
మాఱుమాట
మాఱుమొగము
వేమాఱు
పెద్దలమాట మీఱుట
ఱాచుట
నీలపుఱాయి
ఱాఁగ
వెన్నెలఱేఁడు = చంద్రుఁడు
ఱేపి
ఱేసున
గంగఱేవున
ఱేవు
ఱేఁచుకుక్కలు
ఱేల
ఱేఁగు
ప్రేఱేచుట
ఱోయుట = వెదకుట
ఱోఁతపడుట
వేఱు పడుట
పిఱిడి
కేఱొకటి

ఇవి నిడుదలమీఁది బండిఱాలు

ఉభయరేఫలు
అరుగుట = పోవుట
చెఱుచుట
తెఱఁగులు
తొఱలుట
తొఱఁగుట
నెరయుట = విస్తరించుట
పరిగొనుట
పరిచనుదెంచుట
పరిమెయి = పరయొకటి
పరిమార్చుట
పెరుగుట
క్రమ్మర
మరలుట

ఇవి కుఱుచల మీఁది రేఫ ఱకారములు రెండు నగును.

ఆరుట = శమించుట
తీరనికినుక
తీరుట
పోర నీరయి పోవుట
మారిమసంగుట
వేమారు

ఇవి దీర్ఘముల మీఁది రేఫ ఱకారములు

కుఱుచలమీఁది రేఫఱకారములు రెండును అయినవానికి లక్ష్యములు.

అఱుగుట, పోవుటకు మౌసలపర్వమునందు:—

క. మఱునాఁడ యరుగుట లెన్నఁగ
[1]నఱిఁగె నినుం డపుడు వేఁడి యడరినదీప్తుల్

1. నెఱిఁగె......యొదలిన దీప్తుల్ (ఆనంద

తుఱంగలి గొని పశ్చిమగిరి
చఱికె నవలిదూఁకఁ డై విశదుఁ డై తోఁచెన్. (ఆ. 1-69) 198

చెఱుచుటకు సభాపర్వమునందు:—

క. వెఱచఱువ నింతకంటెను, దఱచుగ బాణంబు లేసి కడయక పగఱం
జెఱుతు నని యిసుమఁ జల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతి నరిగెన్.
(ఆ. 2. 305)

తెఱఁగునకుం గవిజనాశ్రయమునందు:—

క. నెఱయంగా నీఛందము, తెఱఁ గెఱుఁగక కవితఁ జెప్పఁ దివురునతఁడు ద
బ్బఱచేసి చీకుగజ్జముఁ, బఱపినగతి నిఖిలహాస్యపదవిరతుఁ డగున్. (ఆ. 1. 4)

తొఱఁగుటకు నృసింహపురాణమునందు:—

సీ. పా. పరమాత్మపదములఁ దొఱఁగి పాఱెడు నేఱి, తరఁగలపై లీల దాఁటి దాఁటి.
(ఆ. 1. 54)

అందే:—

తే. శాకద్రుమాఁకుల మొదలను బుష్పరసము
[1]తొఱగి నెత్తావి యందున నెఱయ నొప్పఁ
బూచుకొఱకును మున్ను నింపులు దలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యామిసినకళ్లె యనఁగ. (ఆ. 2. 69) 202

పరిగొనుటకు *

... ... ... ... ... ...

పరిచను దెంచుటకు విరాటపర్వమునందు:—

చ. పరిచను దెంచె గోగణముఁ బట్టె నన న్విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతితోఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె నీ
పురుషునిశౌర్యసంపదయుఁ భూరిబలంబు నెఱుంగఁ డేమియున్.(ఆ. 4. 78)203

పరిమెయి యన్నందునకు శాంతిపర్వమునందు:—

చ. పరిమెయిఁ బాఱి పాఱఁ గని పట్టి వెసం బెడకేలు గట్టి తె
చ్చి రసురభర్త సూచి యిటు సేరఁగఁ దేవల దీకృతఘ్నునిం
బొరిగొని వేతినుం డనినఁ బోకడ మాలినవార మయ్యు యి
ద్దురితశరీరముం దినఁగ [2]దోసము మా కని వార లొల్లమిన్.(ఆ. 3. 505) 204

1 అచ్చుపడ్డనృసింహపురాణమందు 'తొఱఁగి' 'నెఱయ' రెంటను లఘురేఫ మున్నది. 2 గూడు నె (ప. వా). ఈపాఠమున యతిభంగము. * దీనికి లక్ష్యము ప్రాచీన ప్రతులలోలేదు. లేఖకులు చోటువిడిచినారు. హరివంశము పూ. భా. ఆ 6 లోను వసుచరిత్ర ఆ 5 లోను కలవు. చూ. శ. ర.

*పరిమార్చుటకు

.........................................

పెరుఁగుటకు స్త్రీపర్వమునందు:—

క. పెరుఁగుట స్రగ్గుట చవలం, బొరయుట యరుచంబు గాఁగఁ బుట్టుట పావం
బెరయుట పాయఁ బదార్థో, త్కరములకై జంబు లెట్లు దప్పింప నగున్. 205
(ఆ 1. 24)

క్రమ్మఱుటకు ఆరణ్యపర్వమునందు:—

మ. పఱచుం దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం
బెఱువోవుం బొదలందు డిందుఁ బొడముం బి ట్టుల్కి వే దాఁటుఁ గ్ర
మ్మఱి చూచుం జెవి దార్చి నిల్చు మలయుం న్మట్టాడుఁ గ్రొండాడు సే
మఱిన ట్లుండుఁ దృణంబు లాను నలయున్ మాయామృగం బిమ్ములన్. 206
(ఆ. 6. 327)

మఱఁద లనుటకు భాస్కరరామాయణమునందు:—

చ. ఎఱిఁగి యెఱింగి మ న్నతఁడె యె గ్గొనరింపఁడె దానికై కదా
చెఱఁ గొని వచ్చితిం బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదులఁ జావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మేపగిది మానిని యీఁగుదు సంధి చేసినన్. (యుద్ధ. 784.) 207

నెరసె ననుటకు నృసింహపురాణమునందు.—

మ. ధరణీమండలి దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామరనివాసశ్రేణులం దోలిస్తై
నెరయం బంకజసంభవాలయమున న్నిండారె నవ్వేళ శ్రీ
కరదైతేయతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోష మై. (ఆ. 3. 141) 208

నిడుదలమీఁది రేఫఱకారములు రెండును అయినవానికి లక్ష్యములు.

ఆరుటకు శాంతిపర్వమునందు.—

క. కౌరవులు సేయునవమతి, కారణముగఁ గోప [1]మెత్తుఁ గర్జునివదనాం
భోరుహము గనుఁగొనఁగ [2]శ్రమ, మారు న్నావశము గాక [3]యంతన బుద్ధిన్. 209
(ఆ. 1. 13)

ఆదిపర్వమునందు.—

క. కాఱడవిఁ బఱచుమృగముల, [4]నూఱడకం దిగిచి డస్సి యున్నతనిశ్రమం
బాఱంగా నెదఁ దాపము, దీఱఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్. (ఆ. 4. 18) 210

---

1 మెత్తెఁ. 2 శమ. 3 యాతనిబుద్ధిన్. 4 నూఱకడం (వా.)

* ప్రాచీనప్రతులలో దీనికి లక్ష్యము వ్రాసియుండలేదు. భారతవిరాటపర్వమున లక్ష్యమున్నది. జా. శ. ర.

కాఱుటకు నుద్యోగపర్వమునందు.—

ఉ. ఆఱడిపోకయుం గ్ఫలము నందుటయుం గని పల్కె నేరమి
స్మాఱటనోటిదాన నయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ
గాఱుబు [1]ప్రేలెద న్విభుఁడు కర్ణము నెగ్గును గాన నల్కమై
[2]పిఱిఁడి యైనమానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. (అ. 3. 107) 211

తీఱుటకు రామాయణమునందు.—

ఉ. మీఱినకోఱలు న్మిగిలి మింటికిఁ బర్విన పల్ల[3]వెంట్రుకల్
తీఱినమిట్టగ్రుడ్లు నతిలిప్తతరం బగునట్టిసాహసం
బాఱని తేజము న్దిశల నంటినచేతులు లోకరాజిలో
నేఱినమేటిరూపముల నెంతయుం నేర్చిరి రాక్షసు ల్వడిన్. (యుద్ధ. 2032) 212

* తేఱుటకు యుద్ధకాండమునందు:—

క. తేఱుదురు రిపుల నక్కఱ, మీఱుదురును నిపుడు మూర్ఛ మెయి నిట్టున్నా
రాఱని తేజంబులతో, నీఱు పయిం గవిసి యున్ననిప్పులు వోలెన్. 213

*నీఱనుటకు త్రిపురాంతకదేవుని యుదాహరణమునందు:—

ఉ. ఆఱడియాస నీరసథనాధిపలోకమునిండ్లవాకిళుల్
దూఱుట మాని శ్రీనగముతూరుపువాకిట దూఱి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతినీల్లను గ్రుంకి మనంబులోనిచి
చ్చాఱఁగఁ జేయుం టొప్పఁ ద్రిపురాంతకదేవునకై నమస్కృతుల్. 214

* మాఱి యనుటకుఁ గర్ణపర్వమునందు:—

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపద
న్మీఱిననీవు గల్గగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
[4]ల్మాఱి తలంప నీనగుబలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. (అ. 3. 10) 215

వేమా అనుటకు నృసింహపురాణమునందు:—

క. మీఱినమానులకినుకకు, మా ఱలుగక యున్నమీసముగ్రక్షను వే

---

1 చీలెద (ప. వా.) 2 పిఱుఁడి (ప. వా.) 3 వెంట్రుకల్ (ప. వా.) 4 ల్మాఱె (వా.)

* దీర్ఘములమీఁది రేఫఅకారములు రెండును గలమాటలపట్టిలో 'తేఱుట' లేదు; దానిలోనున్న పోరనీరయిపోవుటకు ఉ. ఆఱడి...ఉదాహరణమా? 'మాఱిమసంగుట'కు ప్రయోగమీయవలసియుండెను. శ.ర.లో ఈమాట లేదు. మార్కండేయపురాణములో (అ. 6. 103) 'సీ. గీ. మాఱిమసఁగి దైతేయులబారిపమరె' అని లఘురేఫముతో ప్రయోగమున్నది.

మాఱు గొనియాడఁగాఁ దగు, గీఱునె సాత్వికులబుద్ధిఁ గిల్బిషచయముల్.(ఆ.1.95)

క. తెలిపితి నన్నయభట్టా, దులకావ్యములందు నాకు దొరకిన రేఫం
బులు ఱాలు మఱియుం జెందులఁ, గలిగినఁ దగ వనక యవియుఁ గైకొనటొప్పున్.

క. తొలుతటివారలు వాడని, తెలుఁగులపలుకులను గలద్వితీయాంతస్థం
బులు గూర్పరు తచ్ఛేదం, బులు చెలియమి బుధులు ప్రాసములకు యతులకున్.218

లకారభేదంబులు:—

తే. దురితసంహార నిర్జరోక్తులనె కాదు, వెలయుదొడ్డళకారంబు వికృతియందు
నెళవు దళవాయి మేళంబు నీళ్లనంగఁ, బళ్లెరం బనఁ గక్కులకళ్లె మనఁగ. 219

ఆ. ప్రథమమీఁద నుండుపంచమవర్గాది. వర్ణమునకు బదులు వచ్చి నిలుచు
లాఁతి యగువకార మూఁతమై తెలుఁగున, బరువు వెట్టి చిక్కువడియెననఁగ.220

మూ.సూ.—క్వచి దపిన స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ.

సీ. జాతివా గలవోఢృశబ్ద మొక్కటి దక్క సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు నొత్వంబులును గల్గ వొకటి కైన
వాకు శృంగములకైవడి నొత్వములభంగి శబ్దాదిఁ గలయవి స్వరము లగును
రెండును లాఁతుల నుండుఁ గృష్ణుఁడు గిన్క వుట్టె మోఁదినఁ జెట్టు వొలిసె ననఁగ

తే. నడుమఁగొమ్ములు సంస్కృతాంధ్రకులరెంట, బలసి జాత్యక్షరములకే గలిగియుండు
భావుకము నీవు భక్షకంబు భవుఁ డనంగఁ, బొడవుదీవులుసవురంబుపువ్వులనఁగ.221

లఘ్వలఘుభేదంబులకు:—

మూ.సూ.—నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం
స్యాత్—

క. వైకృతకావ్యంబులలోఁ, గాకోదరశయన లఘుయకారము వ్రాల్తై
కైకొనఁ దగు బ్రాసములకు, జోకయె స్వరహాయలు వడికిఁ జొప్పను టరుదే. 222

తే. ప్రియుఁడు రాఁడాయె సత్యభామయెడఁ గాఁగ
నెన్నిమాయలు పన్నెనో యెఱుఁగరాదు
గాయఁగాఁ జొచ్చె శశి మింట నాయనంగుఁ
డేయఁగాఁ జొచ్చె సఖి చక్రి యేఁడి యనఁగ. 223

క. రెండర్థంబులపద్యము, లుండెడిచో నొకటి యచ్చు నొకయర్థమునన్
నిండారువాల్లు నగు మఱి, ఖండన వలసినను లఘుయకారము కృతులన్. 224

రాఘవపాండవీయమునందు:—

క. వినిి యతనిం దలపై నిడు, కొని యేఁగి నియమికిఁ దగనిఘోరార్తి యొన
ర్చినవాఁడ మీఁదు దండ్యుఁడ, నని తనుఁ దెలుపుచును వారి కప్పనఁ జేసెన్. 225
(ఆ. 1.25)

సీ. త్రైయక్ష పానీయ పీయూష వైయాత్య హైయంగవీన వైయాసిక త్వ
దీయ స్వకీయా స్మదీయ మదీయ ప్రభృతులను [1]గియ్యలు పెట్ట రాదు
క్షయ్యజయ్యన్యాయ్యసాహాయ్యసాన్నాయ్యధాయ్యహేయ్యాదుల నికాయ్యములను
క్రయ్యశబ్దమునను గియ్యలు గల వని తెలిసి ప్రాసములకు నిలుప వలయుం
తే. పైయెద సయాటయుం నొయారి బలుగయాళి, యనుపదంబులఁ గొన్నిటిన రసిచూడఁ
దొలఁగు నిలుచును గియ్యలు దెలుఁగులందు, సత్యభామాముఖాంభోజచంచరీక. 226

శశిబిందుచరిత్రమునందు:—

ఉ. పయ్యెదఁ బాపి గుబ్బలను బాహులఁ బట్టఁగ నిచ్చి మోవిపైఁ
దియ్యనిమోవియూ న్మనసు సీరఁగఁ గ్రోలఁగ నిచ్చి యిప్పు డో
తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేసఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁ దగునే నను సీగతి నేఁచఁ బాడియే. 227

చిత్రభారతమునందు:—

ఉ. ఆయమరాచలంబు ధను వై విలసిల్లఁగ విష్ణుఁ డమ్ముగా
వేయుఁ విధంబులం బరిఘవిఘ్నైదుశింజిని గూర్చినట్టిశూ
లాయుధు [2]నొక్కచూత్రమున నంగము వ్రయ్యఁగ మోఁది మించి తోఁ
దీయనివింటనే వెనుకఁ దీయనిబీరమున న్మనోభవా. (2-80) 228

రేఫమునకు:—

తే. జ్ఞాతి వైరంబు నొంది ప్రాసంబులందు, విశ్రమములందుఁ దమలోన వేఱు గలిగి
దేవదానవు లట్టన తెనుఁగులందు, మించి రేఫఱకారముల్ మెలఁగుఁ గృష్ణ. 229
క. భి)రుయక రేఫఱలకు రే, ఫఱలను ఱాలకును ఱాలుఁ బ్రాసములను వి
శ్రమములకు జెప్పఁ దగు నీ, క్రమ మెఱుఁగక రెండునుం గుకవి గూర్చుఁగృతిన్.
ఆ. [3]సారిది భోజకన్య సరదంబుపై నిడి, శేయిఁ దెచ్చె నదఁగ రేఫ మయ్యె
మఱది యనక సిగ్గు పఱచి రుక్మిని జాల, ఱట్టు చేసె ననఁగ ఱా ముకుంద. 231
తే. చెల్లు నని ముందు భీమన చెప్పె ననుచుఁ, గలుపుదురు రేఫములును ఱకారములును
దుష్టకవు లవి యొక టైనఁ దొంటిపెద్ద, లందఱును నేలవిభజించిరని తెలియరు. 232

1 గియలు. 2 మాట (వా) 3 సొరది (ప. వా). శ.ర.లో సారిది అనియే కాని సొరది లేదు.

క. వలసిన రేఫఱకారము, లలవముఁ దా మొకటి కొక్కటని భీమకవే
పలుకుట గలిగిన నాతఁడు, గలిసినలక్ష్య మొక టైనఁ గనఁబడ దున్నే. 233

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయుం నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసము లైనకతంబునం గదా
యిమ్ముల నావిలాక్షణికు లెల్లను మాని రుదాహరింపఁగన్. 234

శారదాదర్పణమునందు:—

తే. చఛజఝులకు మొదలియూష్మములు మూఁడు, సరసవడి నిల్పఁగా నేకజాతి యైన
బండిఱాను రేఫము వడి కుండ రాదె, ప్రాసవర్ణంబులకుఁ గూర్ప రాదు గాని. 235

ఈపద్యంబు లక్షణసేద్యంబును సుకవిహృద్యంబును గావని యెట్టనిక :—

కవిజనాశ్రయమునందు:—

క. *ధరజఝలకు నీ రెండక్షరములు విన్నయదిలేదు శబ్దము మొదలన్
[1]మరయలవములను నేరక్షరములు తమతమకె వళ్లు కమలాధీశా. (1.72) 236

అనంతుని ఛందమునందు:—

క. ధర నెక్కటివళులై తగు, లరమఱవలు దానితోఁ దొలంగక ళాకు
న్సరి శా యని విశ్రమవేళ రమాధవ రెండునుం గలసి వర్తించున్. 237

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ, రాజసింహమూర్తి రక్షకుండు
ఱాఁగ వేలు పనఁగ అంపిల్లు నెక్కటి, వళ్లు నాఁగ నిట్లు వనజనాభ. 238

కావ్యాలంకారచూడామణియందు:—

క. లరమఱవ లేకతరవళు, లరయఁగఁ దమతమకె కవులయనుమతి వళు లై
పరఁగుఁ బదాంతముకారము, శౌరి నూఁదినఁ దూలి చనినఁ బుభుబు[2]భులకగున్.
(ఆ. 7. 43)

లక్ష్యము

ఆ. అజ్జు లాడి యాగి ఱాపడి సభలోన, ఱేనిపోరిలోన ఱిచ్చఁ బోరసి
ఱెన్న ముడుగు పుడమిఱేండ్ల నేల నుతింప, మనకు విశ్వనాథుఁ డొసరి యుండ.

సర్వలక్షణసారసంగ్రహమునందు:—

తే. మహిమ నెక్కటివళు లన మరవఱలలు, రహిని దమతమకయ యగు రమ్యచరిత
వనధిగంభీర సద్గుణవాస యనఁగ, భంజితాసురసముదాయ యాంజనేయ. 241

---

*ఈపద్యము లేఖకులు వ్రాసియుండరేమ. వ్రాయుటకు చోటుమాత్రము వదలియున్నారు. ఇది (వా) లోనే కనఁబడును. 1 "మరవఱలలు నానేనక్కరములు" అని వావిళ్లవారిముద్రిత కవిజనాశ్రయము. 2 భుల కగున్.

## రేఫలోపము

క. నేరుచ(ఱ)నుపట్టిలపిరము, లో రేఫం బచ్చుతోడ లోపం బగు రా
ధారమణ వలసినప్పుడు, భారతమున సోమయాజి పలుకుటవలనన్. 242

విరాటపర్వమునందు:—

క. ద్యూతక్రీడకుఁ గొంపోక, నేతుం గపటమున నొప్పనిజనంబులు నా
చేతిధన మెల్లఁగొని పెఱ, భూతి యొనర్చిన విరక్తి పొడమి వెడలితిన్.(ఆ. 1. 196)

మౌసలపర్వమునందు:—

క. కాచి కొని వచ్చి తగ నా, నేచినయట్టిచట నిచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్.(ఆ. 1. 215)

లోపము రామికి రాజశేఖరచరిత్రమునందు:—

క. ఎరికి బుద్ధిబలంబులు, కారణములు గావు సువ్వె కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికినవారలు, నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా. 245

## క్రారవడులకు

తే. క్రిందు గ్రద్దయుఁ ద్రోవయుఁ ద్రిమ్మఱుటయుఁ
బ్రోచుటయు బ్రతికించుట మ్రొక్కుటయును
వ్రేలుటయు స్రుక్కుటయు నన వీనిమొదలి
వ్రా లిటులఁ గొన్నిటను గ్రారవడులు చెందు. 246

## లకారములకు

క. విరమణములకును బ్రాసా, క్షరములకును ళలలు దొడ్డసన్నములును మ
చ్చరము తెఱుంగక చెల్లును, హరనుత "లళయో రభేద" యనుసూత్రమునన్. 247

ఆ. గంగకొడుకుమాట గాదని సభను బె, ట్టపడ నెల్లనృపులలోన వారిని
గొల్ల డనుచుఁ జాలఁ ద్రుళ్లి చేదివిభుండు, వాలిసెఁ బఱచి బలము నెళవ్రఁ జేరె.

## వకారమునకు

తే. పాలుపడి నిల్చు లాఁతివా ప్రాసమునకు, జాతివాకు సవర్ణమై శంక లేక
యతికిఁ బంచమవర్గాద్య మగుటఁ జేసి, చెల్లదు వకారమునకు లక్ష్మీభుజంగ. 249

తే. అవనితనయునిచేతఁ బట్టువడి యున్న, పడుచుకొమ్మల వారి చెట్ట వట్టి యేలెఁ
దవిలి విదియాఱువేవురు దమకుఁ దాము, వేలువాఁ డని తను నిచ్చ మెచ్చుకొనఁగ.

తే. లాఁతి జాతికి వడిని నిల్పఁ దగ దనుచు, సూత్రమునఁ జెప్ప లే దని చూడ వలదు
నన్నయార్యుఁడు పంచమామ్నాయమునను, నిలుపులక్ష్యంబులకుమాఱు వలుకవశమె.

ఆదిపర్వమునందు:—

ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసమ్మతబుద్ధియుఁ జిత్తశాంతియు
స్నానమదప్రహారము సమత్వము సంతతవేదవిద్యయు
ధ్యానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్. (ఆ. 1. 157) 252

క. నువు నువ్వు నూవు నూఁబు, [1]వ్వవఁ డేవాఁ డెవ్వఁ డేవఁ డీతఁ డనంగాఁ
బువు పువ్వు పూవు పూమొ,గ్గవురా వికసించె ననఁగ నగు వలనుండెడన్. 253

నూ వన్నందుకు శశిబిందుచరిత్రమునందు:—

క. నూవుంబువ్వును సంపెఁగ, పూవు గెలిచి బిరుదుముత్తెపుంజల్లి దగ
న్దా వైచె ననఁగ ముంగర,తో వనరుహ[2]నేత్ర నాస తుల లే కొప్పున్. 254

ఏవాఁ డన్నందుకు విరాటపర్వమునందు:—

క. నీ వొకతె యేల యిలఁ బడి, వేపురు వే వలది పట్టి వెనకిన నడ్డం
బై వచ్చి వలను నా నిం, దేవాఁడు మగండు లేమి నెఱుఁగవు కంటే.(ఆ. 2.256)

శాంతిపర్వమునందు:—

క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును నొప్పిఁ జెందుదురు గృశుం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతను కార్శ్యకుండుఁడు కృశుఁడె నరేంద్రా.
(ఆ. 1. 52)

పూ వన్నందుకు ఆముక్తమాల్యదయందు:—

ఉ. వేవినమేడపైవలభి వేణికఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోళ్ల మీటుతఱిఁ బోయెడు తేఁటుల మ్రోఁత కామికిం
గావహ మౌఁ గృతాభ్యసన లాటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణ మీటుటలుఁ జిక్కొదలించుటలున్ [3]సమంబుగన్. (ఆ. 1. 62) 257

వ. కడమవి ప్రసిద్ధములు గనుక లక్ష్యములు వ్రాయలేదు.

సకారభేదంబులు.

క. శన లెఱుఁగక చదువంగాఁ, బోసఁగ దదె ట్టనిన శకలము సక్ర్తనుచో
వసుధ సకలము శక్ర్తన, రసికులు నవ్వుదురు గాన రాక్షసవైరీ. 258

సీ. వికృతిపదాదిని వెలయుశాఱవహల్లు మొదలివిభక్తిపైఁ గదిసెనేని
యరయఁ దృతీయోష్మ మగు శౌరి సీరలు దాఁచి గోపస్త్రీల నేఁచె ననఁగఁ

1 వ్వవఁ డెవ్వాఁ డెవ్వఁ. 2 నేత్రి. 3 సరింబడన్ (అచ్చుప్రతి).

ప్రశమోష్మవర్ణంబుఁ బరికింపఁ దన్యహాస్యాంధ్రదేశోక్తులయందు లేదు
సింగంబు [1]సిరిసిరి సెనమును సెలగోలు పిసెఁడు పసిగోవఁ జేసి రనఁగ
తే భీష్మసత్ప్రశ యివి కృతిమోష్మలిపులు, గాని ప్రశమోష్మవర్ణము ల్గావు వీనిఁ
దెలియక రచించు కృతులు ధాత్రీతలమున, బ్రాసభంగంబులై నగుబాటుఁ జెందు.
క. తెలుఁగుపదంబుల నెక్కడఁ గలమూఁడవయూష్మమును శకారముఁ గాఁగం
బలుకుదు రజ్ఞజనంబులు, సెలగోలలు సెనగ లాఁకుసేరులు ననుచోన్. 260

## హకారవివేకము.

సీ. బహ్వర్థ విహ్వల జిహ్వ హ్వా లాహ్వాన గహ్వ రోపహ్వర ప్రహ్వ కహ్వ
శబ్దంబులు వకారసహితంబు లగుఁ గాని బిందుపూర్వములు దా మొదలఁ గావు
సంహతి సంహారి సంహితా సంహార సంహన నాంహహో నృసింహ రంహ
బృంహణ పదములు బిందుపూర్వకములు గాని వకారయుక్తములు గావు
తే. మాముకులు నిల్పు బ్రహ్మజిహ్మగపదములఁ
జిహ్న యనుచోట నాముడిఁ జెందియుండుఁ
గిహ్య లగు లేహ్య గృహ్య ప్రగృహ్యములను
బ్రాసముల వీని నెఱిఁగి చెప్పంగ వలయు. 261

## కావ్యాదిగ్రాహ్యవర్ణంబులు.

మూ. సూ. శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణా స్తథైవ కావ్యాదౌ
గ్రాహ్యాః. 18
తే. లిపుల కధిదైవతంబులు లింగములును, బ్రాణగతి ఫలబీజంబు లాసనములు
నమృతములును విషములును దగ్ధాదిభములు, దెలిసి కావ్యముఖంబున నిలుప వలయు.
క. జడ్డలు గలమాతృక [2]తొలి, నిడ్డ వర్ణోర్ణములకెల్ల నేఁటికి మీఁదన్
దొడ్డదొరబిడ్డకైనఁ, నొడ్డై కచుపడ్డ వ్రాల కూహింపఁ దగున్. 263

## వర్ణాధిదైవతంబులు.

తే హరిధరలు కంతురమ లంబికామరాంబ, లలకుమాగవరాహశక్తులు వసుత్రి
దివభిషక్కులు మఘచిత్తభవులు కాళి, కార్యలు హరాభవులు పతు లచ్చులకును.
సీ. స్పర్శవర్గములకుఁ జతురాస్యపవమానకరిముఖగణపతినరమృగేంద్రు
లింద్రాపరజగుహాద్రీంద్రజా భైరవజిను లంతకాప్రపశివమహేశ

1 సిరిదరిసెనమును (ప. వా). 2 తో, నిడ్డ (వ).

వాణులు ఫణిసాథవాసుకినందికేశ్వరపద్మమిత్రశంకరులువీర
భద్రకేశవదస్రభద్రకాళీశూలధారులు నింక సంతస్థములకు

ఆ. మారుతాగ్నిభూర్వమాతంగవరుణులు, శావివర్ణములకు శ్రీదినేశ
వాక్సినాకధరులు వల మాటిళాకు భూతములు నాగమోక్తదైవతములు. 265

తే. కృతిముఖాక్షర [1]దేవత పలికె సుకవి, పఠనకును లేఖకునకును వాచకునకు
శ్రోతృజనములకును శుభాశుభఫలంబు, లెలమిఁ గల్పించుచుండు మహీస్థలమున.

## వర్ణలింగంబులు

క. పుల్లింగంబులు ప్రాణము, లెల్లను స్త్రీలింగములు మహిని స్వరములతో
హల్లులు నపుంసకంబులు, పొల్లు లగుఁ గకారముఖ్యములు నలినాక్షా. 267

తే. చిరవిభూతి పలికె స్త్రీలింగలిపు లిచ్చు, భంగపఱుచు షండలింగలిపులు
భూరివైభవంబుఁ బొందించుఁ బుల్లింగ, లిపులు తొలుత నిలిచి లేఖవినుత. 268

## వర్ణంబులకు (లో) నల్పప్రాణమహాప్రాణంబులు

ఆ. స్పర్శవర్గ జాతసమలిపు ల్మూఁడవ, వర్గమునను విషమవర్ణములను
నాలు గూష్మములను నలిమహాప్రాణంబు, లల్పసంజ్ఞికంబు లన్యలిపులు. 269

క. తొలుత మహాప్రాణంబులు, నిలిచినఁ గృతినాయకుండు నీల్గును నెలలోఁ
పల నల్పప్రాణాక్షరములు గూర్చినఁ బెక్కువర్షములు జీవించున్. 270

## వర్ణంబులకు దేవమనుష్యతిర్యగ్గౌరవగతులు

సీ. ప్రాణార్ణములుఁ బదియాఱును బంచమాక్షరములుఁ బాసినస్పర్శములును
హ్రస్వంబు లగుతటి నాదిత్యగతు లగుఁ జాపు లైనపుడు భూజనగతు లగుఁ
జింతింప ననునాసికాంతస్థవర్ణంబు లరయ నెప్పుడును దిర్యగ్గతు లగు
శషసహాక్షరచతుష్టయమును దొడ్డకారంబును గూడ రౌరవగతు లగుఁ

తే. గృతిమొదల నిల్పి సురగతు లీర్తిఁ జేయుఁ, మనుజగతులు విరోధినాశనముఁ జేయుఁ
గినిసి తిర్యగ్గతులు చాలఁ గీడుఁ జేయుఁ, బలికి రౌరవగతులు పాపంబుఁ జేయుఁ.

## వర్ణంబులకుఁ బ్రత్యేకఫలంబులు

ఆ. శుభకరంబు లాఱు విభవనాశదములు, నాల్గు కీర్తిదములు నాల్గు హాని
దములు రెండు వరుస దప్పక కావ్యంబు, మొదల నిలుపఁ బ్రాణములు హరించు.

సీ. ధనధాన్యసుతరాజ్యకనకంబులును యశోనాశనారోగ్యదైన్యప్రతాప
మరణంబులును దుఃఖమానభంగద్రవ్యరోగభద్రములును భోగయుద్ధ

1 దైవత (వా).

ధైర్యతేజఃపరితాపంబులును శౌర్యభీతినీరోగసంప్రీతివంశ
నాశనంబులును మానక కాదివర్గంబు లైదు నొసంగు కల్యాణదాహ
తే. ఖేదదీర్ఘాయువులు యకారాదు లిచ్చు,జయభయ శ్రీ సుఖంబు లూష్మము లొసఁగు
నాయు వల్పంబుగా దోడ్దళా యొసంగుఁ, గవికిఁ బతికిని బద్యాదిఁ గదియునపుడు.

## వర్ణంబులకు బీజచక్రము

సీ. నిలువుగీటులు పది నిలిపి రేఖాపట్క మడ్డంబుగా గీఁచి యాదిలిపులు
తొలిదొంతి క్రిందు క్రిందుల రెండురెండిడి రెండవదాన నొండొండు గూర్చి
కడపలిప్రాణంబు కడగ మున్న లిఖించి హెచ్చుళా దానిపైయింట నిలిపి
తరువాతిదొంతులధామంబులను గాదు లొక్కటొక్కటి క్రమ మొప్ప వ్రాసి
తే. యడ్డముగఁ జూడ నయ్యె వాతాగ్నిభూమి; జలఖబీజంబు లివి కావ్యములకు మొదల
నిలుప ఖేదార్తిధనహర్ష నిర్ధనంబు, లొసఁగుఁ గర్తకు భర్తకు నుదధిశయన. 274

## బీజాక్షరచక్రోద్ధారణము

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అఆ | ఏ | క | చ | ట | త | ప | య | ష | ఇవి ౧౧యు | వాయుబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఖేదమును జేయును. |
| ఇఈ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | ఇవి౧౧యు | అగ్నిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ఆర్తిని జేయును. |
| ఉఊ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | ఇవి౧౦యు | భూమిబీజాక్షరములు పద్యాదిని నిలిపిన ధనమును జేయును. |
| ఋౠ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | ఇవి౧౦యు | జలబీజాక్షరములు పద్యాదిని నిలిపిన హర్షముఁ జేయును. |
| ఌౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | అః | ఇవి౧౦యు | గగనబీజాక్షరములు పద్యాదిని నిలిపిన నిర్ధనమును జేయును. |

## ఊర్ధ్వముఖాధోముఖపార్శ్వముఖంబులు

తే. వటుప్రసుడు లూర్ధ్వముఖములు వక్రములును
గుదుసులు నధోముఖంబులు గడమపదియుఁ

భార్యా వ్యాముఖములు వరుసతోఁ బ్రాణహాని
ఖేదసంపద లొసఁగుఁ గావ్యాదినిలిచి. 275

## వర్ణంబులకు నమృతవిషంబులు

క. పరువడి హ్రస్వము లమృతా, క్షరములు కృతిమొదలఁ గూర్ప గదము లడంచున్
[1]ధర నిడుపులు విషలిపు లవి, గరళముఁగతి క్రింగుఁ బతిని గావ్యాది నిడన్. 276

## వర్ణంబులకు దుష్టనక్షత్రంబులు

క. పలికెడుకబ్బమునకు మొన, దల నెలకొనునక్రూరంబు తారకదగ్ధా
దుల నైదింటను దొరలక, వెలసిన నాయకున కింద్రవిభవం బబ్బున్. 277

## దగ్ధజ్వలితధూమితతారలు

తే. క్రూరఖేటము విడిచినతార దగ్ధ, యపుడు వసియించునది జ్వలితాఖ్య దాని
ముంగలిది ధూమితం బివిమూఁడుఁగృతికి, మొదలఁ[2]గదిసినమృతిదుఃఖగదము[3]లొదవు.

## మృతజీవరోగభంబులు

తే. సైంహికేయగ్రహాస్థితర్క్షంబుమీఁది, తార మొదలుగఁ బదుమూఁటిదనుక జీవ
యుతము లవతలి పన్నియు మృతము లిట్లు, త్రివిధముగఁ జెప్పఁబడియె విరించిజనక.

ఆ. తమ్మిచుట్టమున్నతారక మొదలుగ, మృతము లేను ప్రాణయంతము లర్క
పరిమితములు రోగభంబులు గూడంగ, నివి వసిష్ఠమతము యదుకులేశ. 280

క. కృతిమొదల నిలిచి చంపును, మృతనక్షత్రంబు చాల మే లొనరించున్
సతతంబు జీవతారక, పలికెఁ దెవులు సేయుం రోగభము నెలలొనన్. 281

## అవకాదవర్ణస్వరనిర్ణయము

### వరరుచిసంహితోక్తవచనంబులు

శ్లో. స్వరాః పంచవిధాః ప్రోక్తా ఆ, ఈ, ఊ, ఏ జితి క్రమాత్,
తైర్యుక్తా అవకాదవర్ణా ఏకైకం పంచధా భవేత్.
అవకహడా మటపరతా నయభజఖా శ్ఛథ గసదచలాః,
వర్ణా ఏతే భానా మేకైకం పంచధా క్రమశః.
ఐత్వ మౌత్వ మనుస్వారో విసర్గో వా [4]భవే ద్యథా,
సర్వస్వరాణాం మాతృత్వా దేతేషా మస్వరో భవేత్.

---

1 ధర నిడుపు విషము లిపు లవి (వా). 2 గదసిన (ప. వా). 3 లొసఁగు (ప).
4 భవే ద్యది (ప).

[1]ఋత్త్వేత్త్వయో ర్మిథో హ్రస్వదీర్ఘయో రైక్య ముచ్యతే,
యామళోక్త మిదం జ్ఞాత్వా వదేత్సర్వ బలాబలమ్.

క. తలకట్టులు గుడుసులు కొమ్ములు పెస నేత్వములు నోత్వములు, నవఁ బ్రాణం
బులు పంచవిధము లై హ్రల్లుల నెల్లను గూడుకొని నిలుచుఁ దారలకున్. 282

తే. అపకహడలును మటపరతాక్షరములు, నయబజఘగసదలచవర్ణములు వరుస
నిరువదియు స్వరపంచకాన్వితము లగుచుఁ, గృత్తికాదుల నాళ్గేసిపాత్తియుండు

తే. ప్రాణషోడశమునకు నాద్యస్వరంబు, జనని యగుటను బిందువిసర్గవక్ర
తమములకుఁ దాన యగునిడుదలకు నెల్ల, గుణిచలగు వట్రుసుడులకు గుడుసులగును.

నక్షత్రాధిపతులు

సీ. అశ్వినీప్రభృతుల కైదింటికిని దస్ర యమకీలిధాతృనీహారకిరణు
లార్ద్రాదులకు శంకరాదితిచిత్రశిఖండిసంభవభుజంగమ[2]పితలును
నిజముపూర్వాఫల్గునీముఖ్యములకు భగార్యమార్కత్వష్ట్రహరిణహయులు
మఱి విశాఖకు శతమఖవహ్ను లిద్దఱు పిదప ననూరాధ మొదలుగాఁగ

తే. నాలుగింటికి మిత్రేంద్రనైరృతాంబు, లుత్తరాషాఢనుండి యష్టోడువులకు
విశ్వవిధివిష్ణువసుతోయ విభువిరించి, పాదహిర్బుధ్న్యపూషులు పతులు కృష్ణ. 285

క. ఏతారకు నెవ్వఁడు విభుఁ, డాతని నామంబు లెల్ల నాతారకుఁ బ్ర
ఖ్యాతముగాఁ జెప్పంబడు, జ్యోతిశ్శాస్త్రంబునందు సుమనఃస్తుత్యా. 286

వర్ణంబులకు నక్షత్రంబులును రాసులును నెఱుంగు తెఱంగు వివరించెద.

కాలజ్ఞకలోప్తశ్లోకంబులు.

శ్లో. అకారః కృత్తికా మేష ఈ, ఊ, ఏ కృత్తికా వృషః,
ఓ, వా, వీ, వూ, ధాతృవృషౌ వే, వో, మృగవృష స్తథా.
కా, కీ, మృగశిర యుగ్మం కూ, ఘం, జం, ఛ, శివాయుగం,
కే, కో, హా, అదితిద్వంద్వం హీ, సురాంబాశికుళీరకాః.
హూ, హే, హో, డా, పుష్యకర్కి డీ, డూ, డే, డో, హికర్కటః,
మా, మీ, మూ, మే, మఘాసింహౌ మో, టా, టీ, టూ, భగేభభుక్.
టే, ఉత్తరాభవార్యక్షో, టో, పా, పీ, ఉత్తరా వధూః,
పూ, ష, ణా, ఠా, హస్తకన్యే పే, పో, చిత్రా కుమారకా.

1 ఋత్వేత్వయో (వా). 2 పితరులు (ప. వా). 3 కుళీరగః (ప. వా).

రా, రీ, చిత్రా తులారాశీ రూ, రే, రో, తా, మరుత్తులా,
తీ, తూ, తే, వైశాఖతాలీ తో, సశాఖా సరీసృపః.
నా, నీ, నూ, నే, మైత్రికీటో నూ, యా, యీ, యూ, స్వరా దవిః,
యే, యో, బా, బీ, దైత్యచాపో బూ, ధా, ఫా, డా, జలం ధనుః.
బే, విశ్వేదేవకోదండో బో, జా, జీ, విశ్వవాశ్చ్యపః,
జూ, జే, జో, ఖాభిజిన్నక్రో ఖీ, ఖూ, ఖే, ఖో, హరిగ్రహః,
గా, గీ, ధనిష్ఠామకరో గూ, గే వసుపయోధరః,
గో, సా, సీ, సూ, శతభిష గ్ఘటరాశి రుదాహృతః.
సే, సో, దా, [1]అజరాట్కుంభో ధిఅజైకపదో ఝషః,
దూ, శా, ఝా, దా అహిర్బుధ్న్యతారా క్షేత్రం తిమింగిలః.
దే, దో, చా, చీ, పౌష్ణతారా రాశిః పాఠీనసంజ్ఞికః,
చూ, చే, చో, లా అశ్వినీ ఖా లీ, లూ, లే, లో భరణ్యజః.

వ. వెండియు వీనికి నాదేశంబు లగునక్షరంబులు గల వచియుసుం జెప్పెద 228

శ్లో. [2]ఘూశౌరార్ద్రార్క్ష ద్వితీయేంఘూర్ వహిర్బుధ్న్యతృతీయకే,
డకారో జలభ స్యాంతే తద్వితీయేఽథ కారకః.
భవర్ణక స్తత్తృతీయే ఏతే వర్గ చతుర్థకాః,
ద్వితీయే హిర్బుధ్న్యభస్య ప్రథమోష్టాక్షరం విదుః.
రౌద్రాహిర్బుధ్న్యతో యాన్య సక్షత్రాణాం మనీషిభిః,
ద్వితీయాది త్రిపాదేషు యే వర్ణాః కీర్తితాః పురా.
తేషా మేకైకవర్ణ స్స్యా త్సర్వస్వరసమన్వితః,
మాతృత్వా దస్వర స్తేషా మేక ఏవ ప్రకీర్తితః.
ఆద్యద్వితీయవర్గానునాసికాక్షరయో ర్మిథః,
భేదో నాస్తి మిథ స్తద్వ దంత్యవర్గసమూర్ణయోః.
యత్ర తిష్ఠంతి నామాదౌ సంయోగవ్యంజనాక్షరాః,
తత్రాదివ్యంజనం గ్రాహ్య మి త్యుక్తం బ్రహ్మయామళే.

---

1 అజపాట్కుంభో (వ. వా).

2 ఘూశౌరార్ద్రేష ద్వితీయర్క్షాగ్ఘహిర్బుధ్న్య (అచ్చుప్రతి).

రేఫాన్వితాక్షరో యత్ర నామాదౌ నృపభృత్యయోః,
ధనధాన్యాయ దంపత్యోర్గ్రాహ్యో రేఫస్తు నేతరః.

తే. హాపునిరిక్క రెండవకాల నవలిభాద్ర, మూఁడవపదంబునను నలిశోడునునకు
నబ్ధినేత్రకృశానుసంఖ్యాంఘ్రులందుఁ, గ్రమత వర్గచతుర్థాక్షరంబు లమరు. 289

క. జలరవిశివోత్తరాభా, ద్రలతొలి పాదములఁ దక్కఁ దక్కిన మూఁటన్
గలిపుల కేస్వరంబులు, తల నిలచిన నొకటి గాఁగఁ దలఁపఁగ వలయున్. 290

క. మించి ప్రథమానునాసిక, మెంచఁ జవర్గాంత్యమునకు నెల్లెడఁ జెల్లున్
బంచమవర్గచతుర్థము, వంచింపక స్వద్వితీయవర్ణమున కగున్. 291

క. పతినామాద్యవర్ణమునకుఁ, గృతిముఖమున నుండువ్రాయుకిని గీర్వాణ
స్తుత ద్విత్వము లున్న నధో, గతము లఁడిగి మీఁదిమాత్రకయ కొనఁటొప్పున్. 292

క. నామాది నుండువర్ణము, దామోదర రేఫసంయుతం బై యున్నన్
యామాళమునందు రేఫం, బే మిక్కిలి గ్రాహ్య మనుచు నెన్నంబడియెన్. 293

## నాయకాక్షరకూటంబులు

తే. నేతృనామాది నుండెడి మాతృకకును, గావ్యముఖవర్ణమునకును గాంతిజాతి
చక్రగణయోనిలింగ[1]నక్షత్రయోగ, రాశిఖగమైత్రు లెఱిఁగి పూర్వంగ వలయు.

క. కృతులమున విధూవరులకుఁ, జతురత దైవజ్ఞమణి విచారించుగలిన్
గృతికన్యానాయకులకు, హితమతిఁ దెలియఁ దగు సుకవు లివి తొమ్మిదియున్. 295

## 1\. అక్షరకాంతికూటములు

తే. ప్రథమదశమచతుర్దస్వరంబు లెఱుపు, లసితరుచులు తృతీయసప్తాష్టమములు
పంచమైకాదశంబులు పచ్చపన్నె, లిందునిభములు తక్కినయెనిమిదియును. 296

సీ. శ్యామలశుభ్రశోణార్జునకృష్ణంబు లసితవినీలారుణాంజనాభ
కాళిమ లరుణశుక్లచ్ఛవిపీకసితేతరరక్తంబు లిందుకాంతి
హారిణమేచకహారిద్రాభపాండురములు సితకృష్ణధవళలోహితసుపర్వ
పతిశిలాభంబులు స్పర్శవర్ణములకుఁ గృష్ణారుణాసితక్షీరరుచులు
తే. నాల్గునంతస్థములకుఁ గుందనపుఁదేట, గెంపుటాచాయయును బవడంపుజిగియుం
మొల్లవిరిమిసిమియుం నూష్మములకుఁ దెలుపు, నెఱ శకారంబునకును పన్నియఁ లువరుస.
ఆ. విభుశరీరకాంతి వీక్షించి తత్కాంతి, గలుగునక్షరములు కావ్యములను
మొదల నిలుపఁ దేజ మొదవు వేఱొకచాయ, వర్ణ మిడినఁ దెవులు వచ్చు నిజము.

---

1 నక్షత్రదూర (పూ. ము).

క. శ్వేతము నీలము నేకము, భూతలమునఁ బీతరక్తములకు నభేదం
బై తనరుఁ గృతులయందును, నీ తెఱఁగునఁ దెలియ వలయు నిధపతివరదా. 299

## 2. అక్షరకులకూటము

సీ. ఆదిషోడశమును గాదిపంచాదశవర్ణంబులును ద్విజాన్వయభవములు
తపవర్గ మాతృకాదశకసమాంతస్థములు రాజగోత్రసముద్భవములు
తలపోయ నంతస్థములలోన దేసులు నూష్మంబులును విట్కులోద్భవములు
రదనజాతచేజోక్షరములును గురుఁజళల్ జగతి నంఘ్రిజవంశసంభవములు
తే. వీనిఁ దెలిసి కావ్యవిభుని దేజాతి యగ్రజాతియక్షరంబు సత్కవీంద్రు
లరసి కృతిముఖంబునందుఁ బొందించిన, నెసఁగు సకలశుభము లిరువురకును. 300

## స్నిగ్ధరూక్షాక్షరంబులు

ఆ. అధిపుకులమువ్రాయు యక్షరము వైనను, స్నిగ్ధ మయ్యె[1]నాదిసిరు లొసంగు
నన్యజాతిలిపి మహాప్రాణ మై రూక్ష, మనఁగ మొదల నిలిచి యునికిఁ బాపు. 301

## 3. అక్షరచక్రకూటము

సీ. అయి దూర్ధ్వరేఖలయందుఁ దిర్యగ్రేఖ లై ఇడి యెండ్లు పదాఱుఁ జేసి
యధిపనామాద్యక్షరాదిగా నచ్చులు హల్లులు గురుళకారాంతములుగ
సాద్యగ్నివారనిధిహస్తవేదాదిత్యదిగ్ సకరిస్ఫుపతిమునుబాణ
శైలవాసరవిశ్వసంఖ్యాలయంబుల లిఖియించి యామీఁదిలిపులు మరల
తే. వెనుకటట్టుల నిలిపి తక్కినవి రెండు, పదియును మూఁడవతావునఁ గుదురుపఱిచి
జగతి నరివర్ణశోధనచక్ర మిట్లు, వ్రాయఁగాఁ దగు నేఁబదివర్ణములను. 302

## 4. స్నిగ్ధాదిచక్రకూటము

సీ. [2]నాల్గింట్లు పైని గ్రిందను బ్రదక్షిణముగా జత గూడి యొక్కొక్కచవుకమయ్యె
నట్టిచౌకములు నాల్గవి క్రమంబున సిద్ధసాధ్యసుసిద్ధారిసంజ్ఞము లగు
నవి గాక యొక్కొక్కచవుకంబునను గల్గునిరవులు నాల్గును వరుసతోడ
క్షితి సిద్ధసాధ్యసుసిద్ధారు లన నొప్పఁగావునఁ గడచవుకంబునందుఁ
తే. గలగృహంబులు నాల్గింటఁగడపమూఁడు, చవుకములయందుఁ గడపలిసదనములను
బద్యముఖవర్ణములు గనుపట్టెనేని, పతికి నెటువంటిహితుఁడైనఁ బగర యగును. 303

---

1 నేని (పూ. ము). 2 నాల్గింట్ల (ప).

అరివర్ణచక్రోద్ధారణము

| | | | |
|---|---|---|---|
| ౧<br>ఎటర | ౨<br>అంణష | ౩<br>ఐతల | ౪<br>ఔతస |
| ౫<br>ఛబక్ష | ౬<br>గధఅ | ౭<br>జభఊ | ౮<br>ఘనఆ |
| ౯<br>ఔధశ | ౧౦<br>ఖదళ | ౧౧<br>ఓడవ | ౧౨<br>కథహ |
| ౧౩<br>ఞయఋౠ<br>ఌ ౡ | ౧౪<br>చఫఈ | ౧౫<br>ఝమఋ | ౧౬<br>జపఇ |

ఎఱ్ఱాప్రెగ్గడ తనకును, ఆరణ్యపర్వశేషము మొదలిపద్యమునకును, అక్షరచక్రము మాచుకొన్నందునకు తెలివిడి.

తెనుఁగున శబ్దాదిని యకారము లేదు గనుక నెఱ్ఱాప్రెగ్గడనామాద్యక్షర మచ్చుగనుక, ఎకారము అది మొదలుకొనియు వ్రాయఁగా పద్యాదివర్ణము, 'స్ఫుర దరుణాంశు' అన్నాఁడు గనుక ద్వితీయాక్షరమునందు మీఁదటియక్షరమే కార ణము గనుక సకారము సాధ్యపుచోకమునందు సాధ్యపుయింట నిలిచెను గనుక సాధ్య సాధ్యము మంచిది, యెవరికిఁ జూచినను ఇటువలెనే. 304

ఉ. చేరక యిట్లువ్రాసి తగ సిద్ధము సాధ్యము నా సుసిద్ధముగ్
వైరియుఁ గావ్యనాయకుని వర్ణగృహాదిఁ బ్రదక్షిణంబుగా
నారసి చూచి శత్రులిపు లన్నియుఁ బీడ్కొని భద్రమధ్య మా
దారశివప్రదంబులని తక్కినమాఁటి నెఱుంగఁగా నగున్. 305

## 5. అక్షర దేవారిగణకూటము

క. అరయ నామాద్యక్షర, తారాగణమును దదీశ తారాగణముగ్
వైరము నొందిన భర్తకు, ఘోరార్తి ఘటించు మైత్రిఁ గూడిన నొప్పున్. 306

శ్లో. ఆద్యగ్నిరుద్రగ్రహనేత్రవేద రవిర్దిశర్తు వసుషోడశశ్చ,
మన్వంతరే బాణతురంగవాసర త్రయోదశాస్యుః పదవర్ణమాహ. (వా) లోనే యున్నది.

### కాంతి ౧౧-౮౭౭

UU I త I U I జ I U I జ I U లగ

క్రాంతు ల్కారిసంఖ్యను ♦ రాజిలఁగా, సంతోషముతోడఁ ద♦జాలగముల్
చింతింపఁ బదంబులఁ ♦ జెంద రమా, కాంతాహృదయేశ్వర ♦ కాంతి యగున్.

### శ్యేని ౧౧-౬౮౩

U I U ర I U I జ U I U ర I U వ

మానితాద్రివిశ్ర♦మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ♦ఋ న్రవంబులన్
గాని యొండు గూర్పఁ ♦ గాదు రుక్మిణీ,ప్రాణనాథ కామె♦పల్లిమందిరా.

### వాతోర్మి ౧౧-౮౧౭

UUU మ U I I భ UU I త I U వ

ఆమోదం బొప్పఁగ ♦ వ్యాసాదికవుల్, భూమిభృత్క్రాంతులు ♦ పొంగార మహీ
భామాప్రాణేశ మ♦భంబుల్ తవలున్, దా మీవాతోర్మిని ♦ దాపింతు రొగిన్.

### కలితాంతము (గీతాలంబనము) ౧౧-౮౭౭

UU I త I U I జ I U I జ I U లగ

సామోద్భవవిశ్ర♦మసంయుత మై, వేమాఱు తజాలగ♦విస్తృత మై
దామోదరదేవుక♦థ ల్పలుకన్, భూమిం గలితాంతము♦పూర్ణ మగున్.

### శాలిని ౧౧-౨౮౯

UUU మ UU I త UU I త UU గగ

ధీరశ్రేష్ఠు లన్ను♦తింపం గవీంద్రా,ధారం బై ధాత్రి న్మ♦తాగాగణాప్తిన్
దోరం బై భూభృద్య♦తుల్ సంఘటింపన్, నీరేజాక్షా శాలి♦నీవృత్త మొప్పున్.

### సుముఖి ౧౧-౮౮౦

I I I న I U I జ I U I జ I U లగ

ఖగపతివాహ ♦ కపర్దినుతా, మృగపతిమధ్య ♦ హితార్తిహరా
నగవిరమం బె♦నయంగ నజా, లగములచేఁ జె♦లఁగు న్సుముఖుల్.

### భ్రమరవిలసితము ౧౧ ౧౦౦౯

UUU మ U I I భ I I I న I U వ

ఏయంఘ్రిం బార♦యి మగణభన, ల్వాయొక్కం డవ్వా♦లను నెలకొనన్
మాయాతీతా భ్ర♦మరవిలసితం, బై యొప్పుం బర్కా♦యతుల నిలుచున్.

### వృత్త ౧౧-౨౮౮

I I I న I I U స U U I త U U గగ

అనయమును వే•దాంగంబు నెప్పఁగన్, దనుజహర న•స్తంబు ల్గగంబుగన్
బెనఁగొని ధరా•భృద్విశ్రమంబుల్, దనరునది వృ త్తావృత్త మంచున్.

### పృథ్వి ౧౧-౮౯౬

I I I న I I I న I U I జ I U వగ

నలినభవనుత • నాజలగం, బులు గజయుతులఁ • బొందుపడం
బెలుచఁ బలికినఁ•బృథ్వి యనన్, వెలయుం నొకసమ•వృత్త మిలన్.

### వృంత ౧౧- ౨౫౬

I I I న I I I న I I U స U U గగ

నగణయుగము సగ•ణం బొందఁగన్, గగ మొకటియు జత•గాఁ గూడన్
ఖగవిరమములను•గల్పింపన్, దగుఁ గవులకు వసు•ధ న్వృంతల్.

### మౌక్తికమాల ౧౧-౪౮౭

U I I భ U U I త I I I న U U గగ

భక్తజనత్రాత • భతనగాసం, యుక్తము లై మాని•యుంతయతుల్ సు
వ్యక్తము లై సూక్తు•లమరఁ జెప్పన్, మౌక్తికమాలాక్ర•మము దెసంగున్.

### ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

I U I జ I I U స U U I త U U గగ

ఉపస్థితమునం • దొప్పారుచుండున్, దపస్వివిరతు • ల్దాకం జకారం
బుపై సతగణం•బు ల్గద్వయంబున్, గపిధ్వజసఖా • కామేశలీశా.

### ఏకరూప ౧౧-౩౯౬

U U U మ U I I భ I U I జ U U గగ

విహారుం గావ్యముల • నేకరూపల్, క్ష్మాపుత్రీశున్ మభజ•గాగణంబుల్
శ్రావించుం గుంజరవి•రామ మొప్పన్, బాదంబుల్ వ్రాయుటకుఁ•బ్రస్తరింపన్.

### చంద్రిక ౧౧-౭౦౪

I I I న I I I న U I U ర I U వ

అగవరధర సార•వాన్వితం, బుగఁ గృతులను జెప్పఁ • బొందికై
తగ నిధివిరమంబు •దాఁకఁగా, జగతిని దగ డొందుఁ • జంద్రికల్.

౫. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసియక్షరంబు లై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

### స్రగ్విణి ౧౨-౧౧౭౧

∪ I ∪ ర ∪ I ∪ ర ∪ I ∪ ర ∪ I ∪ ర

కామెపల్లీ మహాగ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ల్పూజ సేయంగ నా
స్వామి యుండ్నాఁ డనన్ స్రగ్విణిన్ శైలవి
శ్రామయుక్తిం జతుష్కం బగున్ రేఫముల్.

### భుజంగప్రయాతము ౧౨-౫౮౬

I ∪ ∪ య I ∪ ∪ య I ∪ ∪ య I ∪ ∪ య

భజింతున్ సదా కామెపల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాదవశ్రేష్ఠ నంచున్
భుజంగప్రయాతాఖ్యము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతిగాఁ జెప్ప నొప్పున్.

### తోటకము ౧౨-౧౭౫౬

I I ∪ స I I ∪ స I I ∪ స I I ∪ స

తగుఁ దోటకవృత్తము ధాతృయతిన్, సగణంబులు నాలుగు సొగిసఁ బ
న్నగపుణ్యనదీసుర నాథదిశా, జగతీద్విజపట్టణ సంచరణా.

### జలధరమాల ౧౨-౨౪౧

∪∪∪ మ ∪ I I భ I I ∪ స ∪∪∪ మ

ధీరుల్ మెచ్చం గృతుల నతిశ్రీదం బై, మారాకారా జలధరమాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతురాస్యశ్రాంతుల్, సారం జేరన్ మభసమసంయుక్తంబై.

### వంశస్థము ౧౨-౧౩౮౨

I ∪ I జ ∪∪ I త I ∪ I జ ∪ I ∪ ర

జతల్ జరేఫంబులు సామజాతస, మ్మితాక్షరశ్రాంతుల మెప్పు పుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ బద్మలోచనున్, నుతింప వంశస్థ మనూనమై చనున్.

### ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

∪∪ I త ∪∪ I త I ∪ I జ ∪ I ∪ ర

ఇందీవరాక్షుల్ తగ నింద్రవంశ మూ, నందంబునం బాడిరి నందసూతిపై
డెందంబుల న్మోహము లేవ మీఱఁగాఁ, బొందై గజశ్రాంతులు పూనఁ దాఁజలన్.

### ద్రుతవిలంబితము ౧౨-౧౪౬౪

I I I న U I I భ U I I భ U I U ర

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యుతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తిహ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

### తోదకము (తామరసము) ౧౨-౮౮౦

I I I న I U I జ I U I జ I U U య

లలితతోదక•సామజవిక్రాం, తులను నజాయలఁ•దోదకవృత్తం
బలవడుఁ గేశవ•రాసురకాష్ఠో, జ్జ్వలనవకోశర•సాస్థలవాసా.

### ప్రియంవద ౧౨-౧౪౦౦

I I I న U I I భ I U I జ U I U ర

విభు శమీరపృథు•వీజరతు భా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను•బ్రస్తుతింప నౌ, నిభవిరామమున•నీప్రియంవదల్.

### ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

I I U స I U I జ I I U స I I U స

ప్రమితాక్షరం•బమరుఁ బద్మజవి, శ్రమొప్పమీఱ•సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ•భద్రయశా

### జలోద్ధతగతి ౧౨-౧౮౮౬

I U I జ I I U స I U I జ I I U స

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమాఱు•మెచ్చుగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర•కామజనకా.

### విశ్వదేవి ౧౨-౫౭౭

U U U మ U U U మ I U U య I U U య

శ్రీవత్సాంకా పద్మాధ•రిత్రీ కళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం [జెప్పన్.
బైవిశ్వాండు మ్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ:

### చంద్రవర్త్మ ౧౨-౧౯౭౯

U I U ర I I I న U I I భ I I U స

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు•శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

## ప్రహేయము ౧౨-౫౭౬

I I I న I I I న U U U మ I U U య

కరివిరమణముల్ • గా నామయంబుల్, బరఁగ నిలుపఁ జా•పట్టుం బ్రహేయం
బురగశయన భో•జోర్వీశపుత్రీ, వర పరమకృపా•వారాశి కృష్ణా.

## ప్రముదితవదన ౧౨-౧౨౧౬

I I I న I I I న U I U ర U I U ర

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరములన్ • సదా చెన్నగున్
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా.

## కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

I I I న I U U య I I I న I U U య

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదం బై • యగయుతు లున్నం
దతనయ యొప్పున్ • నయ లినుమా రై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్.

## మణిమాల ౧౨-౭౮౧

U U I త I U U య U U I త I U U య

శ్రీ మేపలినామ•గ్రామస్థలవాసా, స్వామీ తయకార•ద్వంద్వంబు పొసంగన్
వేమాఱుమహీభృ•ద్విశ్రాంతులతో డన్, భూమండలిఁగూర్పఁ•బొల్చున్మణిమాలల్.

## మేఘవిలసితము ౧౨-౨౦౪౧

U U U మ I I I న I I I న I I U స

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నత రసవిరతు
ల్గాల న్మేఘవి•లసితము దనరు, న్వ్యాళాయంబు మ•ననసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

## మత్తమయూరము ౧౩-౧౬౩౩

U U U మ U U I త I U U య I I U స U గ

శ్రీగోపాలా కంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ•యూరంబున కొప్పున్
నాగక్రాంతు ల్మతయగ•ణంబు ల్సగ మొందన్.

### ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

U U U మ I I I న I U I జ U I U ర U X

ధీరుల్ సింధురవిర•తిన్ మనజ్రగంబుల్, సారెం బాదములను•సంఘటించుచుండన్
గ్రూరారిప్రహరుస•కుం బ్రహర్షణుత్వం, పారం జెప్పుదురు మ•హామదంబుతోడన్.

### ప్రభాతము ౧౩-౧౩౯౨

I I I న I U I జ I U I జ U I U ర U X

మొనసి నజారగ•ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస•మూహవిశ్రమంబుల్
ననరఁగ నిల్పెఁ బృ•దాకురాజతల్పా, కనకమయాంశుక • కామెపల్లివాసా.

### జలదము ౧౩-౩౫౪౩

U I I భ U I U ర I I I న U I I భ U X

బంగరుచుంగుపచ్చడము • పైఁ గలయా, తంగెడదేశవాసు జల•దంబులచే
తం గడుసన్నుతింతు నవ• తారయుతిన్, బొంగుచు సారె భర్నభగ•ముల్ గదియన్.

### మంజుభాషిణి ౧౩-౨౭౯౬

I I U స I U I జ I I U స I U I జ U X

ఉరగాపగాదివారి•దుర్వరాలయా, కరుణాసముద్ర మురగ•ర్వభంజనా
యిర వొందుచుండు సజ•లిబ్బడింపఁ బల్మరు గాత్రి ధాత్రియలి•మంజుభాషిణుల్.

### రుచిరము ౧౩-౨౮౦౬

I U I జ U I I భ I I U స I U I జ U X

గదాధరున్ జభసజ•గంబులన్ గవ్రల్, సదా పితామహయలి•సాగుచుండఁ గా
ముదంబుతోడ రుచిర•ము ల్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల • నుర్వరాస్థలిన్.

### *క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

I I I న I I I న U U I త U U I త U X

క్రమమున నిభని•క్రాంతి సాతాగయు, క్తముగ సుకవి ప•ద్యంబు లూహించినన్
క్షమ లనఁ బరఁగుం • గంజపత్రేక్షణా, సుమశరజనకా • శూరవంశోత్తమా.

### చంచరీకావళి ౧౩-౧౧౫౩

U U U మ U U U మ U I U ర U I U ర U X

కంబుగ్రీవా సత్యా•కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ•శ్చేద్భిభూభృద్ద్యతుర్గాం
చం బాదంబై ధాత్రిం•జంచరీకావళీనా, మం బొందుంగావ్యశ్రీ•మానినీభూషణంబై.

---

* సంజ్ఞల పట్టికలో క్షమ, క్షప యనునవి భిన్నవృత్తములుగా గణింపఁ బడినవి.

### మత్తహంసిని ౧౩-౨౭౯౦

I U I జ U U I త I I U స I U I జ U గ

మనోహరాకార • మధుదైత్యసంహరా, వినాయకారూఢ • విబుధేంద్రవందితా
జనార్దనా జస్స•జగురుల్ శుభృద్యతిఁ, దనర్చుపద్యంబు•దగు మత్తహంసినిన్.

### సుమంగలి ౧౩-౧౭౭౨

I I U స I U I జ I I U స I I U స U గ

సారిదిఁ ధరిత్రిని • సుమంగలివృత్తం, బరయంగ సామజ • యతిఁ సజసాగల్
లిర మొంద నొప్పు వి•ధిపూజితపాదాం, బురుహద్వయా ఖర•మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసి యక్షరంబులై
౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

### వనమయూరము ౧౪-౩౮౨౩

U I I భ I U I జ I I U స I I I న U U గగ

శ్రీకర ధరాధిధర•జిష్ణునుత పుణ్యా, శ్లోక భజసన్నగగ•లుఁ ద్రుహిణసంఖ్యఁ
సోఁకువిరమంబుగను•చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల•నత్తమిలుచుండున్.

### వసంతతిలక (సింహోన్నతము, ఔద్ధర్షిణీ, శోభావతి, మధుమాధవి) ౧౪-౨౯౩౩

U U I త U I I భ I U I జ I U I జ U U గగ

శ్రీమేదినీరమణ•సింధుతరంగరంగ, ధ్రామాహితల్ప విన•తాసుతవాహ రాధా
కామా వసంతతిల•కఁ దభజాగగంబుల్, సామప్రభూతయతి•సాగిధరం జెలంగున్.

### భూసుతము ౧౪-౩౫౧౫

U I U ర I I I న U I I భ U I I భ U U గగ

ముష్టరించి రనభాగగ•ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున • మానితమయ్యెఁ
జాంబవత్యధిప కేశవ•సారసనేత్రా, కంబునందకగదాధర•ఖండితసాళ్వా.

### సుందరి ౧౪-౫౮౧౫

U I I భ U I I భ U I U ర I I U స I U వ

సూరిజనప్రకరంబు • సుందరి సెన్నఁగా
భారసవంబులు రత్న • భాసితవిక్రమా
ధారముగాఁ దనరారుఁ • దార్క్ష్యతురంగమా
శౌరి ముకుంద మునీంద్ర • సన్నుత కేశవా.

### ప్రహరణకలిత ౧౪-౮౧౨౮

I I I న I I I న U I I భ I I I న I U వ

వనిఁగొను నెపుడుం ♦ బ్రహరణకలితన్, ననభనవలు మం ♦ దగజవిరమమున్
ఘననిభఘనవి ♦ గ్రహ బకమురమ, ర్దన మధునరక ♦ ప్రహరణకలితా.

### నవనందిని ౧౪-౩౮౨౦

I I U స I U I జ I I U స I I I న U U గగ

నవనందినిన్ సజస ♦ నస్సగగ లాయెన్, నవవిశ్రమంబును ద ♦ నర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జ ♦ నార్దను నుపేంద్రున్, శివదూరు నెంతురు స ♦ భాసదులు భక్తిన్.

### అపరాజితము ౧౪-౫౮౨౪

I I I న I I I న U I U ర I I U స I U వగణము

ననరసలగ లొంది ♦ న స్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర ♦ భూషిత మై జనా
ర్దన నిగమసుగోచ ♦ రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య ♦ మై వినువారికిన్.

### అసంబాధ ౧౪-౪౦౬౫

U U U మ U U I త I I I న I I U స U U గగ

వాలాయంబున్ సత్కవిజనములు ♦ వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధ్రు ♦ వవాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ ♦ గప్రాప్తిన్
జ్వాలాభాస్వద్విశ్రమమునను న ♦ సంబాధన్.

### కమలవిలసితము ౧౪-౪౦౯౬

I I I న I I I న I I I న I I I న U U గగ

క్రమమున నననన ♦ గగములు గూడన్, గమలవిలసితము ♦ కమలజవిశ్రా
మము జగతిని నగ ♦ మహితచరిత్రా, కమలదళనయన ♦ కడుఁ బొగడొందున్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునై దేసి యక్షరంబు లై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

### మాలిని ౧౫-౪౬౭౨

I I I న I I I న U U U మ I U U య I U U య

కనకకశిపుహర్తన్ ♦ గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ ♦ ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ ♦ మాలినీవృత్తమందున్
ననమయయగణంబుల్ ♦ నందివిశ్రాంతి గూడన్.

## సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

I I I న I U I జ U I I భ I U I జ U I U ర

సురుచిరధర్మమూల మయి • సొంపు మీఱు నా, గిరిధరనాభిపంకజు • కేసరంబునై
ఖరి నజభద్రజము ల్గదియఁ • గల్పనంబునన్, గిరిశవిరామసంగతి సు • కేసరంబునన్.

## మనోజ్ఞ ౧౫-౧౧౬౩౨

I I I న I U I జ I U I జ U I I భ U I U ర

అజమృడవాసవసంత • తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి • కారు మనోజ్ఞ నా
బుజు వగువృత్తమునందుఁ • బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు • నచ్చిన దిగ్యతిన్.

## మణిభూషణము ౧౫-౧౧౭౦౭

U I U ర I I I న U I I భ U I I భ U I U ర

వింత యైనమణిభూషణ • వృత్తమునందు న
త్యంత మోదమున నెన్నను • నద్దశవిక్రమా
క్రాంత మైన రనభారలఁ • గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు • నార్యసమూహముల్.

## సుగంధి(*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౦౯౨౩

U I U ర I U I జ U I U ర I U I జ U I U ర

రంబు జంబు రంబు జంబు • రంబు నెత్తుమీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు • తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పు • గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవుఁ • డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

## ఇల ౧౫-౧౬౩౬౪.

I I U స I U I జ I I I న I I I న I I U స

గజవిక్రమంబునఁ • గనలు నిల యనఁగా, సజనాస లుండిన • సకలకవికృత మై
భుజగాశనధ్వజు • భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ • వనజహితుఁ బొగడన్.

---

* ౧౧-వ ఛందములో మఱియొక శాలినీవృత్తము గలదు. (229 పుట).

## చంద్రరేఖ ౧౫-౪౬౨౫

U U U మ U | U ర U U U మ | U U య | U U య

మత్తేభక్రాంతిచే ర•మ్యం బౌ మహిం జంద్రరేఖా
వృత్తంబై ప్రవ్యయంబుల్ • వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
క్షత్త న్నారాయణు న్వి•శ్వామిత్రయాగారిదైత్య
క్షిచ్ఛిత్తి ద్దాశార్హు లక్ష్మీ•చిత్తాబ్జవాసు న్నుతింపన్.

## నలిని ౧౫-౧౪౦౪౪

| | U స | | U స | | U స | | U స | | U స

సగణాసలచే దశవి•శ్రమయు_క్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికం•ఋసుదర్శనహ
స్తసరోరుహు వామను:గే•శవు శౌరినజున్, వసుదేవన్రుపాలతనూ•భవుఁ బాడుదుకా.

## అలసగతి ౧౫-౭౬౪౮

| | | న | | U స | | | న U | | భ | U U య

అలసగతి నాఁ జను స•భాంతరమునందు, న్నలసదవతారయతి • నిండి నసనభ్యల్
గలయు శకటాసురవి•ఘాతను విశిష్టున్, బలుమఱుఁ గపీశ్వరులు•ప్రార్థనలుసేయన్.

## మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

| | | న | | | న | | | న | | | న | | U స

మణిగణనికరము • మనులఘుగురు వై, మణివిరమణ మయి • మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ • బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభు•ని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగుఅష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై
౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

## ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

| | | న | U U య | | | న | U U య | | U స U గ

అమరులు భృత్యు_త్తనయ వి • యద్గంగ ధరిత్రీ
కమలలు [1]పెండ్లాములు రవి • కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని • చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ • మై న్యన్యసగం బై.

## పంచచామరము ౧౬-౨౧౮౪౬

| U | జ U | U ర | U | జ U | U ర | U | జ U గ

జరజ్రజంబులున్ గముం బొ•సంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కృపు ల్స•విస్తరంబు సేయఁగాఁ

1 పెండ్లాములు.

బరాత్పరుండు మాధవుండు • పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులందుఁ • బాడ నొప్పు ధాత్రిలోన్.

## పద్మకము ౧౬-౨౩౮౧౬

I I I న U I I భ I U I జ I U I జ I U I జ U గ

నభజజాగగణయుక్తిఁ బి•నాకివిరామక
ప్రభవమై కృతుల నొప్పును • బద్మక మందమై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి సు•రక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున • మానిత మై ధరన్.

## చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౯

I U U య U U U మ I I I న I I U స U I U ర U గ

క్షమం జంద్రశ్రీతో యమనసర•గ ల్భానువిశ్రా
మమౌన్ సంబంధించు న్నరహరి ర•మాచిత్తచోరా
శమీరయామ్యాగారా శమనసహ•జానాథ కృష్ణా
ప్రమత్తక్రవ్యాదక్షణవశన • రాధాభుజంగా.

## మేదిని (వాణి) ౧౬-౧౧౧౯౮

I I I న I U I జ U I I భ I U I జ U I U ర U గ

మృదయతి నజ్భజర్గములు • మేదినీసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు • దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత • సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి • గావు మయ్య దేవా.

## ఫలసదనము ౧౬-౧౬౩౯౮

I I I న I I I న I I I న I I I న I I U స U గ

ననననసగములు ద•నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల•లితశయ మగుఁజెప్పన్
మునిజనహృదయముల•మును బొలుచువానిన్
గొనబుగ ముదమొదవఁ • గొలిచెద మటంచున్.

## అశ్వగతి ౧౬-౨౯౦౯౭

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ

అందము లైనభకారము • లైదును గాంతము నై
పొంది పదింట విరామముఁ • బూనినయశ్వగతిం
గందసమానమహోన్నత•గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జుమీ.

### మదనదర్పణము ౧౬-౨౧౮౫౫

U I I భ I I U స I U I జ U I U ర I U I జ U గ

చారుమదనదర్పణంబు భ♦స్సరజ్జము ల్దగన్
మారవిమతవిశ్రమంబున ♦ న్మహిం జెలంగు నా
భీరుల యమునాతటంబునం ♦ బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ♦క్తి సన్నుతింపఁగా.

### గజవిలసితము ౧౬-౩౨౭౨౭

U I I భ U I U ర I I I న I I I న I I I న U గ

బాల సరోజనాభ ♦ వరద తనుమిళితజం, బాల దిగంబరా స♦మస్తృణకబళకర లం
బాలక మంగళావ♦హా గజవిలసితమున,న్నాలు *భరేఫనల్ న♦నగములిభ విరమ మై.

వ. సప్తదశచ్ఛందం బగుఅత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునేడేసియక్షరంబు లై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

### శిఖరిణి ౧౭-౫౯౩౩౦

I U U య U U U మ I I I న I I U స U I I భ I U వ

భజింతు న్నిత్యంబు న్నిజజనసదా♦ప్రార్థనపరున్
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా♦గ్రావు నజరున్
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ ♦ విశ్వవిరతిన్
బ్రజాతాహ్లాదం బై శిఖరిణియు నా ♦ భాసుర మగున్.

### పృథ్వి ౧౭-౩౮౭౫౦

I U I జ I I U స I U I జ I I U స I U U య I U వ

జసల్ జసయవంబు లుష్ణకర♦సాఖ్యవిశ్రాంతులున్
బొసంగి కవిపుంగవుల్ పలుక ♦ భూమిలోఁ బృథ్వి నా
నసంశయ మగుం గళిందతన♦యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత♦పరశ్వధా మాధవా.

### హరిణి ౧౭-౪౬౧౧౨

I I I న I I U స U U U మ U I U ర I I U స I U వ

హరిణి యనువృత్తం బొప్పు న్నాభస్క♦రాత్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ♦శ ప్రమదాసహా

---

*పూర్వముద్రణమునందు భరేఫనాసనగము లనియున్నది. దీనిఁబట్టి పైఁదను ర, న, న, న, న. గ లీ పద్యమున కుండ నట్లు గుర్తింపఁబడినది, పద్యమున భ, ర న, న, న, గ లుమాత్రమే కలవు.

స్త్రీరమణుఁ దృణావర్తక్రవ్యాద॰సంహారు మస్తో
ష్ఠిరుచిరపింఛాచూడుం బీత॰వస్త్రు నుతింపఁగా.

### [1] నర్కుటము (కోకిలకము) ౧౭-౫౬౨౪౦

I I I న I ∪ I జ ∪ I I భ I ∪ I జ I ∪ I జ I ∪ వ.

కొలిచెన నాదిదేవుపద॰కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబాముసఁ గు॰మర్పుడు సె ప్పఁడుఁజం
దలఁచెద నామధేయ మతి॰శత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబులను ॰ భద్గవిరామముఁ న్.

### మందాక్రాంత ౧౭-౧౮౯౨౫

∪ ∪ ∪ మ ∪ I I భ I I I న ∪ ∪ I త ∪ ∪ I త ∪ ∪ గగ.

మందాక్రాంత న్గిరిశవిరతు ॰ ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్నాందీపునివలన సం॰పూర్ణవిద్యాచయాంబుల్
మ్రందించె న్దారుణరణమునం ॰ బౌండ్రసాళ్వాదులం జే
యందెం జేరెం దడుకులకు నం॰దాత్మజుం డంచుఁ జెప్పన్.

### పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

I I I న I I I న I I I న I I I న I I I న ∪ ∪ గగ.

అదనదనున హరిసుతు ॰ లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి॰జనులు వచియింపన్
బదునొకఁ డగుచెడ యతి ॰ పదిలమునఁ జేరన్
గదియం నగణము లయిదు ॰ గగము తుద నొందన్.

### వంశపత్రపతితము ౧౭-౬౪౯౮౩

∪ I I భ ∪ I ∪ ర I I I న ∪ I I భ I I I న I ∪ వ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ ॰ భరనభనలగల్
సాగి పినాకివిక్రమములన్ ॰ సభలఁకుఁ గుదురై
రాగిలు వంశపత్రపతిత ॰ ల్రణమున నరకు
న్రాగతనంబునం దునిమె నం॰దతనయుఁ డనిసన్.

---

[1] సంస్కృత ఛందమున "నర్దటక" మని పేరు.

## చంపకకేసరి ౧౭-౪౯౬౭౨

I I U స I U I జ I I U స I I U స I I U స I U వ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియుం నిర్వికా
ల్పు నమేయుం నక్షరు వి•భు న్యమళార్జునభంజనున్
వనమాలిఁ గృష్ణు ముర•భంజను గొంతురు వారిజా
సనవిశ్రమంబు నజ•సాస్వలు చంపక కేసరిన్

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబులై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

## మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

U I U ర I I U స I U I జ I U I జ U I I భ U I U ర.

అత్తమిల్లు మహేశవిశ్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
నత్తు లా రసజాభరేఫలు • చౌకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్పవచ్చు జ•నార్దనాహ్వయుం జెప్పుడున్.

## కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౦౫౭

U U U మ U U I త I I I న I U U య I U U య I U U య.

వేమా జెన్నొంగాఁ గుసుమితలతా•వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్తండక్రాంతియుఁ గుదిరినం • జెన్నుమీఱు న్ధరిత్రిన్
గామేవల్లీశుం గనకవసనుం • గంజనేత్రున్ శుభాంగున్
గోమద్భాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశున్.

## నిశి ౧౮-౭౪౯౪౪

I I I న I I I న U I U ర U I U ర U I U ర U I U ర.

ప్రబలు నిశను నార•రారంబులున్ బ్రత్నవిశ్రాంతియున్
గబళితదవపావ•కా పూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వ బలిదమన వంద్య • బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

## హారనర్తనము ౧౮-౯౦౯౭౧

U I U ర I I U స I U I జ I U U య U I I భ U I U ర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనందనా•దివిషద్వంద్యా•*ధ్రువసన్నుతా

---

* ఇట యతిభంగము.

భావగోచర విశ్వరూ • ప దగు స్వాత్రు • వ్వ నవర్తుసం
ఖ్యావిరామము రేఫస • జ్యభరేఫాఖల్ • హరన ర్తసన్.

### త్త్వాహారము ౧౭-౩౦౭౪౧

U U U మ | | | స | U U య U U | త | | | న U U U గ.

బాహాబాహిని దమ్మో • భ్రాతల్ దొడ్డ • పగలఁ బోరాడం
గా హంవీరుఁ డగుబుభు • త్త్వాహానుక్ జ • గతిని గూలం గా
నాహా యేసిననరపా • లా రత్నేషు • ముకులు హొందంగా
త్త్వాహారంబు మనయక • న్మంబుల్ చెంది • మనుచు నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బాదొమ్మిదేసి యక్క
రంబు లై ౧౯౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

### శార్దూలవిక్రీడితము ౧౯-౧౪౯౩౩౭

U U U మ | | U స | U | జ | | U స U U | త U U | త U గ.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • హర్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ • హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము • న్శార్దూలవిక్రీడితన్.

### తరళ ౧౯-౧౮౬౦౪౦

| | | న U | | భ U | U ర | | U స | U | జ | U | జ U గ.

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబులందుల • భానువిశ్రుతపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ • కట్టి చెప్పుదు రుత్తముల్.

### మేఘవిస్ఫూర్జితము ౧౯-౨౫౨౧౪

| U U య U U U మ | | | న | | U స U | U ర U | U ర U గ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ • జాహ్నవీజాతపాదున్
సమామ్నాయ స్తవ్యున్ గరుడతురగున్ • సామజప్రాణదాతన్
మిముం దాఁ జేర్కొన్న న్సభలఁ దనరు • న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్మనసరరగము • ల్విశ్వవిశ్రాంతి చేతన్.

### చంద్రకళ ౧౯-౧౮౬౫౭౪

∪ | ∪ ర | | ∪ స | | ∪ స ∪ ∪ | త | ∪ | జ | ∪ | జ ∪ గ.

తానకంబుగఁ జంద్రకళావృ♦త్తంబు కవు ల్విరచించినన్
వీనులార మనోజ్ఞపదంబుల్ ♦ పేర్చి కపర్ది విరామమై
కాన వచ్చి రసస్థజజంబుల్ ♦ గంబు దనర్చి కళిందజా
మానినీరమణ స్తవగాథా ♦ మానితరత్నములం దగున్.

### భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

∪ | | భ ∪ | | భ ∪ | ∪ ర | | ∪ స | ∪ | జ | ∪ | జ ∪ గ.

భారసజాగగణంబులుం బఱ♦వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పొందవ♦పఙ్క్తి దైవతవృష్టి మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టివ♦జాక్ష యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన ♦ శ్రావ్య మా వినువారికిన్.

### కవికంఠభూషణము ౧౯-౧౪౪౯౦౦

| | ∪ స | ∪ | జ | | ∪ స | | ∪ స | | ∪ స | ∪ | జ ∪ గ.

నవరత్నవిశ్రమము♦నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము♦గా రచియింతురు మాటిమాటికి
స్రవణిల్లుకబ్బమున ♦ నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ ♦ దత్పరులై [1]నమహాత్ములట్టుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు వుట్టె నందు:—

### మత్తేభవిక్రీడితము ౨౦-౭౯౬౮౭౬

| | ∪ స ∪ | | భ ∪ | ∪ ర | | | న ∪ ∪ ∪ మ | ∪ ∪ య | ∪ వ.

మనువిశ్రాంతిని సభ్రనమ్యవములన్ ♦ మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతుజా♦రా వీఁడె యే తెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా♦తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్నవెడదొం♦గం జూచినారా యనన్.

1 తనరారునట్టుగాన్.

### ఉత్పలమాల ౨౦-౩౫౫౭౯౯

U I I భ U I U ర I I I న U I I భ U I I భ U I U ర I U వ.

పేరిననేయి దుగ్ధములు • పెర్గును మీఁగడయు న్సదా వ్రజా
గారము సొచ్చి త్రాగి వెస • గంతులు వైచుచు రారి వెంచఁగా
ధారుణి రూఢి కెక్కునవ • తారవిరామము చే లసద్భరో
భారలగంబులుం గలయ • బల్కిన నుత్పలమాల చెన్నగున్.

### అంబురుహము ౨౦-౩౭౨౧౫౧

U I I భ U I I భ U I I భ U I I భ U I U ర I I U స I U వ.

చారుతమాలదళాసితవర్ణునిఁ • జక్రహస్తు సనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు • నందనందను నవ్యయుం
శౌరికులోద్భవుఁ గైటభభేదిని • జోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ • బల్కు నంబురుహం బగున్.

### ఖచరప్లుతము ౨౦-౩౭౩౧౭౬

I I I న U I I భ U I I భ U U U మ I I U స I I U స I U వ.

యమునలోఁ జొర నోడిననానా • ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుట కై కలఁచంగా • దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియుఁ సంహా • రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనా ఖచరప్లుతన్.

### ప్రభాకలిత ౨౦-౩౭౨౧౪౪

I I I న I U I జ I U I జ U I I భ U I U ర I I U స I U వ.

వళి పదమూఁడవయక్కరంబుగ • వాసి కెక్కు నజాభ రే
ఫలు సలగంబు లమర్చి సొం పొద • వం బ్రభాకలితాఖ్య మై
చెలు వగువృత్తమునందు సత్కవి • శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన • జాంబవత్యధిపాలునిన్.

వ. ఏకవింశతిచ్ఛందం బగుప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్షరంబులై ౧౦౪౮౫౭౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

* ర్యమవిరామముతోడ నభామ్స • స్వల్వెలయుం (పూ. ము.) ఇందు యతి తప్పినది; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనా (వ. ఓ. ఫై.) ఇందు గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

I I I న I ∪ I జ ∪ I I భ I ∪ I జ I ∪ I జ I ∪ I జ ∪ I ∪ ర.

చపలమనీషతోడ నొక ♦ సంయమి వే మొఱ వెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రు బ్రతి♦కించిన మేటివిభుండ వంచు నిన్
సపరిగణంబుతో నజభ♦జాజలు రేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదశాఖ్యవిర♦తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౪౪౩౦౪

I I I న I ∪ I జ I ∪ I జ I ∪ I జ I ∪ I జ ∪ I I భ ∪ I ∪ ర.

మనువిరతు ల్నజజాజభర ల్వన♦మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజనకుండు న్విజయుం డను ♦ ద్వారపాలకు లిద్వరు
స్సనకమునిశాపము దాఁకి నిశాటు ల♦వంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాండ్రను జంపినకోలనృ♦సింహుని న్వినుతింతు రా.

*స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

∪∪∪ మ ∪ I ∪ ర ∪ I I భ I I I న I ∪∪ య I ∪∪ య I ∪∪ య.

మానొందన్ స్రగ్ధరాఖ్యన్ ♦ మరభనయయయల్ ♦ మత్తనాగాష్టవిశ్రా
మానూన ప్రాప్తులై సన్ ♦ హరిముఖవిబుధుల్ ♦ యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో♦ర్మథికడ నమృతం ♦ బారగింపంగ నచ్చో
మారి న్యాకారకన్ స♦మ్మదము పొదలు స♦ద్మాధవా! నందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౪౯౭౨

I I ∪ స I I ∪ స I I ∪ స I I ∪ స ∪∪∪ మ ∪∪ I త I ∪∪ య.

సగణంబులు నాల్గిట మత్యల వి♦శ్వశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స♦మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగు నేర్పున మూఁడు పదంబులుగాఁ ♦ త్రైలోక్యంబు[1]ల్దాల్చి సురారుల్
వాగులం బలిదానవుఁ ద్రొక్కినయా♦పొట్టిం దిట్ట న్యామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౯౬౫౩౫౬

I I ∪ స I ∪ I జ I I ∪ స I ∪ I జ I I ∪ స I ∪ I జ I I ∪ స.

అజహాత్ప్రయోదధిఘృతంబు ♦ లమ్ముచు మురారిఁ బాడి రెలమిన్
వణఁగాఁ దదీయచరణా క్రాంతవృహ్వ్రాద హారపాప లగుచు - -- -

---

* ఇది (పూ. ము)లలో లేదు. (ప) లో నున్నది. 1 (పూ. ము.) లలో. గొల్వఁగఁ గోరుల్.

వ్రజసుందరీజనము లోక్క • నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
స్రజము త్రివారము సమం బి • నాకవిరమంబు పొందు దనరన్.

### కరిబృంహితము ౨౧-౭౮౩౩౭౧

∪ I I భ I I I న ∪ I I భ I I I న ∪ I I భ I I I న ∪ I ∪ ర.

మూఁడు భనములు రేఫమును బదు • మూఁట విరతియుఁ బొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ • కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము • వెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపుఁ[1]జిననాఁడు శకటునిఁ • గూల్చినవారి నుతించెదన్.

### కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

I I I న I I I న I I I న I I I న I I I న I I I న I I ∪ స.

జవమున భగభగ యనుచు వ్ర • జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుమర • నరకదమన యని చే
లవముగఁ బలుమఱు నిరువది • లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బెం • డఁ గడరుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టె నందు:—

### మహాస్రగ్ధర ౨౨-౬౦౫౯౮౮

I I ∪ స ∪ ∪ I త ∪ ∪ I త I I I న I I ∪ స ∪ I ∪ ర ∪ I ∪ ర ∪ గ.

సతనస్రాగ ల్విరించా • ష్టవిరతులఁ మహా • స్రగ్ధరం జెప్ప నొప్పున్
గ్రతువిఘ్నం బావహిల్లం బ్రమదమున వ్రజ • వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృద్రూపంబున న్మో • క్కిన రుష నమరా • గ్రేసరుం డంప వృష్టుల్
ధృతిమై జాల్వానఁ [2]గూల్పన్ • దివిరి కరుణతో • [3]ధేనువృద్ధ్యద్రి మోచెన్.

### భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

∪ I I భ ∪ I ∪ ర I I I న ∪ I ∪ ర I I I న ∪ I ∪ ర I I I న ∪ గ

భంబు రనత్రయంబు గము నొంది • భానుయతి భద్రకంబు దనరున్
బంబినవిల్లుగోల కరయుగ్మ • పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ • గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి • రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

---

1 చిననాడయనురుల (పె). 2 గూల్పన్ (బీ); గూల్చన్ (వ) గుర్వన్ (భూ. ము). 3 ధేనువర్ధాద్రి (భూ. ము).

### మానిని ౨౨-౧౭౯౭౫౫౯

U | | భ U | | భ U | | భ U | | భ U | | భ U | | భ U | | భ U గ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు • దైత్యగురుర్ భృగువాక్యమునర్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజిత మోక్షము చేకుఱఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

### విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

| | | న | | | న | | | న | | | న | | | న | | | న | | | న U గ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భవనములు కడుపున నిడుక • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకుపరదుఁ • డని విచికిలితఁ బదమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

### తురగము ౨౨-౧౪౯౦౯౪౪

| | | న• | | | న | | | న | | | న | | U స | U | జ | U | జ U గ.

ననననసజజగలు తిథివిరమ•ణంబగు న్దురగంబునర్
గనలుచు నగరముపయి విడిసినఁ • గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవ్వులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కొనాముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

### [1]మద్రకము ౨౨-౧౯౪౭౦౯౫

U | | భ U | U ర | | | న U | U ర | | U స | | U స | | | న U గ.

అధ్వమునందు నడ్డ మయి వా•హనాకృతి నున్నబకాసుర మహా
సాధ్వసదు ప్రజార్భకవినా•శనక్షము వక్త్రముఁ జొచ్చి సురల్
బ్రాధ్వగు లై నుతింపఁగఁ వడి•యుదేహము వెళ్లినకృష్ణనుతి న
క్రధ్వజమద్విరామము ధర•న్ప్రసానగలుం దగు మద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగువికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబు లై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౫౬౫౧౨౦

| | న | ∪ | జ | ∪ | జ | ∪ | జ | ∪ | జ | ∪ | జ | ∪ | జ | ∪ వ.

కలయఁగ నొక్క నకారము నాఱుజకారములు న్వము గాటముగా
నలరినచో ద్విరదాచలశైలము లై త్రివిరామము లందినిర
ర్గళకవిరాజవిరాజితవృత్తము రాణ జనార్దనరమ్యకథా
వళులఁ గవీశులు వర్ణన సేయఁగ వ్రాలు నజస్రము వావిరిగన్.

అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

| | | న | ∪ | జ ∪ | | భ | ∪ | జ ∪ | | భ | ∪ | జ ∪ | | భ | ∪వ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భజ ల్భజభవంబు లశ్వలలితక్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి చిన్నిసఖయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను నీడ్చు [1]క న్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ గాఁ దనరు సర్వకాలము ధరన్.

పద్మనాభము ౨౩-౧౪౬౭౬౭

∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ | త ∪ ∪ గగ.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వవిశ్రాంతియుం న్పత్తంబు ల్గగంబుల్
గోమారుగా దేవరాత్రించరుల్ క్షీరకూపారమధ్యంబున న్వీఁపుమీఁదన్
భ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛపస్వామి యై మోచె నీకృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౪౧౬౪౦౮౧

∪ ∪ ∪ మ ∪ ∪ ∪ మ ∪ ∪ | త | | | న | | | న | | | న | | | న | ∪ వ.

మత్తాక్రీడాఖ్యం బెంపారు న్మతనననవ మహిత మగుచు ర
త్నాత్రబ్రహ్మాశ్రాంతు ల్గ్రాలై యమరఁగ రణమున నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు న్మధురనడుమఁ బెడ మరలి పిడికిటన్
సత్తామాత్రుం డుర్విం గూల్చె న్సకలదివిషదులు సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియక్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 (వ) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచియుండుటచే స్పష్టముగా లేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

## సరసిజము ౨౪-౭౩౭౭౧౯౩

UUU మ UUI త IUU య III న III న III న III న IIU స.

సంబంధించు న్మత్యలు నానా॰రలు దశనిధియతి ॰ సరసిజమునకుఌ
గంబూర నృబృందాటవిగోనం ॰ [1]గవిసికొనిరసుర॰కరువలిదఌజుఌ
శంబాభిలం బై తగుమస్టిం ॰ జదిపినయదుపతి॰ స్తవముల ననురా
గం బూర న్మోభిల్ల గఁ బ్రాంచ॰త్కవివరు లభినుతిఁ గఅపుమ రవనిన్.

## క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౮౯

UII భ UUU మ IIU స UII భ III న III న III న IUU య.

పంచమకేశుం డిచ్చినభాస్వ॰ద్వరమున మనమున ॰ బవరము గోరఌ
వంచనతో బాణాసురహస్త॰వ్రజములు దరిగెను ॰ వడి హరి యంచు
న్బాబ్రించితలీల న్మంకరనంది॰ప్రకటితవిరతులు ॰ భమసభసాన్యల్
*క్రౌంచపదీవృత్తమ్మునఁ జె న్నా॰రఁగఁ బలుకుదు రిలఁ ॰ గవివరు లెల్లన్.

## తన్వి ౨౪-౪౧౬౬౩౬౮

UII భ UUI త III న IIU స UII భ UII భ III న IUU య.

దూడలతోఁ గాపరులను గుహాలో ॰ దొంగిలిదాచినవిధి నదలింపఌ
గూడుక తద్రూపము లయి పసులుం ॰ గోపవధూటులు మురిపము నొందఌ
బాడి వినోదంబులు సలిపినగో॰పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ॰ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

## అష్టమూర్తి ౨౪-౩౬౧౪౬౨౧

UUU మ III న UUI త IIU స UIU ర UII భ UIU జ IUU య.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం ॰ జితతృణావర్తదైత్యు ॰ స్మితకుశేశయనాభుఌ
వైకుంఠు న్వరదు బృందా॰వనచరు న్వాసుదేవు ॰ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా॰మలవిరామంబు లొప్ప ॰ న్మనటసర్భజయంబుల్
శ్లోకం జెప్పుదురు విద్వాం॰సు లిలలో నష్టమూర్తి॰న్సుప్రతిభు లకృతచర్యల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబులై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె నందు:—

## బంధురము ౨౫-౧౪౩౬౭౮౬౭

III న III న III న III న IIU స UII భ UII భ UII భ U గ.

సొరిది ననననభసభభగములతో ॰ షోడశసంఖ్యవిరామముతో
బరువడి దినదినమును బుధజను లీ॰బంధురవృత్తమునందు నుతిం

1 గవను (వ) * ఈపాదమున బహుయతి నియతి తప్పినది.

### మంగళమహాశ్రీ ౨౬—[illegible]

U I I భ I U I జ I I U స I I I న U I I భ I U I జ I I U స I I I న U U గగ.

ఖాత్తు లెడఁబాయంటను • బోరుసమయంబునను • బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు•దుర్చును మనీష నది•దుష్టసమరావనిఁ గిరీటి
ఉత్తరకు *భజన్నభజ•సన్నగలు మణ్యాజుల • శ్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర • నిచ్చిరి సువాసినులు • నిం పడర మంగళమహార్తుల్.

క. ఖాందుగ నిరువదియాఱగు, ఛందములం దుదయ మైన•సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెడు, కందువల వచించినాఁడఁ • గామెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

### ముఖ్యగౌణవృత్తలక్షణము

సీ. సమవృత్తపఙ్క్తి స్వ•స్థానార్థసమములు స్వస్థానవిషమాఖ్యఁ • జనవివియును
బృథివిపై సమవృత్త•భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం • బన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు • లికఁ బరస్థానార్థసమవృత్తములు పర•స్థానవిషమ
సంజ్ఞలవద్యము ల్సర్వపరస్థానవిషమంబులును నివి • విషమవృత్తి
తే. భేదములు వీనినాలుగఁ • పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ•సంఖ్య లెచ్చు
కడమ లైయుండు నీమూఁటి • గౌణవృత్త, పద్యము లటండ్రు శ్రీకామె•పల్లినిలయ.

### సమవృత్తవివేకము

గీ. జగతి సమవృత్త మెన్నవ•ఛందమునను, సంభవము నొందె నన్ని య•క్షరములమరఁ
బదపదంబున హెచ్చును•గొదువ గాక, ప్రాసములు విరామంబులఁ•బరిఢవింప. 181

### స్వస్థానార్థసమవివేకము

ఆ. అక్షరములు సమము•లయ్యె స్వస్థానార్థ, సమములందు నాల్గు•చరణములను
విషమపదము లొక్క•విధముగణంబులు, సమపదంబు లొక్క•సరిగణములు. 182

క. సగ మొక్కవిధంబునఁ బెఱ, సగ మొక్క తెఱంగు గాఁగ • సమకూర్పఁదగున్
జగతి నొకకా లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క•యోజం దనరున్. 183

తే. సాధుకవికృతగ్రంథసం•జాత మెల్ల, వెదకి సకలోపజాతుల•విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ•కావ్యమునను, జెలఁగి చెండవసర్గలోఁ • జెప్పినాఁడు. 184

వ. అటు గాన స్వస్థానార్థసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

### ఉపజాతివృత్తము

ఈపాటితో జేసుల • నింద్రవజ్రం, బుపేంద్రవజ్రాహ్వయ మూర్వి సర్వం
దాపించినంతం గరు•ణాసముద్రా, జపిష్ఠలోలా యుంప జాతి యయ్యెన్. 186

---

* భజన్నభజసానగలు — అని వ్రా. ము. ఇందుండవలసినగణములు భ, జ, స, న, భ, జ, స, న, గ గ లగుటచేత నీలక్షణము దుష్టము. కాన నైరీతి సవరింపఁబడినది.

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను జేసిపాదాలను నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలను గలుగును. [1]దీనిపేరే నిశి. 187

## మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై చేసి జగజ్జగంబుల్, చాలొప్ప నట్లుం దగ నబ్జగంబుల్
జలంబుతో నిట్టులు సాగిన-తర్, వాళారు వ్యత్యస్తము వాసుదేవా! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదములను, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 189

## సమోపజాతి

తాపింఛనీలాంగుఁ బ్రభాకుతల్పున్, గోపాలబాలు న్రవికోటితేజున్
కృపాసముద్రు న్నళినయించెద న్నుత్యపాదుఁ గాంక్షించి సమోపజాతిన్. 190

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములును నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములును నడుచును. మఱియు, 191

## వ్యత్యస్తసమోపజాతి

తపంబుచేఁ గొల్తు విదాత్మ్యతారన్, కపాలికోదండవిఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృతగోత్రు సన్నో, త్రోపాయుఁ వ్యత్యస్తసమోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములును నడుచును. మఱియు, 193

## వైపరీత్యోపజాతి

తాజల్గగం బొంట జగజ్జగంబుల్, గజిక్కున మ్మూటనుగంతు వేయన్
వ్రజాంగనావల్లభ వైపరీత్యోపజాతివృత్తంబు సుభం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమును నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరే[2] వాతాంగియు, మఱియు నీవృత్తమున నే యింద్రవజ్రాఛాయను నేదైన నొకచరణమును నుపేంద్రవజ్రాఛాయను నేవైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును, 195

## ఉపచిత్ర

భిదురంచి ససావలు చేసులర్, గాదిలి భాభగకంబులు సర్లన్
గుదురై రసికస్తుతిఁ గూడినన్, శ్రీదయితా యుపచిత్ర చెలంగున్. 196

---

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2 వారాంగిని (పూ. ము): వారాంగి ముందు వచ్చును. (మా. ఆ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను జేసిపాదములును దోదకవృత్తచ్ఛాయను సరిపాదములును నడచును. మఱియు, 197

నారీనుతము

పేరెంబు ల్వారోరి♦ జేసి న్మతాంగా, పారంబు గర్ణన్ దత♦జ ల్గగంబుల్
ధీరో దాత్తుల్ సన్నుతింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జ♦నార్దనాఖ్యా. 193

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను జేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

అజితప్రతాపము

జలజాక్ష! జేసుల స♦జల్ సనలున్, బలుసంజున్ సరి స♦భ్రజ లొందఁగా
జలజోద్భవాబ్జజని♦ శాలయతుల్, దళము లైన యజి♦తప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములును ప్రియంవదావృత్తచ్ఛాయను జేసిపాదములును నడుచును. మఱియు, 201

రతిప్రియము

జేసి న్నజరగలు♦ పేర్చి సర్ల జంబున్, భసజ్జగల్గదిసిన♦ పాదబద్ధ మై
యాహా మోద్భవచతు♦రాస్యవిశ్రమఖ్యా,తి సన్నుతింపఁదగు ర♦తిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను జేసిపాదములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్ధసమవృత్తలక్షణం బిఁక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

స్వస్థానవిషమవృత్తవివేకము

ఆ. చరణములను వర్ణ♦సంఖ్యలు దప్పక, నాల్గుపాదముల గ♦ణములు నాల్గు
విధము లై చెలంగు♦వృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంజ్ఞ♦ వెలయుచుండు. 204

ధరణి

రసమై సచతుష్కము♦ రారసలున్, నాసనల్, మాసనల్,♦ నాటిన న్మణి తా
పస నగ రస♦పరిపక్వయతు, ల్రా సొం పారు న్యా♦లాపముగా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమును గడమ మూఁడుచరణములును గవికల్పితము లై నడుచును. మఱియు, 206

వారాంగి

తాజ ల్గయుగ్మంబు, జ♦తజ్జగంబుల్, తజాగగంబుల్ మభ♦ల్లగంబుల్
రాజిల్ల *నిభాద్రి వి♦రామయుక్తిన్, వాజిగ్రీవా హరి♦ వారాంగి దగున్ 207

---

* ఇభేంద్రవిరామయుక్తిన్ - అని పూ. ము. వాతోర్మి కేడవ యక్షరమున యతి. కనుక 'ఇభాద్రివిరామయుక్తిన్' అని యుండఁదగును.

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

## అంగజాస్త్రము

రంగదిభమస్థల్ • గ్రాలుమసజల్, పొంగై వన్యా•ము ల్రజర్గలా
ప్పంగా సార్త•నగిరిప త్త్రైతే, నంగజాస్త్రవృత్త • మాదగించున్. 209

వ. ఇది రుక్మవతీచ్ఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

## నదీప్రఘోషము

పోలిమై రారరం•బుల్ జశ్రజ్రంబులున్
తలంచఁగా రయాయయలున్ • దత్రజ్రలున్
విలాసాచలాష్టేభ•విశ్రాంతిశోభన్
దేలింప నొప్పారు న•దీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

## పరస్థానార్ధసమవృత్తవివేకము

క. మానుగ సమాంఘ్రు లొకగతిఁ, బూనిక విషమాంఘ్రు లొక్క•పోలికలిపుకై
హీనాధిక్యములు పర, స్థానార్ధసమంబులందు • సమవిషమములన్. 213

## మనోహరవృత్తము

పేర్లైనతజజ్వలు • బేసియెడన్, సరులన్ సచతుష్కము • సాగిన గం
భీరేభపితామహ•విశ్రమముల్, పెరుగంగ మనోహర•వృత్తము తా. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

## కేతుమతి

[1] జతబేసుల న్సా•జనగముల్, భాతి సరిన్ భరే•వనగగంబుల్
యతి శైలసంఖ్య • నమరఁగా, నాతతకేతుమ•త్యభిధ నొప్పున్. 216

---

1 ఇందు బేసిచరణములు పఙ్క్తిఛందమున 492వ వృత్తచ్ఛాయను సరిచరణములు త్రిష్టుప్ఛందమున 471 వ వృత్తచ్ఛాయను నడుచును. ఈవృత్తముల నప్పకవి యందహరించలేదు.

## వేగవతి

[1] సగణత్రయగంబుగఁ జేసిన్, బాగుగ నర్ధను భత్రిగగంబుల్
నగవిశ్రుత మోదము నొందున్, వేగవతీయను వృత్తమునందున్. 217

## వియోగిని

[2]ససజల్ గము సాఁగ జేసినన్, సగ భజల్ గురు సాఁగిలన్ సరిన్
రసశైలవిరామసంగతిన్, బొసఁగు న్వియోగిని భూరమాధిపా. 218

## పరావతి

[3]ఓలి రజజాంతగంబులుంచి జేసులం, దలన్ జరజగంబులుం [4]గుదుర్పరింపన్
గ్రాలుచు న్నిధానదిగ్విరామ మొప్పఁగా నిలం బరావతీసువృత్తమింపుగాఁచున్.

## ధృతమధ్య

బారిగ జేసుల భాభగగంబుల్, సరుల నజాయలు సాగఁగ మేల
య్యారె శిఖోచ్చయ హస్తివిరామో, [5]దారత నొప్పును దాధృతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను జేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణము లును నడుచును. 221

ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

---

1 ఇందు జేసిచరణములు పఙ్క్తిచ్ఛందస్సునందలి 220వ వృత్తచ్ఛాయను, సరిపాదములు త్రిష్టుప్ఛందస్సునందలి దోదకవృత్తచ్ఛాయను నడచును. జేసిచరణము లందలివృత్తము నప్పకవి పేర్కొనలేదు.

2 ఇందు జేసిచరణములు పఙ్క్తిచ్ఛందమునందలి 348వ వృత్తచ్ఛాయను సరిచరణములు త్రిష్టుప్ఛందమునందలి 692వ వృత్తచ్ఛాయనునడచును. ఈవృత్తము నప్పకవి పేర్కొనలేదు.

3 ఇది పరస్థానార్ధ సమవృత్తము కాజాలదు. స్వస్థానార్ధసమవృత్తములలోఁ జేర్పదగినదిగాఁ, గనబడుచున్నది. సరిజేసి, చరణములేకచ్ఛందము లోనివిగానున్నవి.

4 గుదిరింపఁగా (పూ. ము.) ఛందోభంగము. 5 ఈచరణము రెండవచరణము వలెలేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లే ఉన్నది. కాని 'విరామాంధరమున' నని సవరించిన సంగతము.

## పరస్థానవిషమవృత్తవివేకము

క. దానవహర యొకచరణం, బైనను రెండవగు తైన • నక్షరగణసం
ధానములను బెఱతెఱ వగు, వీనికిఁ బేరు పరదేశ•విషమము లయ్యెన్. 222

## శరభక్రీడ

ఘనాదిత్యక్రాంతి న్యమనసర•గల్మాఁడుకాళ్లన్
గనద్ధాత్రక్రాంతి న్మభసయజ•గద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథల•దాశార్హు వాక్రు
వ్వ నర్హంబై చెన్నా రవని శర•భక్రీడసంజ్ఞన్.[1] 223

వ. ఇది చంద్రశ్రీఛాయను ప్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణము
లను నడుచును. 224

## శ్రీరమణము

ఆది భమసగ•ల్వాత్తిన న్వాపై, గాదిలి భాభగ•గంబులు మూఁటన్
బాదుకొనం గవి•పల్కినచో లక్ష్మీదయితా ధర•శ్రీరమణంబౌ. 225

వ. ఇది రుక్మవతీఛాయను దొలిచరణమును, దోదకచ్ఛాయను మూఁడుచరణములును
నడుచును. 226

## రథగమనమనోహరము

గ్రథితనయయుగరజ్ఞ•గంబులుంబొసంగం, బ్రనమత్తృతీయచతుర్థ•పాదముల్వచింపన్
విధిదశయతు లొందిం•వింతగానజార్యల్, రథగమనమనోహ•రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనినః—

## సర్వపరస్థానవిషమవృత్తవివేకము

క. ఉర్విని నాలుగుపదములఁ, బర్వినగణములును వర్ణ • పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ•సంజ్ఞలను హరీ. 228

## వీణారచనము

దారిం దయసాగ ల్మఱిం•త జ్నభగాలు, న్వారించి తజ న్భసలు భ•నాజనగంబుల్
జేర న్మణిదిగ్దశశశి•శేఖరవళి వీణారచన ధరఁ జెలఁగును • నారదవినుతా. 229

## ఉద్ధతము

అరుదార నుద్ధత మయ్యె, న్మరి సజసలున్ • నసజగలున్
జారుభనజగలు • నజ్సనల్, ధర షణ్మహీధ్రగజ • ఘాత్వయతిన్. 230

---

1 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీఛాయచే ఉన్నవి. రెండవచర
ణము గనద్ధామక్రాంతిన్మభనయజ•గద్వంద్వ మొందన్ (పూ. ము).

### మధుర

వెస మధురాఖ్యము • విన్నజారగల్ సా
రసలగములు మీఁద • రా గ నసమ్యయల్
నసజజజగ లొందఁగ • దంతిరత్నాత్మభూది[1]
క్ప్రిసరవిరమంబుఁ జెంది • రసం దనరా రజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను, అపరాజితచ్ఛాయను రెండవచరణమునను, మాలినీచ్ఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణముకవికల్పితము.

### మణిదీపిక

గురుపితామహముఖ్యులఁ గినిసి • ఘోరరణములోఁ
జెరలిచె నరుఁ డని పలుక రత్న • దీపిక ల్దనరును న
క్షరనభభ్నభస ల్నసాసజ • కారభసలు నభర్సనసనసలు
స్భరసజాగలు భూపతు ల్విస • భానువిక్రమయుక్తితోన్.* 233

ఉ. ఈసమవృత్తరాజి నుద • యించువిరామములు న్గణంబులుం
భ్రాసము లెల్లఁ దప్పక స • మర్చి వచించిన సైదుత్రోవలై
భాసిలు వృత్తపన్యము లపారము లై విషమాహ్వయంబు లై
వాసికి నెక్కు శిష్టజన • పాలన దుష్టనిశాటచాలనా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు న్ధర దక్షిణాంతికయు నౌ • పచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాభరాంతికలు వై • తాళీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ • జెన్నారువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నం • దుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రగడలందును, వైతాళీయాఖ్యవృత్త • వారములందున్
బీతాంబర గురువునకు, స్రీతిగఁ గృతుల న్లఘువులు • రెండేసి యగున్. 236

### దక్షిణాంతిక

ఉరుసాజగ • లుండు జేసులన్, సపులం దూకొను • సభ్రివంబులున్
దొర లేడిటఁ • దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు • దక్షిణాంతికల్ 237

---

1 రత్నాజది - అను పూ. ము. లో గణభంగ మగుటచే నిట్లు సవరింపఁబడినది.

*ఇందు పండ్రెండవ యక్షరము యతియని చెప్పఁబడినది. తొలిపాదమునఁ బదమూఁడవ యక్షరమును, రెండవపాదమునఁ బదునాల్గవయక్షరమును యతులుగా నున్నవి.

## ఔపచ్ఛందసము

ఇమిడి నలము • లేదు తొమ్మిదింటన్, సమకూడ న్యతి • షష్ఠ రేఫయుంబుల్
సమత వసుల • సాగి రేఫయంబుల్, క్షమయౌ నౌప • చ్ఛాందసంబు మించున్. 238

## ప్రవర్తక (వర్తక)

స్థిర జేసి ను • దీచ్యవృత్తియందున్, బరఁగు సర్ణను • బ్రాచ్యవృత్తియందున్
గిరిమణియతి • కీలితంబుగన్, బరమౌఁ గొల్వఁ బ్ర • వర్తకాఖ్య మా. 239

## ఆపాతలిక

లము లాఱవ • లన్భగగంబుల్, లము లెనిమిదిటిక • డన్భగగంబుల్
క్షమ గిరినవ • క్రాంతులు నొప్పన్, బ్రమథితమౌర యా • పాతలికాఖ్యల్. 240

## పరాంతిక

ఇల వర్తక • వృత్తరీతితోఁ, దుల రై పాదచ • తుష్టయంబులన్
బలసినయది • పద్మనాభ చెన్నలరుఁ గృతులఁ బ • రాంతికాఖ్యచే. 241

## వైతాలీయము

ఋతులఘువులు • రేఫవంబులున్, ధృతవసులఘువులు • రేఫవంబులున్
జత సమకొన • సారసాక్ష పా, లితశుక వైతా • లీయవృత్తమా. 242

## చారుహాసిని

*ప్రమదమునను • వర్తకాఖ్యవృ, త్తముచందంబున • ధాత్రి నక్కడల్
సమకూర్చిన • శార్ఙ్గ కార్ముకా, సమత నిమ్ముచు • చారుహాసినుల్. 243

## ప్రాచ్యవృత్తి

తొలి నేడిటఁ • దొమ్మిదింట క్రాం, తులు వసుశాలుగు • మాఱు జేసులం
దులఁ బదాఱు • తొంగలించు సర్ణ లలి న్నాథక • ప్రాచ్యవృత్తి యౌ. 244

## ఉదీచ్యవృత్తి

తమ కిర వగు • దక్షిణాంతికా, ఖ్యము లేజంబున • నందగించు మే
లిమికృతులఁ గ • డింది వేలుపా, లిమురు ధాత్రి న • దీచ్యవృత్తికిన్. 245

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱిఁగించెద:—

---

* ప్రవర్తక-పరాంతిక-చారుహాసినులకు నామభేదమే కాని రూపభేదము కాన వచ్చుటలేదు.

## మాలికావృత్తవివేకము

తే. మాలికావృత్తము లనంగ ♦ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛం♦దముల మించి
యల లయగ్రాహి లయవిభా♦తి లయహారి
గదసహాజ! త్రిభంగియుఁ దండ♦కంబు లనఁగ. 246

## లయగ్రాహి

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్షరములపద♦ములయంఘ్రులు నా
ల్గొప్పయతి ప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 247

ఇం బడరఁగా భజస♦నంబులతుద న్భజస♦నంబులు పదంపడి భ♦యంబులు లయగ్రా హింబరఁగుప్రాసవిర♦మంబు నలుమాఱు గుదు♦రం బటుకవీశులు తి♦రంబుగ వచింపన్ నంబరముగా వలసి♦తొంబగలి దానవక♦దంబము సహాయముగఁ♦బంచి త్రిదశు ల్దుగ్ధాంబునిధి ద్రచ్చి యమృ♦తంబు గొనఁజాలుసమ♦యంబు దొరికించితి ము♦దంబున ముకుందా. 248

## లయవిభాతి

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గర్ణము పద♦ము తదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 249

వేనిమిటులు భార్యలునఁ♦దనయులను గాంచిరటె♦మనమలర దొడ్డతన♦మునసలదశ స్యందనుఁడు మఱికోసలియుఁ♦దనకడుపులోపల భు♦వనము లఖిలంబు నిడు♦కొనిన కొడుకున్రాము నని నసనద్వయము♦ వెనుక నసగంబులను♦ జొనిపి యతులుండు నెడ♦లన లుమఱుప్రాసం,బునిలిపి కవీశ్వరులు♦ మును లయవిభాతి నిటు♦నిను వినుతి సేయుదురు♦వనజదళనేత్రా. 250

## లయహారి

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణము పద♦ము తదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 251

నగణములు పదునొకఁడు♦సగణమును గురువునిడి♦ మిగులనలుమఱు యతులు♦దగులు లయహారిన్, బేఁడిశతధృతిపరిష♦ద్గతుల మెఱయుడినమ♦ణిగిరిఘుషతనువుఁ బొదివి♦నిడి చనియుంతన్, నిగమములు గొనివెనసు♦జగము లద్రువఁబఱచి రొ♦దిగికడపలిజడధి ము♦నిగినవభిమాలిన్, బెగడుచునొడిసికరిచి♦ తెగఁగొనినతురగగళుఁ♦డగుహరివనఁగ నుకవు♦లగణుతిచెలంగున్. 252

## త్రిభంగివృత్తము

క. ఇది నేత్రాంబుధిలము ము,ప్పదినాలుగువర్ణములను • బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యనువృత్త • ముర్వరలోనన్. 253

విసువక [1]సుకవులు•రసఁబ్రతిపదమున • సాసగగమూఁడొకతీరై మఱి పేర్చెమూఁ డొక
తీ రై, రసనగణములును•పసభమసగలును • పొసఁగినవద్యతిసంగిప్రణుతింగిం జెల్లుఁద్రి
భంగిన్, మసలెదువ్రజమున•సుకికిలి మధురతుఁ • గసికిసమృద్ధశుభాంగిందగుభంగిం
జేరిత్రిభంగిన్, వెసమనిచినసవ•బిసరుహనయనయ•రి సభలవేడ్కగురింతున్ విను
తింతున్ నిచ్చలుఁ గాంతున్. 254

## దండకము

క. ఇది నియమము లేనిమహా, పథమునఁ గావలసినంత • [2]వర్ణ్యాణింపన్
గొద లేక నమరు దండక, ముదధీంద్రశయాన తాపశోత్తమనుతులన్. 255

విద్వాంసు లెల్లన్ హకారంబె కాని నకారంబె కానీ సకారంబె కానీ వచిం
చు దగు న్మొందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబులే మెండుగా నిచ్చకు న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రు భక్తానుయాయీ భుజంగేంద్రశాయీ పయస్తక్రదధ్యాదికస్తేయి
నైర్మల్యతాపింఛగుచ్ఛ చ్ఛవిస్వచ్ఛ మాయూరపింఛావచూడా సదాపూతబృందాటవీ
మధ్యరథ్యాసమారాధ్యతథ్యార్భక క్రీడ హేమేక్షణా ఖర్వదోర్గర్వసంభూతగర్వోర్వ
రాభారనిర్వాహకార్థాంగికక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటిప్రతీకాశ
నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబినీనీల గోపాల
బాలా నమస్తే పునస్తే నమః. 256

క. దండిగ నేకపదంబున, నుండెడివిక్ నాల్గడుగుల • నుండెడిన్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండ•వృష్ట్యాదికముల్. 257

దండకము. ధూర్త ల్నకారంబులు న్రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యాఖ్య
మయ్యె న్నకారంబులు న్రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యె
న్నకారంబులు న్రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [3]న్నర్ణవం బయ్యె
నోలి న్నకారంబులు న్రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళ
మయ్యె న్నకారంబులు న్రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్పజీమూత మయ్యె
న్నకారంబులు న్రెంటిపై నొప్పపండ్రెండురేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ

---

1 సుకవులరసఁ (పూ. ము.) ఛందోభంగము 2 వర్ణ్యాణింపన్ (ప); వర్ణా
ణింపన్ (ఓ). 3 న్నర్ణవం (పూ.ము).

బేర్చి న్నకారంబులు న్రెంటిపై మించు పద్మాండురేఫంబులు న్నంత నుద్దామ
మర్యొ న్నకారంబులు న్రెంటిపై రూఢిఁ బద్నాల్గురేఫంబుల న్శంఖమన్దండకం
బయ్యె నీరీతితోఁడ న్నకారంబులు న్రెంటితర్వాత నేడాదిగాఁగారకారంబు లొప్పా
రఁగా నంప్రి నొక్కొక్కటెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండ
కంబు ల్విసాళించుఁ గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు [1]నీరీతి నేకోన
సాహస్రపర్యంతముంగూర్చి యిచ్ఛానిధిం జెప్పఁగావచ్చు గాంతంబుగా రాధికా
జార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథ వాఃకేళికాసక్త
గోపీజనోత్సృష్టవస్త్రాపహారా శుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రా దయాసాం
ద్రదేవా నమస్తే పునస్తే నమః.

## జాత్యుపజాతినామములు

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేద•ములు జాతులలో
జాతులు కందాదికము లుప, జాతులు గీతాదికములు • సరసిజనయనా. 259

సీ. కందభేదము లాఱు • గాక నుత్సాహంబు తరువోజ మధ్యమా•క్కరలు నైదు
దీపించు మంజరీ•ద్విపద త్రిపద చతుష్పదపంచపాదిష•ట్పదవిధములు
తొమ్మిదివిధములు•తో నొప్పు రగడలు కళికలు నుత్కళి•కలును గూడ
జాతులు నవవిధ•గీతంబులును సీసషట్కంబును నుప•జాతు లయ్యె

తే. ననుచు నన్నయభట్టు భీ•మనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[2]నా•జ్జుఁడు ననంత
మంత్రియును దిమ్మరాజు ని•మ్మాడ్కిఁ జెప్పి
రందముగఁ దాము చేసిన•ఛందములను. 260

## జాత్యుపజాతినిరూపణము

క. గురులఘువులలో నెయ్యది
మురసంహార ప్రథమ పాద•ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గు•పదముల మొదలన్. 261

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే•తప్పంగరా దట్లైదన్
హరి తజ్జాతిగణంబులైన సరి యుం•ట్లైనఁ గావచ్చు మం
దరధారీ యుపజాతులం బ్రథమవ•ర్ణంబు స్వేచ్ఛంబుగా
సొరిదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు ని•ల్పు న్వర్ణమై యొక్కచోన్. 262

---

1 నీటిరు(ప.) 2 నొజ్ఝ (ప).

క. తెలియఁగ వినుమీ కామే, పలినామ గ్రామధామ • ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములు • శో విపరింతున్. 263

క. గురులఘువుల పేరిటియు, క్షరములు సప్తగణనామ • కము లగులిపులక్
సురరిపుగర్వతమోభా, స్కర దీర్ఘము లైన రెండు • గా నెన్నఁబడున్. 264

## కందషట్కాభిధానంబులు

గీ. *పరఁగఁ గందము పథ్యయుఁ • మఱి విపులయుఁ
జపలయును ముఖచపలయుఁ • జఘనచపల
లనఁగ గందపద్యంబు లీ • యాఱువిధము
లఖిలసుకవికృతులలోన • నలరుచుండు. 265

సీ. నలగగభజసగ • ణంబు లేను నె కాని కందంబునకు నొండు • గణము సొరదు
[1]పీఁటిలోపల నొక • మాఁటిచే వడి లేనిహీనపాదము ముందుఁ • గానఁబడును
దరువాత దీర్ఘ పా • దము పంచగణములఁ దగు దానిమూఁడవ • తావుకందు
నలజలు దక్కంగఁ • గలయు వామీఁదనే యతి దాఁకు నిజపదా • ద్యక్షరంబు

తే. తుదిని గానలు దక్కంగఁ • గదియ దొకటి, కొంచెపనుగులదేపుల • గొప్పకాల
నరుల జగణంబు గూడదీ • చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ • బూర్ణమయ్యె.

ఇవి సమస్తప్రబంధములందుఁ జెప్పెడుసహజకందపద్యలక్షణము:—

### పథ్య

ధరలోఁ బథ్యాకందము, హరి యగు నాఱవయెడ నల • మాఱిటిపై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయఁ జతుర్గణములు గము • నిలిచినచోన్.

### విపుల

క్షమ దేసికాలు సమపా, దములోఁ జొర కల్ల మొకటి • తనరింపక
సమధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు • కంద మగున్. 268

### చపల

[2]సమపదముల మొదలం జగ, ణముం గడయుడుగుసను ద్విగ • ణలఘువుపై
[3]సమకొనువిరతియుఁ బదిరేక్, లముల్ ముకుంద చప • లకు నమరున్. 269

*ఆ. పరఁగఁ గందముమఱి పథ్యయుం విపులయుఁ, జపలయుం ముఖచపల జఘనచపల
యనఁగనాఱువిధములై కందపద్యము, లఖిలసుకవికృతులనలరుచుండు

1 వ్రాఁతప్రతులన్నిటిలో 'పీఁటి' అనియేయున్నది. 2 సమపదముల మొదలం జగ,ణముగడపాదమునకు ద్విగ•ణలఘువుపై (ప. ఓ.)ఇందు రెండవపాదమున మొదటి గణము జగణముకాదు. 3 సమకొను యతి యాఱవయని, లమై ముకుందచప•లకు నమరుక్ (పూ. ము).

### ముఖచపల

స్థిరఁ జపలాకందముపైఁ, బరిఁ మొదలియడుగు చెప్పఁ•గఁ గవులు పె
ట్టిరి ముఖచపల యొకొదుపే, రరిదిగ వైకుంఠ వరద • యఘుజైత్రా. 270

### జఘనచపలాకందము

క్షమఁ బథ్యారీతిఁ బూర్వా, ర్ధము చపలాకందముక్రియఁ • దగు నపరా
ర్ధము జఘనచపలకు మునీంద్రమానసమరాళ • దాశార్హా. 271

క. గురువొకటి రెండు లఘువులు, సరియైనకతమున వృత్త•చయములఁ దక్కన్
బెరజాత్యుపజాతులు నిబ్బరముగ నెవ్వైన నిలుప•వచ్చుఁ గృతులన్. 272

### ఉత్సాహలక్షణము

[1]ఈవు మీఱ సూర్యగణము • లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ • జూచుచుండు సత్కవి
వ్యూహనుతులు గాంచి కృష్ణుఁ • డొడిసి కట్టి వట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ • ద్రోచెఁ గాల్గొ మీఁదుగాన్. 273

### తరువోజ

శతమఖత్రితయంబు • జ జాప్తు డొకఁడు శతమఖత్రయిమీఁదఁ • జను విశ్రమంబు
ప్రతిభ నియుడుగులొ•ప్పఁగ రెండుఁ గూర్పఁ బ్రతిమీఱనొక్కొక్క • పాదమైతనరుఁ
జతురంఘ్రు లీరీతి•జత కూర్చి సుకవి చతురవాచారూఢి•జలజాక్షునుతులఁ
గృతులందుఁ దరువోజ•నీరోజ నెసఁగఁ గృతకృత్యుఁ డై చెప్పు•తీతి నెల్లసభల.

పంచవిధాక్కరంబు లెట్టివనినః—

క. మధుదమన పురందరధా, మధిచంద్రగణాలిచే ఉ•మ మహామధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు • గ్రంథములందున్. 275

### మహాక్కర

సూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత • సుత్రాము లేవ్వరు పిఱుఁద నొక్క
తారకేశుండు జత యైన నిట్టిస•ప్తగణంబు లొక్కపాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ • జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై శ్రాంతి • యంత్పలాంగ మహాక్కరంబునకు. 276

### మధ్యాక్కర

మనువుగాఁ బ్రాసంబు గూర్చి • మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబు మీఁద • జలజాప్తు నొక్కనిఁ జేర్చి

---

1 ఈహాకాలశక్ర (ప. ఓ.)

యినుమడించిన నాలుగణము • లెససిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ • దగు నిట్లు మధ్యాక్కరంబు. 277

## మధురాక్కర

మురనిశాటేంద్రసంహార • మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు స•ధామయూఖునితోఁ గూర్చి
వరుసతో నేనుగణముఁ•పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ•తుల మధురాక్కరంబు. 278

## * అంతరాక్కర

[1]భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ • ములఁ ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి • నంతరాక్కరంబు
భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర. 279

## అల్పాక్కర

విరమంబు రెంటిపై • విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క•సోముండు రాఁ
జరణ మీమూఁటిచే • సాగి యొప్పు, హారిపపర్యంక యల్పాక్కరంబు. 280

## మఱియు, మంజరి

తుద మొదళ్లను [2]నంటి•దూఁకు శబ్దంబు, వర్జించి యతిమాఱు•ప్రాసంబు లిడక
ప్రాసంబు లేనిద్వి•పద యై చెలంగఁ, బ్రాసంబు తుదలందుఁ • బదిలంబు చేసి
[3](సాగింపఁగాఁ జాల•సత్కవీశ్వరులు, మోదంబు పెంపార • భూమిభూపలను
బద్మాక్షుఁ డెపుడు చే•పట్టుమంజరుల, చందాన నలరారు•జగతి మంజరులు.) 281

## ద్విపద

సురపతిత్రితయంబు • సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై • వెలయు నొక్కటికి

---

1 భానుఁ డిద్ద రాదిత్య • పతులు తమిస్రాపతియుం, జానుమీర నీనాలుగు• చరణములకు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర (ప. ఓ.) *భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు చంద్రుండు, పూని నాలుగు చరణ•ములఁ ద్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాకళత్ర. ఛందోభంగములేకుండ నిట్లు సవరణ చేయనగునేమో? 2 నంటితూఁకు (వ); నంటుతూఁకు (ఓ). 3 ఈరెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబు చేసి' తర్వాత కనఁబడుచున్నవి.

క్షితిఁ దగ నీరెంటి • చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన • మే లండ్రు కవులు. 282

### త్రిపద

తొలుత నలువు రింద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు
వళి లేక నలరారుఁ ద్రిపద. 283

### చతుష్పద (చౌపద)

జలజాసనవిశ్రమ • సంయుతమై, లలి షోడశమిత • లఘువులతోడన్
గలసి చతుష్పద • గతులను ధరలోన్, జెలఁగఁ జౌపద • సేవకసులభా. 284

### వితాళచతుష్పద

[1]భానుగణయుగము • పయి నవల లిం, పూన మణివిరతి • నొంది ధరలో
జానలరుఁ జతు • ష్పదవితాళ, ఖ్యానమున వినా • యకతురంగా. 285

### కర్ణాటచతుష్పద

మొగిఁ బంచలఘుగణం • బులు మూఁడు రవియుఁ
దగులఁదుదఁ బ్రాసంబు • దాఁక రెంటిపయి
నగువిశ్రమమునఁ గ • ర్ణాటచౌపద యి
సఁగుఁ గృతుల సత్కవుల • సమ్మతముతోడ. 286

### పంచపద

క. అని సమవృత్తములలో, నైదంఘ్రుల నెద్దియైన • నార్యులు పలుకన్
బాడుకొని కృతులలోపల, నాదరమునఁ బంచపాది • యనఁగా నలరున్. 287

ఉ. ధన్య సుశీల యన్వనిత • తత్పరత న్నదియొప్పునందు న
త్కన్యలు సేయఁను వ్రతము • తాను వేడుక నాచరించి స
న్మాన్యతఁ గట్టిగట్టిరవ • మండితతోర మనూయ చేసి పె
న్దైన్యము నొంది కానల ని • ధాత్రుకృతంబున సంచరించుకొం
డిన్యమహామునీశ్వరుఁ గ • డిందిగఁ బోఁచినరుక్మిణీశ్వరా. 288

---

1 భానుయుగముపై • పయి నవలనిం-అని పూర్వముద్రణము. రెండు సూర్య గణములపైఁ దొమ్మిది లఘువు లుండిన వితాళచతుష్పద.

### షట్పద

ప్రాసము లుమ్మాఱు • వాసవు లాఱును • పై సుధాదీధితితో గిర్యతి
భాసిల్లఁగాఁ బాద • మీసూటితో నాల్గుఁ • జేసినకృతు లందు షట్పదాఖ్య. 289

### నవవిధరగడలు

వ. మఱియు వైతాళీయభేదంబు లైనరగడ లనేకంబులు గల వందుఁ బ్రసిద్ధంబు లైన హయప్రచారాదినవవిధంబులు ప్రబంధంబుల వర్తిల్లు నవి యెయ్యవి యనిన. 290

క. నరసఖ హయప్రచారము, తరగఁ దురగవల్గనము వి • జయమంగళముల్
ద్విరదగతివిజయభద్రము, మధురహరి హరిణప్లుతగతులు • దొరలుం గృతులన్. 291

క. ఆద్యంతప్రాసంబు ల,భేద్యంబులు రెంటరెంటఁ • బెంచి పదంబుల్
హృద్యంబులు గూర్చిన నన,వద్యంబులు రగడ లెల్ల • వాలుం గృతులన్. 292

క. కొద లేనినైపుణులఁ జొ,పదచే నుత్సాహవృత్త • పదయుగ్మముచేఁ
దుద నాదిని బ్రాసంబుల, వదలక విరచింప వలయుఁ • బ్రాజ్ఞులు రగడల్. 293

### [1] హయప్రచారము

ఋతువిరామ • మిసఁలు నల్వు. రతుక నొక్క • యుం ప్రమి, చెల్వు
దనర హయతఁ • దార్క్ష్యుఁ డంచు, దనుజహరణ • దక్షుఁ డంచు
మును శుకాది • మునులు వొగడ, జను హయప్ర • చారరగడ. 294

### 2 తురగవల్గనము

ఇరవుల న్హయప్రచార • మినుమడించి కృతులఁ జెప్పు
దురు విదూరితాఘ్నివరణ • తురగవల్గనాఖ్య మొప్పు. 295

### 3 విజయమంగళము

తురగవల్గనంబు రెంటి • తోడ విజయమంగళంబు
ధూర్తకంసతూలదహన • తుహినహీరసదృశకీర్తి
పరఁగ దుగ్ధసింధుమధ్య • భాసురాంతరీపవర్తి
వారివాహసదృశమూర్తి • భక్తజనహృదబ్జవర్తి. 296

### 4 ద్విరదగతి

కర మొప్పఁ బంచలఘు • గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై • ద్విరదగతి పేరిచే. 297

---

1 వరుస-ఘ్రా. పు.

## విజయభద్రము

ద్విరదగతి రెట్టింప ♦ విజయభద్రము చెల్లు ♦
విదురపూజితపాద ♦ వేదసన్నుతనామ
దరచక్రకార్ముకగ ♦ దాఖడ్గధారణా ♦
తాపింఛసమగాత్ర ♦ దళితదైత్యస్తోమ. 298

## మధురగతి

[1]నాలుగుమాత్రలు ♦ నాటినగణములు, నాలుగు రెంటికి ♦ నలి విరమణములు
గలసి మధురగతి ♦ కనలను జగణము, తొలఁగిన ధృతకౌ♦స్తుభ కవిరమణము. 299

## హరిగతి

నలసభగగములలోపల నేవై♦నను నెనిమిది నాల్గిటిపై విరమము
గలసిన హరిగతి చెలు వగుఁ గృతులఁ ♦ గవివరు లౌ నని చెప్పిననియమము. 300

## హరిణగతి

నరహరి పదియు ♦ నాలుగులములు, కరియతి హరిణ♦గతికి నెళవులు. 301

## వృషభగతి

ఇరువదియొనిమిది లఘువులు [2]పది ♦ యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిర యగు వృషగతి పద్మాధిప ♦ యిది విను మాదరమున ముదమున. 302

## యక్షగానలక్షణము

సీ. తుద నేడులఘువులు ♦ తొలఁగించి చదివినఁ ద్రిపుటకు వృషభగ♦తిపదయుగము
లలిఁ గడపల నొక్క ♦ లఘువు మానిన జంపె మనుద్విరదగతిస♦మపదయుగము
గురు తగురచ్చెర♦కుఁ దురగ వల్గనాహ్వయ మేకతాళియా♦మధురగతికి (?)
నంఘ్రి) కిర్వదినాలు ♦ గటతాళమున మాత్ర లోలి విశ్రాంతి క♦ద్వాలుగింటఁ
తే. దెలియ నర్థంబు నర్థచం♦ద్రికలు వీన
యక్షగానప్రబంధంబు ♦ లతుక వచ్చు
రగడభేదంబు లివి యంద్రు ♦ రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ ♦ యబ్ధిధామ. 303

## ఉదాహరణలక్షణము

సీ. సప్తవిభక్తులు ♦ సంబోధనంబును గూడ నెన్మిదివిభ♦క్తులు గ్రమమునఁ
జలి పేరు దొరలంగ♦బద్య మొక్కటిఁ జెప్పి రగడభేదములు మా♦ర్గములు గాఁగ

---

1 నాలుగులఘువులు (ప). 2 పది♦హేనిట (ప).

గళికలు నెనిమిది ♦ దళములు గావించి దానితో సగము నుత్కళికఁ జేసి
యది యొక్కసమసమం ♦ బయ్యెడు దళము లెన్మిదిఁ గూర్చి వానికిం ♦ బద విభక్తి
తే. బయలు పఱచి కట్టకడను ♦ బద్య మొకటి, పలుక వలయును సార్వవిభక్తికముగ
నిర్వదాఱుపద్యములందు ♦ నిడిన ధాత్రి, నివి యుదాహరణ మటందు ♦ రిద్ధచరిత.
సీ. సంబోధనమునకు ♦ సరసాళి జయవతి ప్రసరుచి వాణి విరావళియును
శీతి ద్వితీయకు రుచిర ♦ కీర్తిమతియుఁ దృతీయకుఁ గీర్తి సుభగయుం ♦ నటఁ జతుర్థి
కిని దేవశోభిని ♦ యంచు భోగమాలిని ♦ పంచమికి నెసంగు ♦ వాణియును గ
ళావతి షష్ఠికి ♦ లలిత కాంతిమతియు సప్తమికిని ఘోణి ♦ సత్కమలయుం
తే. నాదిసూక్తులనామధేయములు వెలుకఁ, బలికినది వేల్పు లష్టవిభక్తులకును
వారుకమశక్తిఁ గొలఁదిని ♦ వ్రాలుఫలము, లిత్రు నాయకద్వయముల ♦ కిందిరేశ.
సీ. నాబుద్ధి యొడలించి ♦ సప్తవిభక్తులు పలికిన భక్తిసంస్థలి యనంగ
సంబుద్ధితోఁ గూడ ♦ సమవిభక్తులనిలఁ బలుక నొప్పారుఁ బంద్దలి యనంగ
సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ బలికినకృతియుం బద్దళి యనంగఁ
గళిక లుత్కళికలు ♦ గమకింపఁ బలికినకావ్యంబు నుత్ఫుల్లకం బనంగ
తే. నవనిఁ జాటుప్రబంధంబులందు మిగుల, నాటుకొనియొప్పుచుండుసు ♦ నాల్గుదెగలఁ
గానఁబడు నుదాహరణము ♦ ల్దానలోల, కామకల్లీక వల్లవీకామ కృష్ణ. 306

## ప్రథమావిభక్తి

ఉ. శ్రీవనితాసనాథుఁడు వశీకృతభక్తమనోంబుజుండు వి
శ్వావనుఁ డుగ్రసేనుఁ డురువైద్యుఁ డజేయుఁ డగణ్యసద్గుణ
ప్రావృతభూషణోజ్జ్వలుఁ డహర్పతికోటిమరీచి భద్రసం
తావళనాయకావనుఁ డుదారుఁడు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్. 307

## కళిక

మఱియుం దేవకీశౌరసేనికుమారనిర్మలరత్నరాజము
కలుషటసురుల నెల్ల దారుణ ♦ కదనధారుణి దునుము తేజము
బలిమి నందనవనముఁ గోపలి ♦ పారిజాతము ధరకుఁ దెచ్చెను
గోలఁది మీఱినసమ్మదంబునఁ ♦ గుండలంబులు తల్లి కిచ్చెను
జెలఁగి నరునకు సూతకృత్యము ♦ చేసి కౌరవులఁ బరిమార్చెను
దలఁపు మఱువనిదాగచయములఁ ♦ దవిలి తిరుగనిముక్తిఁ జేర్చెను
వెలఁదిగొఱుసను బాణుచేతులు ♦ వేయుం నఱికినవిక్రమోగ్రుఁడు
జలదములజిగి దెగడునొడలున ♦ జానుమీఱెడుశుభసమగ్రుఁడు. 308

ఉత్కళిక

కమలనేత్రు నిరీక్షించుచు • యమునయొడ్డునఁ దపము సేయుచు
నున్నకాంతను జూచి రయమున • నున్నసుద్ది వచించి ప్రియమున
నరుఁడు గూర్చినమిత్రు నానతి • కరము పట్టెడుదానిఁదానతి
విదళితాసురసార్వభౌముఁడు • యదుకులాంబుధిపూర్ణసోముఁడు. 309

ద్వితీయావిభక్తి

ఉ. మానవులార రోగములు • మానుచు లేములు లేవు సంపదల్
జా నగు దుఃఖము ల్దొలఁగు • జాఱు నఘంబులు మందబుద్ధులై
దీనత నొంద నేటికి సంతతస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరు వసుదేవకుమారకు ముక్తికోసమై. 310

కళిక

[1]మఱియుం ద్రేతల నెల్ల • మరులుకొల్పినవాని
మెఱసి కానను బసుల • మేపి తిరిగెడువాని
భామతో దూర్వాసు • బండియాడ్చినవాని
వేమరెదిరినమగధు • విరగఁ ద్రోసినవాని
బాలుఁడై ఱోలెక్కి • పాలుద్రావినవాని
హేలతోఁ బదిరూపు • లెలమిఁ దాల్చినవానిఁ
దాళవృక్షము లెల్ల • ధరణిఁ గూల్చినవాని
గాలిరక్కసుఁ జావఁ • గాలఁ దన్నినవాని
లీలఁ గొల్లను గడిఁది • లేమిఁబాపెడివాని. 311

ఉత్కళిక

మందు పాపకుఁ గొల్చి • ఖాండవాహుతి వ్రేల్చి
పార్థివేశ్వరుఁ గాంచి • పార్థు నక్కడ నుంచి
దారకుం దమరించి • చేరఁ దెచ్చినమంచి
యరద మె*క్కక పూని • పురికి వచ్చినవాని. 312

1 ఇందు రెండవచరణము మొదలుకొని అయిదుపాదములు పూ. ము. లలో లేవు. (ప. ఓ) లలోఁగలవు. (పూ. ము.) లలో ఇందలి 1-7-8 పాదములును (ప. ఓ.) లలో లేని 'లీలఁగొల్లను గడిఁది•లేమిఁబాపెడువాని' అనుపాదమును ఇట్లు నాలుగు పదములు మాత్రమే కలవు. *'కొను' పుక.

### తృతీయావిభక్తి

చ. పులసిల నేల మానవుల•[2]పుట్టను పావన మయ్యె నెప్పుడున్
[3]గళవడ మేల రోగము ల•కాలగతిం గనవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు • దవ్వుల కేఁగును వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమ•లాధవుచే వటపత్రశాయిచేన్. 313

### కళిక

మఱియుఁ బ్రహ్మమాయఁ గెల్చి • మసలుమంత్రవాదిచేత
నెఱిఁగి సౌంధకునకు వరము • లిచ్చి మెఱయు మోదిచేత
మృతతనయుని మరల గురున • కిచ్చినట్టియచ్యుతుచేత
సతులరాసకేళి నలిపి•నట్టియాదిపటునిచేతఁ
బిండి రుబ్బునాతి మోము • పెరుఁగు దుడుచుకొంటెచేత
మంచుచన్నకారుచిచ్చు • మరిగి త్రావునమునచేత
నెలుఁగుతోడఁ బోరి మణియుఁ • నింతిఁ గొనినయజునుచేతఁ
వెలయఁ దులసిపూసపేరు • వేసికొనినజోగిచేత. 314

### ఉత్కళిక

గట్టిగళరపంజరంబు • గట్టఁ దలఁచి వేగిరంబు
చపుటికడలిచెంతఁ జేరి • పవనతనయుతోడఁ బోరి
తన్నుఁ జేరినంత వచ్చి • చెన్నుగెలుపు నరున కిచ్చి
మహిమ మెఱయుఁ గృష్ణుచేత • మిహిరకోటిదీప్తిచేత. 315

### చతుర్థీవిభక్తి

శా. ఓలిం బాసకుఁ దేక మత్సరముతో • నాపొంగి వెక్కెండులా
ఖీలాకారమునం గొలంకు[4]నడుమన్ • బేటాడునక్రంబుతోఁ
జాలం గయ్యము చేసి చిక్కినమద•స్తంబేరమస్వామికై
కేలం బట్టి నిమిర్చినట్టిహరికై • కృష్ణాంబుధృష్ణార్తికై. 316

### కళిక

మఱియునుఁ గౌమోదకియును ఖడ్గము • మఱియును శంఖముఁ బట్టినహరికై
మెఱయఁగ విద్యుచ్చేలముఁ దాల్చిన • మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై
వెలుచం గదిసిన[5]మల్లుల నిరుపురఁ • బిడికిటఁ బొడిచినబలుమల్లునకై
వెలయఁగ యమునానదిలోఁ గాళియ • విషధరుఁ దోలినయదుసింహునకై
విజయునిరథసారథి యై గురునృప•భీష్మాదులఁ గెలిచినభూపతికై

---

1 పులకిల (పూ. ము.) 2 పుట్టువు. (ఓ. పూ. ము). 3 గళవళ మేల (పూ. ము). 4 నడుమ•న్మిట్టాడు (పూ.ము); నడుమన్•బేపాడు (ఓ). 5 మల్లుర (పూ.ము.)

గఱిగా యవనాభిధు ముచికుందునిఁ • గనుదృష్టినిఁ జంపినశ్రీపతికై
బలువిడి దేవకితండ్రిని మధురకుఁ • బట్టము గట్టినగోవిందునకై
గెల దాల్చినవైఖరి గోవర్ధన•గిరి మోఁచినమహదానందునకై. 317

ఉత్కలిక

తొలిపుట్టువునోము[1]ఫలంబున వే,బలువిడి నను పేదఱికంబున వే
సరి కొండల మందుచుఁ బైకంబై, పురికిం బరమానందమునం బై
కొని యంబ్బుచు వచ్చి కలిమిపనికిం, గని యడుకు లొసంగినబాపనికిం
గలి మిచ్చినబాలస్నేహునకై, కలుములచే నేలినకృష్ణునకై. 318

పంచమీ విభక్తి

మ. పురిటింటం బసిబిడ్డచందమున వా•పోవంగ నాఁ డాత్మలో
మురు వొప్ప న్విషదుగ్ధయుక్తకుచ యై • ముద్దాడు రాకాసి *చ
న్నిరు కేలంగొని బాలు ద్రావుమిషచే • నిర్వైనకాలంబునన్
ధరణిం గూల్చినసంపపుత్త్రువలనం • దార్క్ష్యణధర్మస్థితుల్. 319

కళిక

మఱియును గీతామృతస•ముద్రసింధునివలన, వఱలు భవపటుతిమిర•వనజబంధునివలన
బొంకు టెయ్యెడ లేని•భూరిసత్యునివలన, జంకు టెన్నఁడు లేని•సమరనిత్యునివలన
ఖేదము ల్విడబాపు•[2]కేశిమర్దనువలన, నాదికారణమూర్తి • యగుజనార్దనువలనఁ
గాన రానిపదముల•గాముపానుపువలనఁ,[3]బూని గొడ్రాలికిం • బుట్టెకానుపువలన.

ఉత్కలిక

[4]తను బిల్వ మిగురు గూర • దిని పాక మింపారఁ
జేసి ద్రౌపదిచేత • నాస దీరఁగ మేఁత
యడిగినమునీశులకు • నిడఁ గల్గుదాసులకుఁ
గల్పించుహరివలనఁ • [5]గల్పస్థాయివలన. 321

1 ఫలంబున నే (పూ. ము.) అంత్యప్రాసనియమభంగము. 2 కేళి (పూ. ము.) 3 పూనిగొడ్రాలికిఁ బుట్టు కానుపువలన (పూ. ము.) ఛందోభంగము; బూని గొడ్డురాలికి (ఓ. ప). 4 తనుఁ బిల్వమిగుల (పూ. ము.) ఈచరణమున 21 మాత్రలున్నవి. 5 ఛందోభంగము *గుర్తుతెఁ గిష్టంబుగఁ......నిర్వైన కాలంబునన్ (పూ. ము.) ఇది "క్త్వార్థకారసంధి" ఇది యప్పకవి యుపయోగించి యుండఁడు. కాఁబట్టి దీనిని సవరించుట న్యాయ్యము. మహాలాక్షణికుఁ డైనయప్పకవియె యిట్టియశాస్త్రీయమైన సంధిని జేసినచో నాంధ్రభాషకు ముప్పువచ్చుననుట యతిశయోక్తిగాదు. మఱియు "నిర్వైన" అనుపదము మిక్కిలి కర్ణకఠోరముగనున్నది. తక్కినపద్యాలైలినిచూడగా పదముల మార్దవము స్పష్టముగదా.

## షష్ఠీ విభక్తి

శా. [1]కారాగారమునందు వెల్వడి భుజం•గస్వామి సుచ్ఛత్త్ర మై
పై రాఁ దార్క్ష్యుఁడు వాకిట [2]ద్దెలుప సం•భ్రీస్తోమముల్ మీఱఁగ శ్రీ
సూరోద్భ్యాతి పథం బొసంగఁ దనుఁ గొం•చుం దండ్రి యేతెంచి [3]దా
ల్వారేపట్టైను నిల్వఁ బొల్చు[4]హరికి • న్వాలార నేమ్రొక్కెదన్. 322

కళిక

మఱియుఁ బేఱియ సెఱియ సుఱిమియు•మధునిఁ గూల్చినట్టిహరికి
నఱిమి తఱిమి చఱిమి నుఱుమ•నక్రుఁ గెల్చినవిశకరికిఁ
గఱచి చఱచి యఱచి పఱచు • కపినిఁ జంపినచ్యుతునకు
మఱిగి తిరిగి విఱిగి [5]సొరగు•మద్దులీడ్చినయమితునకు
[6]సరలి కెరలి వరలి మరలి • సాళ్వుఁ జంపినక్షరునకు
గరిమ మెరిమె రొరిమి సిరిమి • కామెపట్టిమందిరునకు
నయమునఁ బ్రియము రయము జయము • నరుని కిడినకేశవునకు
వ్యయము భయము లయము క్షయము • వైరి కొసఁగుమాధవునకు. 323

ఉత్కళిక

[7]గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ • బెల్లుజల్లు లల్లి రాళ్ల
సోనవాన మాన పూని • కాన రాని[8]లోనకోన
చుట్టి పట్టి గట్టి దిట్ట • రొట్టు గట్టు మట్టు గుట్టు
నూఁచి లోచి నోచి మోఁచి [9]బ్రోచినట్టివామనునకు. 324

## సప్తమీ విభక్తి

మ. పృథులావంతివరస్వయంవరమున • న్విందానువిందాదులన్
బ్రథనక్షోణిని గెల్చి సద్గుణ సుభ•ద్ర స్ఫూర్తిఁ దోకొంచు వ
చ్చి ధరాధీశునసుజ్ఞ చే ననలసా•త్మీకంబు గృహోత్క్షిప్త
ద్వ్యథిఁ బెండ్లాడినకృష్ణునందు నిలిచె • [10]స్థిరప్రతాపోన్నతుల్. 325

కళిక

మఱియు సుగ్రసేనా•మాత్యునందు, నెఱి మీఱ లయకాల•నిత్యునందు
విదురార్చితపదార•విందునందు, [11]విదళితఘోరారి•బృందునందు

---

1 కారాగారమునుండి. (పూ. ము.) 2 ద్దెలియ (ప). 3 చెల్వారంబట్టైను. (పూ.ము). 4 హరికీ•వాలార (ప). 5 యొరగు (పూ. ము). 6 సరలిమరలి కెరలివరలి-సాల్వుఁ జదిపినక్షరునకు (ప. ఓ.). 7 ఇందు (పూ. ము) లందును (ప.) లోను మూఁడు చరణములు మాత్రమే ఉన్నవి; (ఓ) లో నాల్గుచరణములున్నవి. 8 కాన (పూ. ము.) 9 బ్రోచినట్టి వామనునకు (పూ.ము); బ్రోచినట్టి వామమునకు (ప). 10 దీర్ఘ (పూ.ము). 11 ఛందోభంగము.

సాభీరువస్త్రాప♦హారునందు, బలిపట్టణద్వార♦పాలునందు
జలగాదిదశతనూ♦చ్ఛాదునందు, నాభీలకంససం♦హారునందు 32

ఉత్కళిక

సజ్జనాగంబు, రజ్జునాగంబు, కంధియోగంబు, మందరాగంబు
రాపుతో నూఁచి, వీఁపుతో మోఁచి, వెలయుఁహరియందు, జలజాక్షునందు. 32

## సంబోధన ప్రథమావిభక్తి

ఉ ధర్మజుఁ డంపిన న్నరిగి ♦ దంతిపురంబున నాంబికేయుంతో
ధర్మముఁ జెప్పి దుష్కృతుల ♦ [1]దగ్గఱ శాంతనవాదిసజ్జనుల్
నిర్మలచిత్తు లెల్లఁ గను♦నేరుపున న్సభఁ దాల్చినట్టిని
న్నర్మవహాకృతిం దలఁతు ♦ నాదుమనంబున నందనందనా. 32

కళిక

[2]మఱియుం జగన్మోహన♦మాయఁదాల్చినజాల, యిఱుమఱఱి ద్రౌపదికిఁ♦జీరలిచ్చినకా
సఖులతో నదిలోనఁ♦జల్లి గుడిచినబాల, విఖనసుం డెదలోన♦ వేఁ దలిర్చినలోల
నరుతేరినొగలపై ♦ నాట్యమాడినవీర, సరకుగొని భీష్మపైఁ ♦ జక్ర మెత్తినశూర
తరిని సద్గురుసుతుల♦దాపరించినసదయ, పెరిమెనాగపురంబు♦వెక్కలించినవిజయ

ఉత్కళిక

గురుభీష్మరాధేయుం ♦ లురుజన్యమున నేయం
శరవహ్ని బయ లెక్కి ♦ యరద మెల్లను నెక్కి
[3]తరి గాల్చునెడ పాండు♦వరుల నేగురి మెండు
బ్రతుకఁ జేసినపుణ్య♦వితత దీనశరణ్య. 330

## సార్వవిభక్తికము

శా. నీ వొక్కండవు నిన్ను నమ్మి కొలుతు ♦ న్నీచే సుఖం బబ్బె నీ
కై వే దండ మొనర్తు నీవలన ని♦ష్టావాప్తి చేకూఱె నీ
కే విశ్వాసముఁ [4]జేర్చి తింక మదిలో ♦ హెచ్చయ్యె నీయందు నా
కై వారంబులు శౌరసేనతనయా ♦ కామేపలీవల్లభా. 331

ఉ. నామన విచ్చగింపు మిట ♦ నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం
తామణికల్పనోక్తికల♦నాచతురోపమ ముల్లసిల్ల ని
చ్ఛామతి నర్పణంబుగ నొ♦సంగితిఁ గామెపలీశ నీకు నై
రామయ మై తగ న్భువదు♦దాహరణంబు జగత్ప్రసిద్ధిగాన్. 332

---

1 దగ్గఱ (పూ. ము.) యతిభంగము. 2 ఛందోభంగము. 3 తరుగాల్చునెడ పాండు♦తనయుంలేగురి మెండు(పూ.ము.); తరిగొల్చు (ఓ.); తరుగొల్చు (ప.); మఱికొన్ని తాటాకుపుస్తకములు చూచినగాని సరియైనపాఠము నిర్ణయించుటకు సాధ్యముగాదు. 4 జేర్తు నింక(పూ.ము.).

వ. సీసంబు లనునవి సమవిషమంబుల రెండుదెఱంగు లయ్యె వానివిశేషంబు లెట్టివనిన.

## సీసమాలిక

యతి నైనఁ బ్రాసంబు • నంతైన [1]నొకటితోఁ జెప్పరే నియమ సమ•సీస మగును
నియమమ ల్లేనిపై • నిలిపిన సీసంబు లాఱుదెఱంగు లై • యతిశయిల్లు
నెనిమిదంఘ్రులఁ బ్రాస • మెక్కింప వల్లనై సర్వతఃప్రాససీ•సం బనంగఁ
బ్రాస మాఱంఘ్రులఁ • బదిలంబు గావింప నక్కలిప్రాససీ•సాఖ్య మనఁగ
నాదిఁ జేవడి నిల్పి • రావడే పద మెల్లఁ జేయ నయ్యాది వడి•సీస మనఁగఁ
పదఖండములయందుఁ • బ్రత్యేకయతులుగా స్థిర నవకలివడి•సీస మనఁగఁ
గుదురుగా నుత్సాహ • తుదయందు గీతంబు చెప్పిన విషమాఖ్య•సీస మనఁగఁ
గడ వెళ్ల లఘువులే • కల్పించి రెద్దాన సరవి సర్వలఘుసీ•సంబు ననఁగ

తే. సప్తవిధము లివియ శబ్ద•శాసనుండు, పంచమామ్నాయఫక్కిలోఁ • బల్కెఁగాని
కడమకవు లాఱుసీసము • ల్విడిచి పెట్టి, చెలఁగి సమసీసరద్యమే • చెప్పినారు. 334

అందుసీసలక్షణ మెట్టిదనిన:—

క. సురపతు లాఱ్గురిపై భా,స్కరు [2]లిరువురు గూడ నొక్క•చరణము బొల్పుం
బరఁగు నవి నాలుగడుగుల, విరమముపై రెంట • వెలయఁగ వలయున్. 335

క. వాసిఁ జరణములు నాలుగు, చేసి తుదిని గీత మొకటి • చెప్పఁగ నయ్యెన్
సీసము తంగెడదేశవి, భాసురశుభఖేల కామె•పలిగోపాలా. 336

## సమసీసము ౭

ప్రతికించె నెవ్వాఁడు • మృతగురుతనయుని మెలఁత వేఁడిన మెచ్చి • మేలుచేసెఁ
బోషించె నెవ్వాఁడు • పాదివినదారుణాపద లెల్లఁ దొలఁగించి • పాండుసుతుల
వెడలించె నెవ్వాఁడు • వెడపాడుబావిలో నూసరవెల్లి యై • యున్ననృగుని
మర్దించె నెవ్వాఁడు • మాసలంబున వృష్ణియదుభోజసైన్యాంధ•కాదినృపుల

తే. ప్రేల్చె నేవాఁడు ఖాండవ•విపిన మెల్ల, జాతవేదోత్థవిలసిత•జ్వాలమీఁద
నతనిఁ గీర్తింతు మదిలోన • ననుదినంబు, ననఁగ నలరారు సమసీస • మఖిలకృతుల.

## సర్వతఃప్రాససీసము ౬

వేదండవరదుండు • వేధోండగాంగుండు కాదేనశయనుండు • యాదవేంద్రుఁ
డాదిత్యవంద్యుండు • నాదానసులభుండు వేదాంతవేద్యుండు • కాదనీలుఁ
డాదితేయుఁడు బిందు•నాదకళాతీతుఁ డాదిత్యకులజుండు • బాధితారి
మేదినీరక్షకుండు • భూధరగాత్రుండు శ్రీదమిత్రసఖుండు • ద్వాదశాత్ముఁ

---

1. రెంటితోఁ (వ్రా. ము.) 2. లిద్దఱు సీసదీర్ఘచరణమునకగున్, చరణాది పంచమాదియు • విరమముతై రెంటి, రెంటి వెలయఁగవలయున్

తే. డాదిదేవుఁ డాశ్రితగంధ•మాదనుండు, చేదిసాంభకవైదర్భ•సూదనుండు
మేదురమురళినాదవి•నోదుఁ డనుచుఁ, జెప్పినను సర్వతఃప్రా•ససీస మగును. 338

### [1]వృత్తప్రాససీసము

శిక్షించె నెవ్వాఁడు • [2]చేటుకై సభలోనఁ జెడుమాట లాడిన • చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు • ద్రౌణిబాణముచేతఁ [3]జిదియకుండఁగఁ బరి•క్షిన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు • పర్వతాకృతిచేత శాఖీరు లర్పించు • నారగింపు
వీక్షించె నెవ్వాఁడు • వేడ్కతో సేవకుల్ బ్రతుకునట్లుగఁ గృపా•పాంగదృష్టి
తే. దాక్షిణాత్యుని సాంభక•ధారుణీశుఁ, జంపె నెవ్వాఁడు పోరిలో • సాహసమునఁ
బక్షిరాజతురంగుఁ డ•వ్వాఁ డనంగఁ, దెలుగుచుండు వృత్తప్రా•ససీసము లిల. 339

### వడిసీసము

విజయసారథిఁ గాని•వినుతింపఁగా నొల్లఁ గిరినాయకునిఁ గాని • కీర్తిసేయ
యాదవేంద్రునిఁ గాని•యభినుతింపఁగ నొల్ల మధుసూదనునిఁగాని • మదిని నిల్పఁ
బద్మనాభునిఁ గాని • ప్రణుతింపఁగా నొల్లఁ బాణీసపతిఁ గాని • ప్రస్తుతింప
బాణసంహరుఁ గాని • భజియింపఁగా నొల్లఁ బీతాంబరునిఁ గాని • ప్రీతిఁ దలఁప
తే. నవితవేదండపతిఁగాని•యనుసరింప, ననుచు నినుఁ గూర్చి యనురక్తి • నాత్మ నెపుడు
పొగడుసత్కవి[4]వ్రజములఁ • బ్రోచి తనఁగఁ, దనరు వడిసీసభేదంబు • తాళభేది.

### అవకలివడిసీసము

సామాజికాహిత•స్తోమంబు సామంబుగా మించి మైత్రికి • నామతింప
నభిమానధారుణీ•విభులు దానంబుచే నక్కఱ లన్నియుఁ • జక్కఁజేయ
నతిరుక్షపక్షమా•వతులు భేదంబుచే దినదినక్షీణత్వ•మునకుఁ జెడఁగఁ
బదిలింపుటుద్దండు • లాదిగి దండంబుచేఁ దనయాజ్ఞ యాదల • నునిచి నడువ
తే. సంధియానాదిషాడ్గుణ్య•బంధురముగ, [5]నోమి శక్తిత్రయోపేతుఁ • డైన మురారి
నేల ననురక్తి నీతితో • నేలె ననుచుఁ, జేయ నవకలివడినామ•సీస మగును. 341

### విషమసీసము

అంచితముగ భీమునకు స•హాయ మేఁగుదెంచి తా
నించు కేదిరి దురముసేయుఁ • నేయునంకుశంబు తా
కించుకోనక కినుకవలనఁ • గెరలి నరకపుత్త్రు మ
ర్దించినట్టిసవ్యసాచి • తేరిఘోటకావలిం

---

1 దీనికే (శ్రు. ము.) లో అక్కలిప్రాససీసమని పేరు. 2 చేట్కయ్యె (ప)
3 చిక్కకుండఁగఁ (శ్రు. ము). 4 జనములఁ (ప). 5 నార (శ్రు. ము).

ఆ. దోలుకృష్ణ యంచుఁ•దోరంపుటుత్సాహ, మీఁద గీత మొకఁడు • మేలవింప
విషమసీస మనఁగ • వెలయుఁ గామెపలీశ, జమ్మిచెంత నున్న•చతురవచన. 342

*సర్వలఘుసీసము :

క. షమ షట్త్రింశల్లఘువులు, త్రిమహేశవిరామము గల•దీర్ఘపదచతు
ష్కముపై నొకగీతి మఱి, ప్రమథన సర్వలఘుసీస•పద్యమున కగున్. 343

సీ. చిఱుతయగు కొడుకున [1]కెఁ•దరయి మృతికి మొదలగు
[2]టూరులవలన విని రుష•[3]వరుషుఁ డగుచు
చరమశరధిజలముల • తరణి మునుగక మునుపు
దురమున నురువడి బలు • దురుసుపరచి
కెరలి గొనయము దురిమి • మురిగుణము మొరయిడఁగ
నిరికిన శితశరములు • పరువ విడుప
జరిగి నెళశౌలిఁ గొదిగి • మఱుఁగున నిలిచిన కురు
పతిమఱఁదిని నెరి నురు • మగను దలఁచి

తే. చేసినట్టిప్రతిజ్ఞ శాసింపఁగోరి, సవ్యసాచిశతాంగంబు • సైంధవములఁ
దోలుగోవిందునుతులచేఁ•దొడరుఁగృతుల, సర్వలఘుసీసపద్యంబుఁ•సాగుచుండు. 344

క. బలసోదర! గీత్యుదితార్యలు సా ల్గార్యాఖ్యగీతు • లాటవెలఁదితే
టులు రెండు సమము లెత్తుక, మలనాహ్వయ పవడలు విష•మంబులు మూఁడున్.

సమగీతి

షమఁ బథ్యాకందముచంద్రమునన్ రెండవలు దెలియఁ • దనరింపన్
సమ మనుగీతి కృతులలోఁ, గమలాహృదయాబ్జ నిలయ • కమలాక్షా. 346

ఉద్గీతి

మొదలిసగము చపలగతిం, దుద సగము పథ్యగతిని • దొడరంగా
నిది యుద్గీతి యనం దగు, విదురాక్రూరాదివరద • వేణుధరా. 347

---

* కరివరద పరమకృప • ధరణిధర సురవినుత కనకవసన నరహరి • గరుడగమన
నళినకరపదనయన•దళితఖరదనుజలయ నరసఖ పరగుణనిధి • శరధిశయన
పరమపదనిలయ హరి•పరమపురుష ప్రకృతికిఁ బరుఁడని నినునిగమని•వహముపలుకు
నిరతమునుహృదయమున•నినుఁ దలఁతునను మనుపు మనియనఘచరిత జల•దనిభతనువ
తే. సర్వలఘుసీస మీరీతి•సకలసుకవివరులు చెప్పుదు రిలమీఁద•వరుస నెల్ల
వారు మెచ్చంగ సర్వేశ • వారిజాక్ష, కామెపల్లీశ యచ్యుత • కామజనక. 345

ఈపద్యము (పూ. ము.) లో నున్నది. 1 కెదురయి (ప). 2 ఊరుల (ప).
3 వరుషుఁడనుచు (ఓ).

ఉపగీతి

ధరఁ జపలాకందము వైఖరి న్నగం బైనఁ • గావ్యములన్
బరఁగు నుపగీతి పూర్వార్యమర ప్రజతమిత్ర • మార్తాండా. 348

ఆర్యాగీతి

సముదీరితపథ్యార్యాకందముకన్నను నొక్కగురువు • దాకించినచో
క్షమ నార్యాగీతి యగు, స్థమలాప్రాణేశ సహజకందం బదియే. 349

సమగీతులందు నాటవెలఁది

మేలు మే లటంచు • మిత్రులు ముగ్గురు, వింత వింత యనుచు • విబుధు లిద్ద
అహాహా యనుచు సూరు•లయిదుగురును మెచ్చ,నాటవెలఁది మాఁట•నలరు సగము.

తేటగీతి

మిత్రుఁ డొక్కఁడు వీణియ•మీటుచుండ, విబుధవరు లిద్ద ఱర్థంబు•విప్పి చెప్ప
వినులు నిద్దఱు వినుచుండ•నేకగతిని, దేటగీతంబు మాఁటను • వాటమయ్యె. 352

విషమగీతులందు నెత్తుగీతి

సురనాథుమీఁద•సూరు లిరువురు రెంట విరతి
ధరణిఁ బ్రాసంబు • [1]దనరు హరి యెత్తుగీతియందు. 351

కమలనగీతి

హగణ మైనఁ జాలు నగణ•మైనఁ జాలు హగణ
నగణములును రెండు గలసి • నాటి యంశ్మి కేడు
తగినవిరతి నాలుగింటఁ • దనరఁ బ్రాస మొదవి
మిగుల మెఱయుచుండుఁ • గృతులఁ గమలనాఖ్యగీతి. 353

పవడగీతి

అవని ముగురుభాను • లాదిత్యపతు లిద్దఱు, అవల నేగు రర్కు • లర్థమునకుఁ
బవడగీతియందుఁ • బ్రాసముల్ సమకూఱు, నవియె యాటవెలఁది•యందు లేవు.

వ. ఇది సవగీతివివేకం బింక బిరుదావళిలక్షణం బెఱింగించెద. 355

తే. క్షితి మహారాష్ట్రభాష చేఁ•జెప్పఁబడెడు, భీకరోక్తులు బిరుదు లై•యొక్కదనరు
[2]వాటబిరుదావళియొనర్ప•వలయునండ్రు, బుధులుసంబుద్ధి పదములు•పొసఁగఁగూర్చి.

---

1 దనరుసెత్తుగీతియందు (పూ. ము.) ఛందోభంగము. 2 వాని (పూ.ము). 'వాట' అని ప్రాఁతప్రతులలోనిపాఠము తప్పని దిద్దినయెడల 'వాస' అనియుండవలెను.

చ. అతిభుజవిక్రమోద్భవము • లై రిపుకర్ణకఠోరకంబు లై
[1]యతులితవీరవాక్కు లయి • యాదిమపార్థివలాంఛనంబు లై
ప్రతిపదనూతనంబు లయి • భాసిలుసూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు•దావళి సార్వవిభక్తికంబుగాన్. 357

చ. సలలితవాక్యగుంభనల • సర్వవిభక్తుల [2]దీపనంబులన్
జెలు వగుపద్య మొక్కటి ర•చించినపిమ్మట గౌడరీతి సం
కలితచతుష్కషట్కదళ•గద్యము లెన్మిదియుం బదాఱు నిం
పలరఁగఁ గూర్చి పేర్చి బిరు•దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్. 358

## చక్రవాళము

క. ఒకపద్యముపిదప దళా,ష్టకసందర్భాష్టగద్య • చతురం బగుభ
క్తిఁ జేయ చక్రవాళం, బకట చతుర్భద్ర మదియొ•యచ్యుత మఱియున్. 359

క. తొలిసమసనాంత్యవర్ణయు, గళమే పునరుక్తిఁ గాఁగఁ • గైకొని సామీ
ప్యలసత్సమాసము మొదల, నలరించినఁ జక్రవాళ • మగు దాశార్హా. 360

తే. అవధరింపుము దేవ ది•వ్యప్రభావ, భావనాతీత నిస్తుల•[3]పరమపూత
పూతనాజైత్ర సుత్రామ•పుత్త్రమిత్ర, మిత్రశశినేత్ర నిర్జర•స్తోత్రపాత్ర. 361

## చిత్రకవిత్వము

సీ. అనులోమము విలోమ•ము నిరోష్ఠ్యమును దల,కట్టును గుఱులు శృం•గములు నక్ష
రవిలోపమును బద•భ్రమకంబు పద్యభ్ర,మకమును నష్టెంట్లు • మఱియు నేక
పదియు ద్విపదియుఁ ద్రి•పదియును నేకవర్ణంబును ద్వ్యక్షరి • త్ర్యక్షరియును
సరవి నిచ్ఛావాక్య•సంఘట్టనంబును, నాదిగాఁ గొన్నిప•ద్యంబు లెల్ల

తే. క్షితిని జిత్రకవిత్వప్ర•సిద్ధనామ, ధేయములచేతఁ బెంపొంది • తెలివి మీఱు
[4]వానిఁ దెలియఁగ వచియింతు•వాసుదేవ, నందగోపాంగనాపుత్త్ర•నరకజైత్ర. 362

## అనులోమము

క. దామోదరసామతనధ, రామాసరసాకరదశ•రథహరిరాధా
కామా సదయాలిపరమ, ధామా వరయాదవకుల•దారకరాసా. 363

## విలోమము

సారాకరదాలకువద, యారవమాధామరపలి•యాదసమాకా
ధారారిహాథరశదరక, సారసమారాధనతమ•సారదమోదా. 364

---

1 యతులనిరుద్ధ (ప.ఓ.). 2 దివనోక్తులన్ (ప.ఓ.). 3 పరమమూర్తి (పూ. ము) పునరుక్తి నియమభంగము. 4. వాఁటి యని తాటాకుపుస్తకములన్నిటను గలదు.

## నిరోష్ఠ్యము

క. పావన పాఫాబాభా, మావా యనుసాటులిపులు ♦ మఱి పద్యములో
భావింప దొరల కుండిన, భూవలయమున న్నిరోష్ఠ్య♦ము విసాళించున్. 365

క. నరహర్యక్ష దయాకర, కరిరక్షణ చక్రహస్త ♦ కాంచనచేలా
గరుడతురంగ జనార్దన, ఖరదైత్యనికృంతన హరి ♦ కంజదళాక్షా. 366

## తలకట్లు

క. హర కలశజ తపన పవన, శరభంగ మతంగ దక్ష ♦ సత్యావాసా
స్మరపదయుఁగ గరుడధ్వజ, ధరధర మమ్మరయుఁ మనఁగఁ ♦ దలకట్టులగున్. 367

## గుడులు

క. విరివిని సిలిచిరి విసిచి,క్కిరి దివి నిశిఁ దిరిగిరి తిరిఁ♦గి మిడికి ధీతి
ల్లిరి చింతిల్లిరి తిఎరిరి, సిరికొలకు ధనాఢ్యు లనఁగ ♦ క్షితి గుడుసు లగున్. 368

## కొమ్ములు

క. గురుఁడును శుక్రుఁడు సుగ్రుఁడు
పురుహూతుండును శుకుండు ♦ బుధుఁడును గుహుఁడుఁ
బురుకుత్సుండును గుత్సుఁడు
గురునుతు లొనరించి రనఁగఁ ♦ గొమ్ములు కృష్ణా. 369

## అక్షరవిలోపము

క. రవికన్యాసుందరకర, మవలంబన మొర్చి యూఁదె ♦ నచ్యుతుఁ డని యే
నవవర్ణవిలోపముగా, నవనిం బఠియింప వలయుఁ ♦ నార్యులు నలరన్. 370

## పదభ్రమకము

క. ధీరానానారాధీ, ధారాకరతాతరళిత ♦ తారకరాధా
ధారానుతతసురాధా, ధారితకరిధావ నాఁ బ♦దభ్రమక మగున్. 371

## పద్యభ్రమకము

క. రాధానాథా తరళిత, సాధకరథతావరసుత♦సరసనిధానా
నాధానిసరసతసురవ, తాధరకథసాతళిరత♦ధానాధారా. 372

## నల్లెంట్లు

క. నారదమునిశార్దూలము, తూరిమి నఱినంబు గప్ప♦కొని వేడుకతో
నారాయణనామమున క్రన్నారత మేతెంచు ననఁగ ♦ నల్లెంటు లగున్. 373

### ఏకపాది

తే. మతివిశాయకభరితస•మ్మనుఁ డనంగ, మతివిశాయకభరితస•మ్మనుఁ డనంగ
మతివిశాయకభరితస•మ్మదుఁ డనంగ, మతివిశాయకభరితస•మ్మదుఁ డనంగ. 374

### ద్విపద

తే. సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి • సరసిజాక్ష
భోగిభోగాసనుం డని • [1]పొలుచు టరుదె
సౌమ్యగురుకవుల్ నినుఁ బ్రీతి • సరసిజాక్ష
భోగిభోగాసనుం డని • పొగడ ద్విపద. 375

### త్రిపద

తే. దేవమునివంద్య గోవింద • దితిజహరణ
పుండరీకాక్ష యవ్యక్త • పుణ్యపురుష
యమరసన్నుత గోపాల • హరి ముకుంద
దేవ యవ్యక్త హరియం నాఁ • త్రిపదయయ్యె. 376

### ఏకాక్షరి

క. నానాననననానున్నన, నూనను నిన్నెను నేను•నున్నునినినన్నై
నానీననునానానును, నానూన యనంగ నొంటి•యక్షర మయ్యెన్. 377

### ద్వ్యక్షరి

క. మునినామా మమ్మును మన,మున నూనిన నేమమును • మోనమానను న
న్మనుమని మననము మన్నన, ననునూనానామునిన యఁ•దద్వ్యర్ణమగున్. 378

### త్ర్యక్షరి

క. మానితమతితో మమతను, సీనామమము నేమమునను • నేను మనమునన్
నూనమున మతము మానను, దానకముగఁ దలఁతు ననఁగఁ • ద్ర్యక్షరి యయ్యెన్.

### ఇచ్ఛావాక్యసంఘట్టనము

క. తోఁటలు లెస్సై యున్నవి, తాటాదూటములు గావు • తాపసు లుండన్
పేఁటలు దామోదరుచె, నాటలకు న్నెళవులు మధు•రాపురిచెంతన్. 380

వ. ఈపద్యమునఁ దోఁట తాట పేఁట ఆట యనుమాట లర్థవంతముఁగాఁ గూర్చుటం జేసి దీనిపేరు ఇచ్ఛావాక్యసంఘట్టనము.

---

1 పోల్చు (పూ. ము); పొగడున్ (Ed.).

## బంధకవిత్వము

సీ. గోమూత్రికాఛత్ర ♦ గుచ్ఛకుండలినాగ, కంకణమర్దల ♦ ఖడ్గచక్ర
పంకజసర్వతో ♦ భద్రమాలాక్షరీ, ప్రముఖబంధంబు లే ♦ ర్పడఁగఁ జెప్పఁ
వృత్తము ల్బంధక ♦ విత్వవిశ్రుతముత్రై, కవులనుఁ జెవులపం ♦ డువులు సేయుఁ
బటుతరప్రౌఢిమఁ ♦ బండితపామర, సాధారణంబుగా ♦ జగతిలోన
తే. రాధికాకేళికాలోల ♦ రమ్యశీల, భూరిగుణసాంద్ర యదుకులాం ♦ భోధిచంద్ర
వల్లవీమానచోర ద ♦ ్వారకాధార, పరమవాచాల రాజగో ♦ పాలబాల. 382

తే. మొనసి యెద్దుచ్చరేఖల ♦ మూలలందు
వలయుఁ బద్యంబు నాలుగం ♦ ఘ్రులనువ్రాసి
చదివి రేనియుఁ సుకవులు ♦ సమ్మదమున
ధాత్రి గోమూత్రికాఖ్యబం ♦ ధంబు దనరు. 383

## గోమూత్రికాబంధము

మాలిని. కనకనయనవైరీ ♦ కాదపాపోరవాహా
వనజనయనశౌరీ ♦ వాదవాహోరివాహా
వనధనదవిధిజ్ఞా ♦ పాదసంభూతగంగా
వినయపరవిధిజ్ఞా ♦ వేదసంభూతగంగా.

క. వితరణశారదయార్ణవ, ధృతచక్రధరనరసింహా ♦ ధృమశోభిమహా
వితరణధీరనయార్ణవ, జితనక్రపరతరగాహా ♦ జీవనధిగ్రహా.




## ఛత్రబంధము

క. పారదమదనకవసుధర
దారద సమసమసనాస•దరమారీచా
చారీమారవరాకా
కారావరదారథసువ•కనదమదరపా.

## గుచ్ఛబంధము




మాణవకవృత్తము.—

గాదిలితో మాలదిగా, గాదిలకించెక్ బదిగా
గాదిబకృష్ణం డదిగా, గాదిడవాచా లదిగా.

## కుండలినాగబంధము

క. ఇలలోఁ గనబడిచాలుగ, నిలయంబు లగుఁ బయోజనిభనీలాంగా
మెలిఁగొన్నపామువలెఁ జెలు,వలరుఁగ దలతోఁ గనాగబంధం బొనరుఁ.



చ. ద్యుతిధర దేవకీతనయ తోయభవస్తుత భూరమేశ సం
మితగుణసారభూతిదయ మేయబృహజ్జవపూరుషావహా
శితనరకాపురాతనయ శేయసువిష్కరశారవాహ శా
శ్వతపురుహూతపీతదవ పావకశ నకురాణభోనిశా.

## కంకణబంధము



సేవేగోపాలం కేశిఘ్నం, గోవృద్ధ్యద్రిధృంకంశంఘ్నం,
శ్రీదంష్ట్రభూనాథం పీనార్యం, కందాభాసం నీరాగారం.

## మర్దలబంధము



రాజాలు రాజశయానా, లాజలు చల్లినయానన్
భూజలు గావశవర్తిన్, రాజిలు రాజనవయాస్యా.

## ఖడ్గబంధము

లక్షణము:—

క. చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యంబు జేసి ♦ సరసులు ముమ్మా
రిరుగడల మధ్య మొకటిగ, పరుజుల గదియింప ♦ ఖడ్గబంధం బొనరున్.



లక్ష్యములు:—

క. శమదమసమధికచిత్తా, విమలాంభోజారిహాస్త♦విష్టరకర్ణా
యమలార్జునతరుభంజన, కమలాధరణీసనాథ ♦ కంధరవర్ణా.



క. ధనదనవీనకనత్కౌన, కనకాంబరవాసుదేవ ♦ కరుణాపాంగా
వివరద శుభకర దశ,త్కనకకశిపు పూర్వదేవ♦కందనిభాంగా.



క. శూరవరద రఘువరమర, మారణ చాణూరకంస • మధుపౌండ్రహరా
రారాజత్కనకాంబర, ఘోరగ్రాహారిరక్ష • గోపీజారా.



క. శారదరసారమణదర, పారదరజనీశకీర్తి • పావనచరితా
తారకరిపువినుతహరియ, పారదయార్ణవముకుంద • భావజతాతా.




సుగంధి:—

కోరితీరి వారిజాక్షు • గోరఁజేరఁజేరవే
వేరుపడ్డదైత్యులొమ్ము • వేగిలించి లెస్సగా
గారవించి యశనిపుత్రు • గాంచి వేడ్కఁ బ్రోవవే
వేరువేర నింగినిల్చి • వేల్పులెల్ల మ్రొక్కఁగన్.

## చక్రబంధము

లక్షణము:—

సీ. వర్తులాకృతులుగా పదిగీతులు లిఖించి పొంతలితరమధ్యమాలయమున
నంటంగఁ గడలెల్ల నారురేఖలు గీసి క్రిందిపందొమ్మిదోభంపమునను
బ్రోదిపుట్టినవృత్త మేదైన మూఁడంఘ్రు లటువ్రాసి నడిమింటి నాదివర్ణ
మేది యయ్యెను నది యినుమీరు రాఁజెప్పి మూట నాఱిట నామములరచించి
గీ. కడలు గలయంగ నాలవ • కాలువలికి, చక్రబంధస్వరూపంబు • సభ్యులెల్ల
వ్రాయఁదగుఁ గామెవల్లీశ • వారిజాక్ష, జమ్మికడనున్న గోపాల • చారుశీల.

## చక్రబంధము



లక్ష్యము:—

శా. భద్రాకాముకసోమసూర్యనయనా • భ్రాజిష్ణుశౌర్యక్రమా
త్సుద్రాక్షుద్ర విమర్శితాంగనతతా • స్తోకప్రసంపత్కరా
భద్రానూనజమావహావినయవా • గ్భావిష్కృతాయత్నమా
హాద్రీశా భవతత్సుకా శుభకరా • మాంగల్యరాసోద్యమా.

## అష్టదళపద్మబంధము



స్రగ్ధర. రాధాసక్తారసగ్రా • ప్రజకులతిలకా • త్రాతకృత్ప్రియధీరా
రాధీయత్ప్రీకృతత్రా • ప్రవిమలసుగుణా • గ్రావవర్యాప్రధీరా
రాధీప్రర్యావవగ్రా • ప్రకటదనుజజై • త్రాపదప్రోర్థధూరా
రాధూర్థప్రోదపత్రా • ప్రరుచిరపృథుక • గ్రాసరక్తాసధారా.

## సర్వతోభద్రబంధము



| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

వందేసదా దాసదేవం, దేవరంపవరం వదే
సరంగకంకంగరంస, దాపకంతతకం।పదా.

## మాలికాబంధము 1



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వనాటరత్నరక్షరమ్యనాగనాథనాశనా.

## మాలికాబంధము. 2



చ. ఖరహర ధీరదేవకన♦కప్రకటాంబరవీరసారదు
ర్ధరధరవారవేణురవ♦రమ్యరమేశ మహామహామహీ
ధరగరహారసన్నుత కృ♦తజ్ఞతశిష్టపరాపరాపరం
శరణా రజోరమానిశద♦శస్తశమాత్మక శ్రీకళాకరా

క్షురికాబంధము




సరోజవృత్తము. చేసితాసిరి సిల్లుచే
వాసివా దరిచేరిరా
రాసుతా దిని బోసిగా
గాసి బోనిదితాసురా.

షోడశదళచక్రము.*



సింహారేఖావృత్తము.
రామరాత్రీరాగరాధా
రామరాణా రాకరానా
రామరాజీ రాచరాజా
రామరాజీరాపురాచర్ణా,

* ప్రతి చరణములో నాల్గవ అక్షరము దీర్ఘాంతముగానే ఉన్నదిగాని: ఆ కవిచెప్పిన లక్షణము ప్రకారము హ్రస్వమై ఉండవలెను. (చూ. పుట. 224)

వ. ఇది బంధకవిత్వం బిఁక గర్భకవిత్వంబు వివరించెద. 384

## గర్భకవిత్వము

సీ. గాంగేయకౌశేయ♦ఘనకందగీతసద్గర్భచంపక మాలి♦కయుం వరిష్ఠ
కందపద్యద్వయ♦కమలవిలసితరుగ్మవతికాగర్భిత♦క్రౌంచపదము
గీతమత్తేభవి♦క్రీడితాకందగర్భితసీసము నట ష♦డ్వృత్తగర్భి
తోత్పలమాలిక♦యును సుకల్పితకల్పవల్లియుం సీసరూ♦పద్విపదయు
స్రగ్విణీగర్భభు♦జంగప్రయాతంబు కందగర్భితమణి♦గణనికరము
కలితచతుర్విధ♦కందపద్యము సప్తవిధకందమును బంచ♦విధసువృత్త
తే. మాదిగాఁ గలకొన్ని ప♦ద్యములు పెక్కు, సరవిఁ బద్యము లిమిడి దో♦షములు లేక
కాన వచ్చిన నవి యెల్ల ♦ గర్భకవిత, ధరణి నొప్పారు [2]నిరీతిఁ ♦ దనరి కృష్ణ. 385

## కందగీతగర్భచంపకమాల

చ. నరహరి కేశవా వనజ♦నాభ రమాధవ వంశహస్త బం
ధురసుగుణాకరా దురిత♦దూర జనార్దన దోర్బలాఢ్య గీ
ర్వరగిరిశస్తుతా మురహ♦రా సురపూజితముఖ్యపాద సుం
దరపురుషాగ్రణీ భుజగ♦తల్ప శచీపతిపుత్త్రరక్షణా. 386

వ. ఇది భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 387

## కందద్వయకమలవిలసితరుగ్మవతీగర్భక్రౌంచపదము

ద్వారవతీనా♦థా సదుదారా తరుణధవళకర ♦ ధరనుతనామా
మారమణీధా♦మా సుకుమారా మరుదధిపతిరిపు♦మదగిరిశంబా
సారసనేత్రా ♦ సత్యవిచారా శరరుహభవముఖ♦సకలసురేశా
ధారకులా తే♦జోజితసూరా సురవరమణినిభ♦సురుచిరదేహా. 388

వ. ఇది వర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁబడియె. 389

## మత్తేభవిక్రీడితాగీతకందగర్భసీసము

వినయసంపన్నర♦విప్రభూతరమణీనాథా పయోజేక్ష♦ణా నరాత్త
విభయుదాకార హ♦విర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వ♦రా రమేశ
విలయకాలానల♦విక్రమప్రథిత సాల్వగ్రావవృద్ధశ్ర♦వా వరేణ్య
విలయశీలా యదు♦వీర కౌస్తుభధరా చక్రి యశోదాత్మజా ముకుంద
తే. కరివరద పూతనాంతక ♦ గరుడగమన, సత్వసహిత కామజనక ♦ శంకరసఖ
కనకవసన సుందరదేహ ♦ వనధిశయన, సనకమునివినుత చరణ♦సరసిజయుగ. 390

వ. ఇది వళిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె. 391

---

1 శనలు (ఓ). 2 విఖ్యాతి (ఓ). 3 ర్ధర (ప).

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధుర గర్భోత్పలమాలికావృత్తము.

ఉ. శారదశాసితప్రసవ•చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషధవ • తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ•ప్రాపకఖండన వాసవానుజా
పారద వాసుదేవ భవ•పాపవిదండన భర్గపూజితా. 392

వ. ఇది యీపద్యపరిచ్ఛేదమ్ముతుదను దెలిపెదము 393

కల్పితకల్పవల్లీప్రహారణకలిత

శరధృతకరుహాం • కరిహితకరణం, కరుహాసఖరుచిం • గరుడఖగరథమ్
ఖరఘనకరవిం • ఖరతరకరగం, గరళముఖరిపుం • గరధరకరతమ్. 394

వ. ఇది సంధిపరిచ్ఛేదములోఁ దెలిపెదము 395

మఱియుఁ, గల్పితకల్పవల్లి భాస్కరవిలసితము

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా
పక్షగపతిరథ • పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 396

గర్భప్రథమకందము

అక్షరహారివికచాంబురు,హాక్షా యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదురద్విప,రక్షా రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. 397

గర్భద్వితీయకందము

పక్షగపతిరథ పౌండ్రవి,పక్షా భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర ఋక్షస,దృక్షా ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. 398

గర్భద్విపద

అక్షరహారివిక•చాంబురుహాక్ష, యక్షపసఖనుత • యదుకులదక్ష
రక్షకసురవిదు•రద్విపరక్ష, రాక్షసవిదళన • ప్రరుచిరవక్ష
పక్షగపతిరథ•పౌండ్రవిపక్ష, భక్షితదవశిఖి • బహుసవదీక్ష
వృక్షగసహచర • ఋక్షసదృక్ష, ఋక్షపదుహితృప • ఋషిజనపక్ష 399

లాలిపాట

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. లాలి.

పక్షగపతిరథ • పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర • ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప • ఋషిజనపక్షా. లాలి. 400

## పెండ్లిపాట

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షక సురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన• ప్రరుచిరవక్షా. [1]గౌరీకల్యాణ వైభవమే.
పక్షగపతిరథ • పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర•ఋక్షసదృక్షా, ఋక్షపదుహితృప•ఋషిజనపక్షా. గౌరీకల్యాణ
[వైభవమే. 401

## ధవళము

అక్షరహారివికచాంబురు•హాక్షా యక్షపసఖ
రక్షకసురవిదురద్విప•రక్షా రాక్షసవిదళన
పక్షగపతిరథ పౌండ్రవి•పక్షా భక్షితదవశిఖి
వృక్షగసహచర ఋక్షస•దృక్షా ఋక్షపదుహితృప. 402

## [2]సువాల

అక్షరహారివిక•చాంబురుహాక్షా, యక్షపసఖనుత • యదుకులదక్షా
రక్షకసురవిదు•రద్విపరక్షా, రాక్షసవిదళన • ప్రరుచిరవక్షా. సువ్వి సువ్వాలలే. ౧
పక్షగపతిరథ • పౌండ్రవిపక్షా, భక్షితదవశిఖి • బహుసవదీక్షా
వృక్షగసహచర•ఋక్షసదృక్షా,ఋక్షపదుహితృప•ఋషిజనపక్షా. సువ్వి సువ్వాలలే.

## అర్ధచంద్రికలు

అక్షరహారివిక • చాంబురుహాక్షున్. ౧
యక్షపసఖనుత • యదుకులదక్షున్. ౨
రక్షకసురవిదు • రద్విపరక్షున్. ౩
రాక్షసవిదళన • ప్రరుచిరవక్షున్. ౪
పక్షగపతిరథ • పౌండ్రవిపక్షున్. ౫
భక్షితదవశిఖి • బహుసవదీక్షున్. ౬
వృక్షగసహచర • ఋక్షసదృక్షున్. ౭
ఋక్షపదుహితృప • ఋషిజనపక్షున్. ౮

---

1 'గౌరీకల్యాణావైభావమే' అని (ఓ.వ.) లలో వ్రాసిఉన్నది.
2 సువ్వాలే (ఫ్రా. ము.)

## [1]కందగర్భసీసరూపద్విపద

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ శకటదానవవిపక్ష • కమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల యభిరమతస్నిగ్ధయా•పీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల ధృతమణిధరగదారి • తపతికథిత
నివసితవైకుంఠ • నియతాబ్జకంఠ రవికళాదశుభనేత్ర • విజయమిత్ర
తే. సతతసనకాదిసన్నుత • చతురచరిత, యాదవకుల సత్యనిరత • యచ్యుత మధు
విదళన హరిశాశ్వతకృష్ణ•విదురవరద, భవవిరించినుతా యంచుఁ • బ్రస్తుతింప. 406

## గర్భద్విపద

మకరకుండలకర్ణ • మహితాభ్రవర్ణ
శకటదానవవిప•క్షకమలజాక్ష
శుభికాలసత్ఫాల • సుయశోవిశాల
యభిరమతస్నిగ్ధ • యాపీతదుగ్ధ
శ్రితదేవతరుమూల • చేదీశకాల
ధృతమణిదరగదా•రితపతికథిత
నివసితవైకుంఠ • నియతాబ్దకంఠ
రవికళాదశుభనే•త్ర విజయమిత్ర. 407

## గర్భకందము

సతతసనకాదిసన్నుత, చతురచరిత యాదవకుల • సత్యనిరత య
చ్యుత మధువిదళన హరి శా,శ్వత కృష్ణ విదురవరద భ•వవిరించినుతా. 408

## స్రగ్విణీగర్భభుజంగప్రయాతము

నమో దాశకా శేణు • నాదప్రవీణో, ద్యమా యాశుషేణా మ•హాయావసారి
రమాధీశ దామోద•రా దేవదేవో, త్తమా భేశమిత్రాక్ష• [2]యింద్రానుజాతే. 409

## గర్భస్రగ్విణీవృత్తము

దాశకా శేణునా•దప్రవీణోద్యమా
యాశుషేణామహా•యావసారీరమా
ధీశ దామోదరా • దేవదేవోత్తమా
భేశమిత్రాక్ష యిం• [3]ద్రానుజాతే నమో. 410

---

1 కందగర్భద్విపదరూపసీసము (ఓ). 2 తార్క్ష్యానుయాయా-(పూ. ము.) ఇందును యతిభంగము. 3 ఈచరణమున (ప. ఓ.) లలోనిది పాఠము ఇందును యతి భంగము.

## కందగర్భమణిగణనికరము.

కరధృతజలజునిఁ • గరిపతివరదుఁ, వరతనురుచిజిత • వనదునిఁ బరముఁ
బరివృఢుఁ గొలిచెదఁ • బరపదశరణుఁ, శరవణభవనుత • చరితునిఁ గరుణన్. 411

## గర్భకందము

కరధృతజలజునిఁ గరిపతి, వరదుఁ వరతనురుచిజిత • వనదునిఁ బరముఁ
బరివృఢుఁ గొలిచెదఁ బరపద, శరణు న్శరవణభవనుత•చరితునిఁ గరుణన్. 412

## చతుర్విధకందము

రెండవచరణంబునకు, న్రెండవగణ మాది గాఁగ • నిర్మించినచో
దండిఁ జతుర్విధకందము, పాండవపతి మెలంగు•బ్రాజ్ఞులసభలన్. 413

బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోఁ
గలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప జేంగితజ్ఞ•హితవుగ విపులన్. 414

## గర్భద్వితీయకందము

చిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిం
గృప జేంగితజ్ఞహితవుగ, విపులం బలులేమిచేత • వేసరుచెలికిన్. 415

## గర్భతృతీయకందము.

కలి మిచ్చినావు కేరుచు, నెలమిం గృప జేంగితజ్ఞ•హితవుగ విపులన్
బలులేమిచేత వేసరు, చెలికిం జిపిటంబు లీయఁ • జేకొని కృపతోన్. 416

## గర్భచతుర్థకందము

కృప జేంగితజ్ఞహితవుగ, విపులన్ బలులేమిచేత • వేసరుచెలికిం
జిపిటంబు లీయఁ జేకొని, కృపతోఁ గలి మిచ్చినావు • కేరుచు నెలమిన్. 417

## మాలికాచతుర్విధకందము

తరతర మవర్ణ మాదిగ, దొరలించిన మాలికాచ•తుర్విధకందం
బరుదారును సత్కృతులం, దురగాధిపనవ్యతల్ప • యందధిశయానా. 418

శ్రీభూమీన వరద మారి, గోభూమానవవినుత సు•గుణబుధ మధునా
శా భీమా నవకృష్ణకు, నాభా మానవమారి దరి • యభవకమలనా. 419

### గర్భద్వితీయకందము

భూమీన వరదహరి గో, భూమానవవినుత సుగుణా• బుధ మధునాశా
భీమా నవకృష్ణఘనా, భామానవహరి దరి యభ•సకమలనా శ్రీ. 420

### గర్భతృతీయకందము

మీనవరద హరిగోభూ, మానవవినుత సుగుణబుధ • మధునాశా భీ
మా నవకృష్ణఘనా భా, మానవహరిదరియభవక • మలనా శ్రీభూ. 421

### గర్భచతుర్థకందము

నవరద హరిగోభూమా, నవవినుత సుగుణబుధమధు•నాశా భీమా
నవకృష్ణఘనాభామా, నవహరిదరియభవకమల • నా శ్రీభూమీ. 422

### అష్టవిధకందము

రెండేసిగణంబులపై, నుండినగణ మాది గాఁగ • నొనరఁగఁ జదువన్
ఖండితసౌంభకఘోటకి, తాండజ యష్టవిధకంద • మనఁగాఁ బరఁగున్. 423

### ప్రథమకందము

తన కిరుగెలనను కనలుచుఁ, గొన బయి గిలిపెడుకనుగొలు•కులఁ దగుఁ బెలుచ
న్ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను• ఖలశృంఖల మై. 424

### ద్వితీయకందము.

కనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను • ఘనులను గలయం
బెనఁకువఁ గనుచుం గలుములఁ, దనిపెను ఖలశృంఖల మయి • తన కిరుగెలనన్.

### తృతీయకందము

గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను • బెనఁకునఁ గనుచున్
గలుములఁ దనిపెను ఖలశృం, ఖల మయి తన కిరుగెలనను • గనలుచుఁ గొన బై.

### చతుర్థకందము

కులదగు బెలుచ న్ఘనులను, గలయం బెనఁకువఁ గనుచును • గలుములఁ దనిపెన్
ఖలశృంఖలమయి తనకిరు, గెలనను కనలుచు గొనబయి • గిలిపెడుకనుకొల్. 427

### పంచమకందము

ఘనులను గలయం బెనఁకువఁ, గనుచుం గలుములఁ దనిపెను • ఖలశృంఖల మై
తన కిరుగెలనను గనలుచుఁ, గొన బయి గిలిపెడు కనుకొలు•కులఁ దగుఁ బెలుచన్.

## షష్ఠకందము

వెనఁకువఁ గన మం గలుములఁ, దనిపెడు ఖలశృంఖల మయి ♦ తన కిరుగెలనన్
గనలుచుఁ గొనబయి గిలిపెడు, కనుగొలుకులఁ దగుఁ బెలుచను♦ఘనులనుగలయన్.

## సప్తమకందము

కలుములఁ దనిపెడు ఖలశృం, ఖలమయి తన కిరుగెలనను ♦ గనలుచుఁ గొన బై
గిలిపెడుకనుకొలుకులఁ దగుఁ, బెలుచ న్ఘనులను గలయను ♦ వెనఁకువఁ గనుచున్.

## అష్టమకందము

ఖలశృంఖల మయి తన కిరు, గెలనను గనలుచుఁ గొన బయి ♦ గిలిపెడుకనుగొ
లుకులఁ దగుఁ బెలుచ న్ఘనులను, గలయం వెనఁకువఁగనుచును♦గలుములఁదనిపెన్.

## కందద్వయసీలోత్పలమాలామణిగణనికరగర్భపరసిజవృత్తము

శ్రీవర్ధిష్ణుం బావనజీవు ♦ న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుటకై
భావింతు న్సంభావితభావుం ♦ బ్రతియుఁగ సముదిత♦బహుతనుమహితుఁ
దేవేంద్రాదిప్రస్తుతదేవు ♦ న్దితితనయతుహిన♦దినకరకిరణుఁ
ధీవిద్యాద్యోతు న్వసుదేవు ♦ న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 432

## గర్భప్రథమకందము

శ్రీవర్ధిష్ణుం బావన, జీవు న్జితభృగుతనయుని ♦ సిరి గలుగుట కై
భావింతు న్సంభావిత, భావుం బ్రతియుంగసముదిత♦బహుతనుమహితున్. 433

## గర్భద్వితీయకందము

దేవేంద్రాదిప్రస్తుత, దేవు న్దితితనయతుహిన♦దినకరకిరణుఁ
ధీవిద్యాద్యోతు న్వసు, దేవు న్ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్. 434

## గర్భనీలోత్పలమాల

శ్రీవర్ధిష్ణుం బావనజీవుఁ ♦ భావింతు న్సంభావితభావున్
దేవేంద్రాదిప్రస్తుతదేవుఁ ♦ ధీవిద్యాద్యోతు న్వసుదేవున్. 435

## గర్భమణిగణనికరము

జితభృగుతనయుని ♦ సిరిగలుగుటకై, ప్రతియుంగసముదిత♦బహుతనుమహితుఁ
దితితనయతుహిన♦దినకరకిరణుఁ, ధృతిమదగుణయుతుఁ ♦ దృణితవిదురదున్.436

వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము

శారదశాసితప్రసవ ♦ చాపవిఖండన సామసన్నుతా
తారణదాసపోషభవ ♦ తాపసమండన ధర్మతత్పరా
వారణభాసురప్రభవ ♦ ప్రాపకభండన వాసవానుజా
పారదవాసుదేవభవ ♦ పాపవిదండన భర్గపూజితా. 437

గర్భవాణీవృత్తము

శాసితప్రసవ ♦ చాపవిఖండన ♦ సామసన్నుతా
దాసపోషభవ ♦ తాపసమండన ♦ ధర్మతత్పరా
భాసురప్రభవ ♦ ప్రాపకభండన ♦ వాసవానుజా
వాసుదేవభవ ♦ పాపవిదండన ♦ భర్గపూజితా. 438

గర్భపద్మావృత్తము

సవచాపవిఖండన ♦ సామసన్నుతా, భవతాపసమండన ♦ ధర్మతత్పరా
భవప్రాపకభండన ♦ వాసవానుజా, భవపాపవిదండన ♦ భర్గపూజితా. 439

గర్భాంబావృత్తము

చాపవిఖండన ♦ సామసన్నుతా, తాపసమండన ♦ ధర్మతత్పరా
ప్రాపకభండన ♦ వాసవానుజా, పాపవిదండన ♦ భర్గపూజితా. 440

గర్భరతీవృత్తము

ఖండనసామసన్నుతా, మండనధర్మతత్పరా
భండనవాసవానుజా, దండన భర్గపూజితా. 441

గర్భదరధ్వనితాళము

శాసితప్రసవ ♦ దాసపోషభవ
భాసురప్రభవ ♦ వాసుదేవభవ. 442

గర్భమధురగతిరగడ

శాసితప్రసవ ♦ చాపవిఖండన, దాసపోషభవ ♦ తాపసమండన
భాసురప్రభవ ♦ ప్రాపకభండన, వాసుదేవభవ ♦ పాపవిదండన. 443

ఆశ్వాసాంతగద్యము

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపురమందిర నందనందనచరణారవిందవందనాభిలాష మనీషాప్రాభవ వేంగళార్యతనూభవ విద్యావిశేషసురాచార్య కాసనూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబు

గందు మూలసూత్రంబులును, ఛందఃప్రభావంబును, ఛందోవ్యాపక[1]సంప్రదాయంబును, ఛందస్స్వరూపంబును, నితిహాసాదిస్వరూపంబును, గద్యవచనంబులును, ప్రథమప్రస్తారోద్ధారణక్రమంబును, గణజననచ్ఛందంబులును, గురులఘువర్ణనిర్ణయంబును, సర్వగణలక్ష్యంబులును, గణాధిదేవతాఫలంబులును, అష్టగణలక్ష్యంబులును, దేవతానరాంకితనియమంబులును, నాయకగణకూటంబులును, కృత్యాదిగణద్వయకూటంబులును, ప్రశస్తకూటంబులును, దోషాదోషబాహుళ్యఫలంబులును, గణద్వయయోగఫలంబులును, గణనాథయోగఫలంబులును, షట్ప్రత్యయంబులును, పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును, షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును, ముఖ్యగౌణవృత్తంబులును, మాలికావృత్తవివేకంబును, జాత్యుపజాతులును, చిత్రబంధగర్భకవిత్వంబును గల పద్యపరిచ్ఛేదంబను చతుర్థాశ్వాసము సంపూర్ణము.



1 సాంప్రదాయకంబును (ప).

# సంధిపరిచ్ఛేదము

## పంచమాశ్వాసము



కృష్ణాపూర్వతట
ప్రాకారప్రాంతకుతల•పరిశోభితప
ద్మాకరకేతవరనగర
సాకారివిచిత్రయోజ•నస్థితభవనా. 1

క. అవధారు శబ్దశాసను, డవనిఁ గలియుగమున కాది • నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పినయం, ధ్రవచోవ్యాకరణసూత్ర•తతిఁ దెనుఁగింతున్. 2

ఆ. ఆంధ్రసంఘ మెల్ల • నష్టాదశార్యుల, సుకవు లా నటించుఁ • జోద్య మంద
ఛత్రితాద్రినాథ • శబ్దానుశాసను, డవనిఁ జేటపఱిచె • నలిముదమున. 3

### సంధిపరిచ్ఛేదము

మూ. సూ. తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః.
కిఞ్చిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాం శ్చ. 1
త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతికలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యే స్యు ర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్. 2
సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః,
లుక్సంశ్లేషా నాచి ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు. 3
సన్ధి ర్నాచో చ్యమతో వాతో నాదిషు విభక్తి షూతో వా,
నిత్య మనుత్తమపురుషక్రియా స్వితగ పరిమితో సమస్తనామ్. 4
న స్యా త్తద్ధర్మోత శ్చే ర్వాస్యా ద్వర్తమానవిహితస్య,
తద్వత్తదాదిజస్య ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యేతః. 5
అపిశబ్దతో లుగ్వా స్యా దిచ్చు విభక్త్యన్తిమస్య జే రలిచ,
శబ్దాత్తచ్ఛబ్దాతో లు గ్ధారార్థే త ఉదపి రేఫ స్స్యాత్. 6
సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమో చి స్యాత్,

ధాతుపదసమ్భవానాం విశేషణానామత స్తథాను మచి 7
షష్ఠ్యా ఉత్తో చి ను మ్నేచాద్య స్యా మ్రేడితేఽ న్త్యలోప శ్చ,
అహామాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య, 8
ఖో రద్భుతశబ్దార్థే షో శ్చ తదాద్యక్షర వాచకే షూత్తః,
వికృతిపదే లాటో రప్యుపధారే శ్శ్వా విత శ్చలు గ్వా స్యాత్. 9
పదమధ్యనరలడానా ముత శ్చ పూర్వప్రయోగసిద్ధానామ్,
లోపో వా స్యాత్తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమమతేన. 10
కవిభల్లటైగ క్రియాణాం నామ్నాముల్లోప ఇష్యతే హ్యేషు,
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే. 11
ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ,
రుల్యాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ. 12
ప్రథమావై భక్తికమో ర్లుక్ పూర్ణో వా పతిక్రియార్థే తు,
తస్య సమాసే పుంవ్రా ను మ్భాతో హల్యథర్వణార్యమతాత్. 13
శత్రర్థే తూత శ్చ్వా నో స్తస్య స్యా చ్చ పూర్ణబిన్దు రపి,
వాత్త్వాస్మదో ర్ద్రుతస్య స్యాల్లు గ్వాక్యా న్తగతపదానాం చ. 14
పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం చ బిన్దుస్స్యాత్,
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ సన్తి తే పరతః. 15
లుగ్వా న ప్రకృతిపదా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్,
అలుకి చ సంశ్లేష స్స్యా ద్బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్. 16
ప్రథమలు గపి ద్వినుల్యో ర్ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు,
హేమో క్తేగ పరుషాణాం గసడదవా స్యుః పదాద్ద్వన్ద్వే. 17
గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్త్వాస్మదో ర్వినా పరుషాః,
న వికృతిశబ్దా త్పరత స్సంస్కృతికానాం భవన్తి గసడదవాః. 18

ఇతి సకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్దచిన్తామణౌ
సన్ధిపరిచ్ఛేద స్తృతీయః.

వ. ఈశ్లోకంబులు పదునెనిమిదియును నలువదియెనిమిదిసూత్రము లయ్యె నవి యెల్ల నిందు వివరించెద. 4

తే. హేమచంద్ర త్రివిక్రమ • నామ కాదిఁ
బ్రాకృతము త్రోవఁ జూపి రా • ప్రాకృతంబు
నందు భేదంబుగావున • సాంధ్రమునకుఁ
గలుగులక్షణ మెఱుఁగఁగ • వలయుఁ గవులు. 5

ఆ. తెలుఁగుబాస యెంత • దెలిసి యుండిన నీనిఁ, జదువకున్నఁ గవిత • చక్కఁగాదు
ఇఁటిలోన హేమ • మెంత గల్గిన నేమి, తొడవు సేయకున్నఁ • దొడుగ రాదు. 6

క. పదసంధులు చెడ నదికినఁ, బదపద్యము కార్యసభలఁ • బరువడి హాస్యా
స్పదము లగుఁ గాన వైకృత, పదసంధివిధములు దేట • పఱిచెద వరుసన్. 7

క. [1]వసుధ విసంధియును మహా, విసంధియుఁ గుసంధిదోష • విధమును దుస్సం
ధిసమాఖ్యయు ననునాల్గును, బొసఁగింపరు సంధిదోష • ము లటంచు గవుల్. 8

తే. హరి ముసలికిని అనుజుండు • అర్జునునకుఁ
జెలి యనుచు నిట్లు గుదుసుపై • శృంగమయి
స్వరములకు సంధి గలుగక • సాగెనేని
దానిని విసంధి యండ్రు స • త్కవులు కృష్ణ. 9

• సాల్వభూమివరుఁ [2]యండ • జధ్వజుండు
ధరణిఁ గూల్చె సురల్ యద్భు • తంబు నొంద
ననుచుఁ బొల్లులవలపల • నచ్చు లున్న
జరుగును మహావిసంధిదో • షం బనంగ. 10

తే. మగు వొకతె సారె తెలనాకు • మడుపు లీయఁ
బోలఁ దొకతె తెల్లనపరంబు • బూని విసరఁ
జే డొకతె చక్రితో నెత్త • మాడె ననఁ గు
సంధి యగు నిట్లు గలయని • సంధు లదుక. 11

క. ఎందును దుస్సంధిసమా, ఖ్యం దిర మగు నందు నిందు • ననుచో నందు
న్నిందు న్నని పై నచ్చులు, పొంద సముచ్చయనకార • ములు కృతి నూఁదన్. 12

తే. తొలుత నీసంధిదోషచ • తుష్టయంబు, చెంద కుండఁగఁ గావ్యము • ల్చెప్పవలయుఁ
గానఁ దెలియంగ సంధిల • క్షణము లెల్ల, విన్నవించెద గోపాల • విమలశీల. 13

క. వుడుములు ప్రథమైకో త్తికిఁ, గడఁ గూర్చిన యది విభక్తి • కం బనఁబడుఁ బా
ల్పడి యవి చెందనినుడు గ్రప్పడు నవిభక్తికము నామ • మును ననఁబరఁగున్. 14

---

1 ఎసఁగ (పూ. ము). 2. "వరున్నండజ" (పాఠాంతరము.)

తే. గూను నెమ్మేను మెడ నాను•మీను పేను,[1] మ్రానువఱిచేను బలిబోను•మఱియు నిట్లు
భువి నకారంబుతోఁగూడఁ • బుట్టుశబ్దములు ద్రుతప్రకృతులు గావు • మునిశరణ్య.

తే. అన్ను బంగరుపొన్ను చా•య యగు తెన్ను
చెన్ను పులిజున్ను దొరపన్ను • జొన్న యెన్ను
మొదలు గా జడ్డలు నకార•ములకుఁ దుదిని
దనరుపదములు గావు ద్రు•తప్రకృతులు. 26

ఆ. తన్ను నిన్ను నన్ను • విన్ను మున్నామిన్ను, చన్ను కన్ను వెన్ను•శబ్దములకు
జడ్డ లుండుఁ బోవు•జర్చింప నివి ద్రుత,ప్రకృతు లెపుడు గావు • భక్తసులభ. 27

## కళాప్రదేశములు

సీ. ఇనుఁడు గోత్రము గోవు•జను లని యిబ్భంగిఁ బలికెడుప్రథమావి•భక్తులందు
రాముఁ గూర్చి రణోగ్ర•భీముఁ గూర్చి యటంచుఁ దెలిపెడుకర్మద్వి•తీయలందుఁ
గృష్ణునకై సురో•చిష్ణునకై యని తోడిఁబడ నుడుగుచ•తుర్థులందు
బలునిబట్టి మురారిఁ • బట్టుండి యని పలికెడుపంచమీవిభ•క్తితుదలందుఁ

తే. పద్మబాంధవసుతయొక్క•భద్రయొక్క
జాంబవతియొక్క యను శేష•షష్ఠులందు
క్షితిసముచ్చయములఁ దక్క • ద్రుతము గానఁ
బడదు [2]గావున నవిపల్కు•బడుఁ గళ లని. 28

సీ. సుగ్రీవుఁడే వాయు•సూనుఁడే యనుచు నేవార్థము దెల్పువ్యా•హారములును
నటియించెనఁట పాడె•నఁట కూడెనఁట యను లలితకిలార్థాను•లాపములును
వింటిమి కంటిమి • వేఁడి రటంచు నీమాడ్కిని బలుకుతిఙ్మ•ధ్యములును
గాంచి విచారించి • కరుణించి యనియెడుక్త్వాప్రత్యయాంతార్థ•వాచకములు

తే. నుఱుక మిన్నక నేయక • యొఱుఁగక యను, నట్టితూష్ణీంపదార్థవా•క్యములు నాది
శబ్ద ముండుటచేతను • జనియె సుమ్ము, కనియెఁ గద యనునవియును • గళలు కృష్ణ.

తే. నవ్వుచున్నాఁడు వచ్చుచు•న్నాఁడు వాఁడు
మనఁ గలఁడటన్న తిఙ్మధ్య•మంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁ • గలసి సరసి
జాతనేత్ర కళాప్రదే•శంబు లగును. 30

సీ. కటకట యక్కట • కట్ట యయ్యో యని పరితాపమునఁ బల్కు • భాషణములు
జోర బళీ [3]మజ్జ • యయ్యారె యంచుఁ బ్రశంసించునంధ్రభా•షాపదములు

---

1 మానుపఱిచెను (పూ. ము). 2 గావునఁ బల్కఁగా (ప); గావున నివి (ఓ).
3 ఝారె (ప).

ఉ. ఆరయ వైకృతోక్తులఁ బ♦దాదులయందు యకార ముండ దా
తీరునఁ బల్కువ్రాఁత గణ♦తింపఁగ న చ్చగు దానిదాపలన్
నీరజనాభనాంతములు ♦ నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె
న్నారు నితండు వైద్యవసు♦ధాధిపు నేపడఁగించె నేఁ డనన్. 40

వాక్యము. నాంతము లనఁగా ద్రుతప్రకృతులకు పేరు. 41

క. శృంగాంత్యవక్రయుగముల, సాంగత్యము నాకు నాంధ్ర♦సంస్కృతముల నా
దిం గలుగ దట్టివ్రాఁత ధ,రం గలయుద్రుతాంతములను ♦ బ్రాణముఁలట్టన్. 42

క. ముంగాముఱువులు నాలుగు, నుంగరములు మూఁడు నేఁడు ♦ నొడ్డాణంబుల్
పొంగుచు నొసంగి హరి యొక, యంగనను రమించె నన ను♦దాహరణంబుల్. 43

## ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము

మూ. సూ. లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 3

తే. అచ్చు పరమైన నాంతప♦దాంతమునకు, సంయుతమును లోపంబును ♦ జగతి లేవు
సంయుతం బయ్యె నేని దు♦స్సంధి యగును, లోపమైన గ్రామ్యం బగు♦లోకవినుత.

ఆ. చూచె నింతి ననెడు ♦ చోటఁ జూచె న్నింతి
ననిన సంధిదోష ♦ మయ్యెఁ గృతులఁ
బొడిచె నర్కుఁ డనెడు ♦ నెడఁ బొడిచెర్కుండు
ప్రాచి ననఁగ గ్రామ్య♦భావ మయ్యె. 45

క. ధరణి ద్రుతప్రకృతులపైఁ, స్వరపూర్వపదములు గదిసి ♦ సంధి గలయుచో
నరకాసురదమన ద్రుతా, క్షరములు లోపములు గాక ♦ కడపల నిలచున్. 46

క. అవిభక్తికతత్సమములు, భువి నటువలె నుండు నాంధ్ర♦ములు నచ్చులపైఁ
గవిసినను బ్రకృతిభావము, లవు శృంగాంతములు దక్క ♦ నహిపతిశయనా. 47

ఆ. హరి యొసంగు మోక్ష ♦ మాచక్రి యంగన
యందు భక్తి నిలుప ♦ నబ్బు సిరులు
నిక్క మనుచు దీని♦ ముక్కంటి యెఱుఁగును
నలువ యెఱుఁగు గట్టు♦తులువ యెఱుఁగు. 48

తే. కుత్సమత యవిభక్తిక♦తత్సమాంధ్ర, శబ్దముల రెంటికొమ్ముల ♦ స్వరము లడుకు
శితరుక్కద్రిరాజేంద్ర♦జిత్తనంగ, బచ్చవిలుదాలు పెక్కుడు♦బంట నంగ. 49

## వ్యంజనసంధి

క. ఖొల్లు లగువ్రాల కవతలి, హల్లులు ద్విత్వంబు లగుచు ♦ నసురాంతక సం
ధిల్లును వ్యంజనసంధులు, తెల్లముగాఁ దద్విధంబు ♦ తెలియఁగ వలయున్. 50

తే. ప్రాణపరుషాది సంజ్ఞలు • పలికి వాని, యం దొకక్కరమునకు ల•క్ష్యములు పలికి
దాని తెలుఁగున నాసంజ్ఞ • దనరుసట్టి, వ్రాల కెల్లను బట్టింప•వలయు నెందు. 51

## అకారాదిసంధులు

మూ. సూ. సంధి ర్నా చో౽ చ్యసుతః. 4

తే. పొల్లు యగుపూర్వశబ్దాంత•హల్లుమీఁదఁ, బరపదాద్యచ్చు నిలిచెడుఁ • బ్రాణసంధి
కొమ్ముపైఁ వక్క నితరస్వ•రమ్ముమీఁద, నచ్చు గదిసిన నచట లే • దాంధ్రమునకు.

సీ. కడు లెస్స యగుపట్టు•కమ్మిపుటం బన జాళువాయొఱపుప•[1]చ్చడ మనంగ
సిరియన్నఁ బరణించు • చిన్ని నెమ్మో మన వలదు సుమీ యింత•వైర మనఁగ
జన్నెయావులపాల•చవి చెప్ప రా దన రేయెండ విరహంబు • రేఁపు ననఁగ
మైయొప్పు చూపట్టెఁ • బైయంట వెదకినఁ గలదొ యించుక లేదొ • కౌ ననంగ
తే. ధన మెుకో యింతులకుఁ జక్కఁ•దన మనంగ
నలినము నివాసమా నెల•నాగ హరికి
దేవి యన నీవదింటిపైఁ • దెలుఁగులందు
స్వరము లెదిరినఁ బ్రకృతిభా•వంబె నిలుచు. 53

క. ఓ వ్వుగు పేరెద నొవ్వల, కుప్ప ననారతము నుంచు•కొని గోవిందుం
డెప్పుడు భోగించు ననం, దప్పక కొమ్ముపయిసంధి • దనరు రమేశా. 54

## అదంతసంధి

మూ. సూ. వాతః. 5

తే. నెట్టన వికల్పమునఁ దల•కట్టునకును, స్వరముపై నిల్చునప్పుడు • సంధి కలుగు
హరికి బలదేవుతల్లి పె•ద్దమ్మ యనఁగ, నల్లపాండునిసతి మేన•యత్త యనఁగ. 55

## విభక్తిసంధి

మూ. సూ. అనాదిష్వ విభక్తి ష్వాతో వా. 6

తే. ప్రథమఁ దక్కంగ నితరవి•భక్తులందు
దుదలఁ గొమ్ములు గలవిభ•క్తులకు షష్ఠిఁ
బలుకుకాగుడికిని వికల్పంబువలన
నిల ద్రుతప్రకృతిత్వంబు • గలుగుచుండు. 56

సీ. నిన్ను నే నెఱుఁగంగ • నే నెంతవాఁడను న న్నేలుకొనుము ఘృ•ణాసముద్ర
సారె నీకొఱకు నం•జలి మోడ్చి మ్రొక్కెద నిమ్ము నాకొఱ కై హి•కమ్ము లెల్ల

---

[1] ఇట్టిమాటలలో 'చ్చ' కు బదులుగా 'త్స' కొన్నియెడల వ్రాతప్రతులలోఁ గనఁబడుచున్నది.

నీకు నాశ్రితులు వా•ణీనాథముఖ్యులు గణుతింప నా[1]కేడు•గడయుం నీవె
నిలువఁ జేయుఁడు నాకు • నీయందు నతిభక్తి స్వజనులం దర్మిలి•నిజము నీకు
తే. ద్రౌపదికి నక్షయాంబర•దాన మిచ్చి; సవ్యసాచికాయోధన•జయ మొసంగి
ప్రోచుపగిదిని మమ్మునె•ప్పుడును గావు, మయ్య శ్రీకృష్ణ యనఁగ•లక్ష్యంబులయ్యె.
తే. రాముఁ డధికుండు తారక • బ్రహ్మ మాశ్రితౌఘసురధేను వామేటి•యనుజులహిత
భంజను లటంచుఁ బ్రథమావి•భక్తులందుఁ, గొమ్ములకు సంధి వచ్చు ని•త్యమ్ముగాఁగ.
తే. కూర్చి విడిచి ద్వితీయఁ జ•లుక్కనవి మూఁడు
నవతలివిభక్తిఁ దెలుపువా•క్యములు నాల్గు
వలనఁ గంటె లోపల నను•వచనములును
బదివిభక్తుల లో ద్రుత•ప్రకృతు లయ్యె. 59
సీ. తాటక నొకకోల • ధరణిపైఁ గూల్చెను మొక్కలపుసుబాహు•ను క్కడంచె
మౌనుల నానంద•మగ్నులఁ గావించె వారిచే నందె దీ•వనలు పెక్కు
జనకునిచేత న•ర్చనములు గావించె ఘనతతో నధ్వరా•గారమునను
వరశక్తితోడ నీ•శ్వరువిల్లువిఱిచెను నరులకంటె నమర్త్య•నరులు పొగడ
తే. వెస విదేహునివలన ను•ర్వీతనూజ
మిథిలలోపల నుద్వాహ•విధిని జెందె
ద్యుమణికులుఁ డన నివి విభ•క్తులు పదియును
ధరణి ద్రుతప్రకృతికలు ని•త్యముఁగ నగును. 60

## భూతార్థక్రియాసంధి

**మూ. సూ. నిత్య మనుత్తమపురుష క్రియా స్వితః. 7**

తే. వసుధ నుత్తమపురుషై•కవచనమునను
దక్క భూతక్రియాపదాం•తములఁ గల్గు
నిత్తులకు మీఁద నచ్చులు • వాత్తునపుడు
నిత్యముగ సంధులు ఘటించు • దైత్యదమన. 61
తే. పుడమి సూత్రోక్త ముత్తమ•పురుష మనుచుఁ
దత్పురుష మెల్లఁ గొన రాదు • తద్బహూక్తి
మున్ను తిఙ్మధ్యముల[2]తోడ • నెన్నుకతన
నిత్యముగఁ బ్రాణసంధి దా•నికి ఘటించు. 62

1 కేఁడుగడయుం (ప). 2 లోన (ప).

తే. వనిని దీవించిరఁట మునీశ్వరులు నిన్ను, రవిజు నేలితివఁట నీవు • రామచంద్ర
మీరు గట్టితిరఁట కపుశార జలధి, వింటి మీవార్త మేమన • వెలయు నిట్లు. 63
క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైషధంబునఁ "గూర్చుం
డిరి యొండొరు"నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతి • భావముఁ గలజే. 64
వ. నైషధంబున గుడిమీఁద విసంధిగా శ్రీనాథుఁడు చెప్పినపద్యము. 65
మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణు • ల్బర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలతికా•నవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీ•లాలోలచేతస్కులై. 66
క. గరుడధ్వజ ప్రథమోత్తమ,పురుషైకవచనము లెల్ల • భూతార్థమునన్
ధర నగును ద్రుతప్రకృతులు, భరియించె నుపేంద్రుఁ డేను• బ్రతికితి ననఁగన్.

వర్తమానక్రియాసంధి

తే. వర్తమానత్రిపూరుష•వచనములకు, జయగుస్వరసంధు లని శబ్ద•శాసనుండు
చెప్పఁడయ్యెఁ గొమ్ములసంధి•సిద్ధమగుటఁ, బ్రథమసూత్రంబునన కానఁ•బడుటఁ జేసి.
మ. చనుచున్నాఁడ డదె సీరి గోపకులు[1]ప•జ్జం జేరుచున్నా రహో
యనుచున్నా వఘవైరి నీ వరుగు కా•ర్యం బే మన న్నీరును
న్వినుచున్నా రెఱుఁగింపుఁ డెద్దియను దా • నే చెప్పుచున్నా నికన్
జనులారా చోరనీయ మావ్రజము నీ•చ్చ ల్నిల్చుచున్నా మనన్. 69

భావిక్రియాసంధి

తే. భావిపదములలో ద్రుత•ప్రకృతి గాన, నోర్వఁ గల ననును త్రమైకో క్తి దక్కఁ
దక్కనవి శృంగములు తుదిఁ•దాల్చకతన,స్వరపరము లైన నిత్యమైఁ•సంధిఁ జెందు.
తే. కావఁ గలఁ డచ్యుతుఁడు మెచ్చఁ • గల రమరులు
తోడరఁ గల వర్కనందను•తోడ నీవు
మెలఁగఁ గల రానరుపిఱుంద • మీరు భూమి
కాంతులార మేమును జూడఁ • గల మనంగ. 71

పరిమాణసంధి

మూ. సూ. పరిమితౌ సమస్తానామ్. 8

సీ. కనిపెడు ప్రేలెడు • [2]కమికెడుజేసెడు మూరెడు చేలెడు • బారె డనఁగఁ
జేటెడు పుడిసెడు • చేరెడు దోసెడు గంపెడు పుటికెడు • గాదె డనఁగఁ

1. బంచం 2. కైకెఁడు

జెంబెడు దుత్తెడు • చెరవెడు బిందెడు పళ్ళెడు కుండెడు • బానె డనఁగన్
బారెడు చిట్టెడు • పడెడు సోలెడు తవ్వెడామానకుంచెడు • తూమె డనఁగన్

తే. దక్కెడన వీసె డన నొక్క • చిక్కె డనఁగఁ
వాటె డన మోసె డనఁ బెద్ద • వామె డనఁగఁ
బరిమితార్థంబు తుది నిల్చు • పట్ల నిట్లు
ప్రాణముల నెల్లఁ దఱిమి ప • క్రములు బలయుఁ. 72

## తద్ధర్మార్థక్రియాసంధి

### మూ. సూ. స స్యా త్తద్ధర్మోతః 9

తే. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథ • మోత్తమాఖ్య, పురుషముల నేకవచనముల్ • పోవవిడిచి
కడమ పదములు తిఙ్మధ్య • కములుఁగానఁ, గొమ్ములను బ్రాణసంధులు • గూర్చుటొప్పు.

క. కాంతు రజప్రభృతులు నిను, సంతతమును బ్రోతు వీవు • సనకాదుల మ
ర్దింతు రభవుండు నీవును, బంతంబుల ఖలుల ననుచు • భావింతు మెదన్. 74

క. వదలక తద్ధర్మములను, బొదలెడు ప్రథమోత్తమాఖ్య • పురుషైకవచః
పదములు ద్రుతప్రకృతు లగుఁ, బదరును నతఁ డోర్తు నేను • బలుమఱు ననఁగన్.

## వర్తమానార్థద్రుతప్రకృతులు

### మూ. సూ. చో ర్వా స్యా ద్వర్తమానవిహితస్య.

తే. పరపదార్థ మపేక్షింపఁ • బడినయట్టి, వర్తమానార్థమున షష్ఠ • వర్ణశృంగ
కంబుతుదిఁ గల్గుపదము వి • కల్పమున ద్రుతప్రకృతి యగుఁగైటభ • దర్పదళన.

క. కేరుచు నొయ్యన దగ్గఱఁ, జేరుచు నురుముష్టిహాలికిఁ • జిక్కక వేగం
దారు చపాంక్రృతిఁ గ్రమ్మఱ, దూరు చధోక్షజుఁడు మల్లుఁ • ద్రుంచె ననంగన్.

## తదాదులు

### మూ. సూ. తద్వత్తదాదిజస్య. 11

క. తుదిగుదుల నదుకునది యిది, మొద లగుపదముల వికల్ప • మున స్వరసంధు
ల్పదలి య దెవ్వతె చెపుమా, యది యిది యని నన్నుఁ బలుక • నన లక్ష్యంబుల్.

## కిమాదులు

### మూ. సూ. ప్రాయ స్తు స్యా త్కిమాదిక స్యైతః. 12

క. కమలాక్ష యేమి యను వా, క్యము మొద లగు వానితుదలఁ • గలగుదులను బ్రా
ణము లడుగు వికల్పంబున, హిమగిరి యే మనియె నేమి • యిచ్చె మన కనన్. 79

అపిశబ్దసంధి.

మూ. సూ. అపిశబ్దే తో లుగ్వా స్యాత్. 13

క. ఏని యనుమాటకడపలఁ, గానంబడు నిత్తుమీఁదఁ • గదిసినచోటన్
బ్రాణములు సంధి గాంచును, బూని వికల్పంబువలనఁ • బుణ్యాచరిత్రా- 80

తే. పలుకుచెలియేనుమాప్రాణ•భర్తయేని, వనజభవుఁడేని యహితుల•స్వామియేని
నీమహత్త్వంబు వర్ణింప • నేర్చు నెట్లు, నా సుదాహరణంబులు • దానవారి. 81

క్త్వా ప్రత్యయాంతార్థసంధి

ఆ. వారిజాతనేత్ర • క్త్వాప్రత్యయాంతార్థ,ములు వచింతుఁ దెలుఁగు•పలుకులకును
బైస్వరంబు లుండఁ•బట్టులఁ బ్రకృతిభా,వంబు గాని సంధి • వాటపడదు. 82

ఆ. కాంచి యాలకించి • యెంచి యాలోకించి
యొరసి యాడి యోడి • యొరగి యొఱఁగి
యంటి యెచ్చి యిచ్చి యని • యాడుకొని యెత్తి
యొనసి యేగి యాగి • యనఁగ వచ్చు. 83

ఇకారాదేశవిభక్తులు

మూ. సూ. ఇ చ్చ విభక్త్యన్తిమస్య. 14

క. లలి నాదేశము లగుని,త్తులు సమసనములను జేత • తోడ వలన లో
పల నను నివి మొదల లగుపలు,కులతుదిఁ దలకట్టులకు వి•కుంఠతనూజా. 84

ఆ. కృష్ణువలనిబలిమి • కేశవుతోడిస,ఖ్యంబు శకటదాన•వారిచేతి
ప్రోపు భాగవతుల•లోపలిగణనయుం, ధవళవాహనునకుఁ • దక్కఁ గలదె. 85

అలాద్యాదేశము

మూ. సూ. జే రలిచ. 15

ఆ. కడవిభక్తులైన • నుడుగుల కలి యను, నాగమంబు వచ్చు • నంత్యములను
సమసనమున నేమ•కాయియందలిభక్తి, వాడమునతఁడె లోక•పూజ్యుఁ డనఁగ. 86

ఆదిలోపము

మూ. సూ. శబ్దా త్తచ్ఛబ్దాఽతో లుక్ 16

తే. శబ్దముతుదను నది యను • శబ్ద మదుకు, నప్పు దది యనుపదమున • కాది నుండు
నత్వము వికల్పమున లోప•మగునుగాన, ఇది ప్రకృతిభావమున నుండు•నిందిరేశ.

తే. పొసఁగు లోపప్రకృతిభావ•ములను వరుస
బాపనది కోమిటిది మంచి•కాఁపది యన

మహిని బాపనయదియుం గో। మటియదియును
గాఁపయదియును ననఁగ భ। క్తజనవరద. 88

### ఉదాదేశ రేఫాగమములు

మూ. సూ. దారార్థే త ఉ దపి రః. 17

తే. కొనలఁ దలకట్లు గలసురో। క్తులకు మీఁదఁ
గర్మధారయసమసన। కల్పనమున
నా లను త్రిలింగదేశవా। క్యంబు గూర్ప
మహి నుదాదేశ రేఫాగ। మములు వచ్చు. 89

ఆ. బుద్ధిమంతురాలు । పుణ్యాత్మురాలు దయాసమగ్రురాలు । దాసురాలు
వినుతశీలురాలు । ఘనురాలు గంభీరు, రాలు విష్ణు పెద్ద। రాణి యనఁగ. 90

### టుగాగమము

మూ. సూ. సామానాధికరణ్యేషూదన్తానాం టుగాగమోఽచిస్యాత్.

క. శమితాఘ కర్మధారయ, సమసనమునఁ దుదిని గొమ్ము । సంధిల్లెడుశ
బ్దములు వికృతిఁ బొల్లటకా,రము వెట్టక సంధిఁ జెందుఁ । బ్రాణముతోడన్. 91

ఆ. అక్కజంపుటడవి । నలశూర్పణఖముక్కు, మెఱుఁగుటంపమొనను। దఱిగి వైచెఁ
జిగురుటాకు గోటఁ। జిదిమినచాడ్పునఁ, గఱకుటసుర లులుక । గ్రహపకులుఁడు. 92

### విశేషణాంతద్రుతాగమము

మూ. సూ. ధాతుపదసమ్భవానాం విశేషణానా ముత స్తథానుమచి

తే. క్షితిని బైపదములకు వి। శేషణంబు, లగుక్రియాపదములతుది । నమరుశృంగ
మునకు వచ్చు నాగమ మయి। పొల్లద్రుతము,ప్రాణపరమైనఁ గర్మధా। రయమునందు

క. అనుటయు నతండు కవ్వడి, కనుఁగొనియెడునతఁడు మాద్రి। కడపటికొడు కా
మొనసందునతఁడు పడముడి, వెనుసనునతఁ డర్కసుతుఁడు । విరథుఁ డనంగన్. 94

### షష్ఠీసమాసద్రుతాగమము

మూ. సూ. షష్ఠ్యా ఉతో చి నుమ్వా చ. 20

తే. కొమ్మమీఁద షష్ఠీసమా। సమ్మునందు, న చ్చెదురఁ బొల్ల ద్రుత మగు । నాగమంబు
కొడుకునాలు సేనుఁగునొడ। ల్తాడవునొఱపు, రాజునానతి ధేనువు। నోజ యనఁగ.

### ఆమ్రేడితసంధి

మూ. సూ. ఆదచ్చి స్యామ్రేడితే త్వచ్చిలోప శ్చ. 21

తే. ఒక్కమాటయె రెండుమా ♦ ర్లుచ్చరింపఁ, దాని పేరాఖ్య నామ్రేడి ♦ తం బటండ్రు
పృథివిఁ దత్పదములలోన ♦ బ్రథమపదము, తుదిని సంధి ఘటించు న ♦ వ్వైదికపుగు.

తే. అచ్చటచ్చట [1]సాఢాకి ♦ వచ్చె నొక్కఁ
డొక్కఁ డయ్యారయారె యో ♦ హోహొ యంచు
పట్టి యనఁగ నామ్రేడిత ♦ పదము లందు
మొదలిపదములతుద సంధి ♦ గదియఁ గృష్ణ. 97

## అనుకారసంధులు

### మూ. సూ. అహామాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య.

సీ. అనుకరించెడుచోట ♦ నవ్యయాదులకొనఁ గలబొట్టుగవకు దీ ♦ ర్ఘంబులకును
వచ్చు లోపము కేశ ♦ వాయ తుభ్యం నమ యనఁగ రామోఘసం ♦ హార్త యనఁగఁ
బూర్ణంబులకు నోష్ఠ ♦ భూతానునాసికశృంగంబు జడ్డను ♦ జెంది నిలుచు
నంబుజాక్ష తవ దా ♦ సోహ మ్మనంగను బొల్లులకును ద్విత్వ ♦ ములు ఘటించుఁ

ఆ. బండితోత్తములు కృ ♦ పాసముద్రో హర, జిత్తటంచుఁ జదివి ♦ చెప్ప వినుచు
నసురవైరి విడిచి ♦ యన్యదైవతములఁ, గొలుచుమూఢమతులు ♦ గలరె యనఁగ. 98

వ. ఇవ్వి స్వరసంధు లనంబరఁగు నింక వ్యంజనసంధు లెట్టి వనిన. 99

## అద్భుతశబ్దసంధి

### మూ. సూ. ఖో రద్భుతశబ్ధాగ్థే. 23

ఆ. అద్భుతార్థవాచ ♦ కాంధ్రశబ్దంబున, నడిమివ్రాఁతకొమ్ము ♦ చెడును నిలుచు
హరి ధరించెఁ గేల ♦ నబ్రపుగిరి యనఁ, బ్రావె నబ్బురంపు ♦ నవ మనంగ. 100

## పుకారసంధులు

### మూ. సూ. పో శ్చ తదాద్యర్థవాచకే షాంతః. 24

తే. అప్పు డెప్పుడు కప్పురం ♦ బిప్పు డనుచుఁ, బలుకుచో పీనినడిమివ్రాఁ ♦ తలకుఁ గలుగు
కొమ్ములుండును బోవు ♦ గొప్ప కవ్ర, మప్డు గా కెప్డు మేనఁ బూ ♦ యు: గల దనఁగ.

## లుకారసంధులు

### మూ. సూ. వికృతిపదే లా టో రపి. 25

ఆ. అవని శృంగసహిత ♦ మగుతృతీయాంతస్థ, మునకు డాపలించి ♦ తెనుఁగులందుఁ
గలటకారశృంగ ♦ ములు పోవు నుండు ని, ట్టనియె నిట్టు లనియె ♦ ననఁగఁ గృష్ణ.

---

1 సాఢాడ (వ్రా. ము).

## రేఫసంధి

మూ. సూ. ఉపధా రే శ్చాపిత శ్చ లు గ్వా స్యాత్. 26

క. కడవర్ణమునకు దాపలి, కడ రేఫముగుడుసు లుక్కు • గాంచును దనకున్
గుడిచి [1]చకారము లుండెను, నెడల వికల్పమునఁ బన్న • గేశ్వరతల్పా. 103

క. పేర్చిరి పేరిచి రరిఁ బరి, మార్చిరి పరిమారిచిరి క్ర • మంబున ధనముల్
గూర్చిరి గూరిచి రప్పలు, దీర్చిరి తీరిచిరి నాఁగఁ • దెల్లం బయ్యెన్. 104

తే. మొదల రేఫాక్షరంబు నా • పిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ • జదువుకొనుచు
ముందు జడ్డయు వెస రేఫ • మునకు బదులు
గిలుక విభజించియు లిఖింతు • రిలఁ గుమతులు. 105

క. ఆఱఁటులఁ బఱఁటులఁ బఱిఁబెల, గఱిఁబెల మొఱిఁబెలను గలఱ • కారము దెల్లన్
ధర నెఱసున్నలు నగు న, య్యఱఁటులఁ బఱఁటులను ద్రుతము • లగువలసినచోన్.

## నరలడశృంగసంధులు

మూ. సూ. పదమధ్యనరలడానా ముత శ్చ, పూర్వప్రయోగసిద్ధా
నాం లోపో వా స్యాత్. 27

క. ధరఁ బదమధ్యనరలడా, క్షరములకొమ్ములు వికల్ప • కంబున విద్యా
ధరసన్నుత లోపము లగుఁ, బురాతనకవిప్రయోగ • ములఁ గొన్నింటన్. 107

ఆ. కాన్పు తూర్పు తెల్పు • గాఁపు కానుపు తూరు, పచ్చ తెలుపు గాఁడు • పనుచు నిట్లు
కొమ్ము లడఁగు నుండుఁ • గొన్నింటఁ దొల్లింటి, వారు కావ్యములను • వాడుకతన.

క. [2]పద మూనుదుఁ బదరుదుఁ బొదలుదుఁ బాడుదు ననుచు నిట్లు • లోకంబున నొ
ప్పిదము లగుకొన్ని పదములఁ, గదలవు నడికొమ్ము లాది • కవు లాడఁబడమిన్. 109

ఆ. వినఁడు చొరఁడు తలఁడు • విడఁ దనుపలుకులు
చిఱుఁత బొట్టమీఁద • జెందియునికి
సరసిజానేత్ర • నరలడాక్షరముల
కొమ్ము లడఁచి సంధిఁ • గూర్ప రాదు. 110

## త్రివిక్రమమతసంధులు

మూ. సూ. తేషా మిత శ్చ తద్వ త్త్రివిక్రమమతేన. 28

---

1 చికారము (పూ. ము). 2 పద మూనుదు. (ప).

ఆ. నడిమినరడలకు • గుడు లేగు నుండును, ధరఁ ద్రివిక్రమునిమ•తమునఁ గొన్ని
పూన్కి గూర్మి కల్కి•బుడ్డి పూనికి గూరి, మనము కలికి బుడిసి•యుఱుచు నిట్లు.

చ. కొలఁదిగ మున్ను చెప్పెఁ జలి•కొండనృసింహుఁడు వెల్ల యంచు నీ
వల నగసాలరుద్ర పను•వాఁడును మొల్క లటంచుఁ గూరిచెం
దెలియక కొంద ఱిట్లు వికృ•తిం బడుచున్యమునన్ లకారరే
ఫలఁ దలపై యకారమును • బాపుదు రార్యులు నవ్వునట్లుగన్. 112

వ. ఇందునకు వినుకొండలోను గంటికల్లిభాస్కరయగారిసముఖమందుఁ గందుకూరి రుద్రయగారు చెప్పినపద్యము. 113

చ. వెలగకు వెల్ల యంచు సర•విం జలికొండనృసింహుఁ డాడఁగా
మొలకకు మొల్క యంచుఁ గవి•ముఖ్యుఁడు రుద్రప పల్క దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర•బంధము నా జలరాశి యందులో
వల సెరను ల్గ్రహింతురె య•పారముతో మఱు తెల్ల నుండఁగన్. 114

## కవిభల్లటమతసంధులు

**మూ.సూ. కవిభల్లటైః క్రియాణాంనామ్నాంచోల్లోపఇష్యతేహ్యేషు,**
**ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోపి కథ్యన్తే. 29**

తే. ధాతుపదములకడపటఁ • దనరు రేఫ, శృంగములకు లోపంబులు • చెల్లుచుండు
హల్లు పైకొన్నచోఁ గవి • భల్లటార్య, మతమున వికల్పవంబునఁ•బతగగమన. 115

తే. సర్వగతుఁ డని హరి నెన్ను•దు ర్విబుధులు
పరమపురుషుని గాఁ దలం•తురు తపసులు
[1]శ్రుతిమయుం డని చెప్పుదు • ర్భూమిసురులు
బ్రహ్మ మనుచు నెఱుంగ లే • ద్దనుజవరులు. 116

సీ. భల్లటవిరచిత•ఫక్కిలో సూత్రంబువలనను బైహల్లు • నిలుచునపుడు
ప్రథమైకవచనము • ల్పలికెడుచోటను సమసనములు గూర్చు•సమయమునను
దెనుఁగునామంబుల • కొనల నుండెడునరలడలకొమ్ములు వికల్పంబువలనఁ
గాంచును లోపము•ల్దన్మూనెఁ గనుమూసి గోర్నాటెఁ జెక్కుట • గోరు నాటె

తే. మరుఁడు వి ల్పూనె విలు పూనె • మధుఁడు జాతి
ననల వీడ్కొనియెను వీడు•కొనియె ననఁగ
సాయపాన్వయవేంకట•క్ష్మాపదత్త
కామెపల్ల్యగ్రహారన•గర్యధీశ. 117

---

1 శ్రుతిమయుండని చెప్పుదు ర్భూ•సురులునదని (పూ. ము). భూమిసురలు.

తే. కాంతచన్గవ చనుగవ ♦ కార్మెఱుపులు
కాఱుమెఱుపులు వాల్గంటి ♦ కలికి వాలు
[1]గంటి చెడ్డాటు చెడుపాటు ♦ గాంచె ననుచుఁ
దెలుఁగుసమసనముల నిట్లు ♦ పలుక వచ్చు. 118

తే. చట్టుజాతికిఁ జట్రాయి ♦ గట్టుహేని, పట్టి యనుచోట గట్రేని ♦ పట్టి యనుచు
సమసనములటకారశృం ♦ గములు నడఁగు, నాదిశబ్దంబు సూత్రంబు ♦ నందుఁ గలిమి.

## ఔపవిభక్తికములు

మూ. సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తి
హ, రుల్వాదే ర్నామ్నాం స్యు ర్తే హి విభక్తౌ సమాసే చ.

సీ. అవిభక్తికము లగు ♦ నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక ♦ భాషణముల
కౌన నుండురుల్వాదు ♦ లను బోలెఁ దోలి విభక్తులందును సమా ♦ సోక్తులందు
నవని నాదేశంబు ♦ లగుచుఁ డింట్యాద్యక్షరంబులు నిలుచుప ♦ దంబు లెల్ల
నౌపవిభక్తికా ♦ హ్వయము లై కృతులను బహువిభక్తులను జా ♦ పట్టుచుండు
తే. నిపుడు చెప్పినరుల్వాది ♦ లిపులు కొన్ని, యందు నాదేశములు లేక ♦ యప్పటట్లు
సమసనవిభక్తులను రెంట ♦ నమరెనేని, యవియుఁ నౌపవిభక్తికా ♦ హ్వయము లయ్యె.

సీ. రలవర్ణములశృంగ ♦ ములకును గుడులకు డాలకొమ్ములకును ♦ టీలువచ్చు
నీటికి [2]దాఁకపం ♦ దిటికిఁ దోఁడేటి కంబటికిఁ గూటికి గుడి ♦ పాటి కనఁగ
జడ్డలు గలనలా ♦ క్షరశృంగములకును గొన్ని మాటలకు లా ♦ గుడుసులకును
గట్టిబొట్టులకుడి ♦ కడ డు కారములకుఁ బూర్ణయుక్తంబు లై ♦ పొందుఁ డీలు
తే. చంటి కింటికి గొంగు ♦ ద్దంటి కఱటి
పంటికిఁ దుపాకిగుంటికి ♦ రెంటి కనఁగ
*యిఱ్ఱులకుఁ దిఱ్ఱు లగునూతి ♦ కేటిమిర్రి
కనఁగ షష్ఠినిగొన్నింటి ♦ కమరు నిట్లు. 121

---

1 గంటి చేడ్పాటు చేదుపాటు ♦ గాంచెననుచు (పూ. ము); రెండును ఛందోభంగములని తెలియఁజేయుంచిహ్నము కలదు. 2 డాళ (ప. ఓ.).

* నీటులకు (పూ. ము) 'నూయి' శబ్దము యొక్క 'యి' కారమునకు 'తి' రాగా 'నూతికి' అగును. 'మిఱ్ఱు' శబ్దముయొక్క 'ఱ్ఱు' కారమునకు 'ర్రి' రాగా 'ఏటిమిర్రి' అగును. కాబట్టి 'యిఱ్ఱులకు' అని యుండవలయును గాని 'నీటులకు' అనుట తప్పు.

• పాలేటికాలువ • పందిటిగుంజ తాఁబేటిచిప్ప రంబటి•పింజికుండ
కాటిపాపఁడు [1]జుంటి•గడ్డ యింటిమగండు గొడ్డంటివచ్చుకుడు•పంటికోవి
ముంజేతికంకణం•బులు చేఁటిసారకాయ కొత్తిపీరుఁడు పెద్ద•గొత్తిచెక్క
నాఁపజొన్నలు కఱి•వేఁపపూవులదండ లలపాఁప మేతఁ•యుంప[2]ములుకు
తే. [3]ఇనుపపెనమునఁ బోసిన•యినుపదోసె
లనుపపప్పును జొక్కంపు•టెనుపనేయి
యనుచు నిట్లు సమాసంబు•లందుఁ గొన్ని
పలుకులను నిల్చు నౌపవి•భక్తికములు. 122

## అనౌపవిభక్తికములు

సీ. దూరు [4]పేరుబిడారు•తొలకరి పుల్లరి చాలుపాలు రవాలు•జగిలి మొగలి
యీడు జోడును గీడు•చెన్ను పన్నును [5]చెన్ను కల్లు జల్లును ప్రొల్లు•గాలి జాలి
చెండు దిండును దండు•చేదోయి ప్రాయి వేయి పాదు [6]వేమాదేదు•గేదమజ్జి
గీము తొల్లిటిబాము•మోము పున్నమనోము కొమ్మిమ్ము తలదిమ్ము • జొమ్ము సొమ్ము
తే. మనుము మొదలగువికృతినా•మంబు లొక్క
కొన్నితుదల రుల్వాదులఁ • గూడుకొనియు
లలి విభక్తులను సమాస•ములను రెంట
భువి ననౌపవిభక్తికం•బు లగుచుండు. 123

## మువిభక్తిలోపము

మూ. సూ. ప్రథమావైభక్తికమో ర్లుక్ పూర్ణో వాపతి క్రియార్థేతు.

తే. పడియె నను క్రియతుది నిల్పఁ • బడియెడు నెడఁ
బ్రథమ యగుమాకు సమసన•పదమునందుఁ
బొలుచ నాదేశ మగుఁ బూర్ణ• బిందు వదియు
లోపమును జెందును వికల్ప•రూపములను. 124

క. పడఁతి ప్రియంపడియె భయం, పడియె సుఖంపడియె సంభ్ర•మంపడియెఁ బదం
పడియెఁ బ్రియపడియెఁ గడుభయ, పడియె రమించి సుఖపడియె•భ్రమపడియెననన్.

---

1 బోటికాల్వ (పూ. ము; ప.). 2 ములకు. (వె. ము.) 3 లినుప (పూ. ము).
4 పెను (పూ. ము). 5 వెన్ను (ఓ). 6 లేదా (పూ. ము).

తే. భ్రాంతిపడి చింతపడి యను•పట్టఁ బెద్ద
సున్న గలుగదు కొనను మూ•సున్న యగుట
బలము పడియె మదేభము • పడియె ననినఁ
జెడి చనదు మూ సమాసంబు • నడుగు గామి. 126

## పువర్ణాదేశము

మూ. సూ. తస్య సమాసే పుంపూ. 32

క. ఆదివిభక్తిము కారము, లాదవవర కర్మధార•యసమాసమునన్
మేదినిపైఁ బెందుఁ బువ, ర్ణాదేశం బది సబిందు • వగు వలసినచోన్. 127

తే. పడఁతి యబ్రపుటూరు ల•బ్రంపుటూరు, లతివచోద్యపుటూరు చో•ద్యంపుటూరు
మగువసూక్ష్మపుఁగౌనుసూ•క్ష్మంపుఁగౌను, కలికిచొక్కపుమేను చొ•క్కంపుమేను.

## అథర్వణమతసంధులు

మూ. సూ. సు వ్యోప్రతో హల్యథర్వణాచార్యమతాత్. 33

తే. సమసనమున నామాంతశృం•గములకెల్ల, హల్లు గదియ స్వార్థంబునఁ•బొల్లుద్రుతము
వికృతి నాగమ మై ద్రుత•ప్రకృతిపగిదిఁ, గాంచు సంధి నథర్వణ•కవిమతమున. 129

క. చనుగవతుఁ జనుంగవ యనఁ, దనరుఁ దలిరుజొంపమునకుఁ • దలిరుంజొంపం
బన వచ్చు ననుఁగుచెలఁదికి, ననుఁగుంజెలఁది యన క్లిష్ట • మగు స్థిరపరతన్. 130

## పదమధ్యద్రుతలోపబింద్వాదేశములు

మూ. సూ. శత్రర్థతూత శ్చా నో స్తస్యస్యా చ్చ పూర్ణబిన్దురపి

ఆ. తెలుఁగువర్తమాన•ములవష్ఠవర్ణంబు, కొమ్ముపిఱుఁద ద్రుతము•కొమ్మమరినఁ
గొమ్ము లోప మగు ద్రు•తమ్ము పూర్ణం బగు, నడుమ గొన్నిటను వి•కల్పమునను.

క. చనుచును బూనుచు నెన్నుచు, ననుకొన్నిటఁ దక్క నంచు • ననుచును విరచున్
వినుచును గనుఁగొంచును గనుఁ, గొనుచును దించుఁదిను చనఁగ•గూఁడునుగృతులన్.

తే. ధాతుపదములనడుమను • దటలపిఱుఁద
వెలయుద్రుతములు స్వరసమ•న్వితము లగుచుఁ
దొలఁగి తమచోటఁ బూర్ణ బిం•దువులు [1]నిలుచుఁ
గొన్నిటను గనుఁగొందుఁ జే•కొంటి ననఁగ. 133

[1] నిలువు (వ్రా. ము).

## ప్రథమైకవచనద్రుతప్రకృతులు

**మూ. సూ. వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యా ల్లుక్.** 35

క. శ్యామాంగ నేను దా నను, నీమాటలకొనద్రుతంబు । లేఁగు నిలుచు హ
ల్లామీఁద నుండునప్పుడు, నే మనుదును నేను మనుదు । నీకృప ననఁగన్. 134

తే. తాను నే ననుపలుకుల। లోని ద్రుతము, లడఁగుచో మీఁదఁబరుషంబు। లసురదమన
సరళలిపు లగుఁ దద్ద్రుతా। క్షరము లర్ధ, బిందు లగుఁ దాఁజనంగ నేఁ। [1]బిలిచితనఁగ.

## పదాంతద్రుతలోపము

**మూ. సూ. వాక్యాన్తగతపదానాం చ.** 36

క. పస గలసీసాదికముల, వసుమతి నొక్కొక్కపదము । వాక్య మనంగా
నెసఁగుఁ దదంత్యపదముతుదఁ, బొసఁగునకారంబు పొల్లు। పోవు న్నిలుచున్. 136

తే. దానవారాతికేళికో,ద్యానసీమ, నాకభూజంబుచెంతఁ గాం। తాలలామ
ననఘగుణధామ సత్యభా। మను బెరిమను, గలయు నిచ్చలు ననఁగ ల। క్ష్యంబులయ్యె.

## పదాంతప్రాణలోపము

క. నాంతపదాంతద్రుతమున, కెంతయుఁ బ్రథమాబహూక్తి । కేతెంచుతృతీ
యాంతస్థంబునకుం బ,ద్యాంతంబున స్వరము లోప । మగుఁ గొన్నింటన్. 138

క. నలినాక్ష తెలుఁగుపద్యం,బులకడపల నుండునలల । పొల్లులకు మహీ
స్థలి గుడుసులు శృంగములును, నిలుపరు చదువునెడ లాక్ష। ణికు లెచ్చోటన్. 139

## ద్రుతప్రకృతికాంతబిందుసరళాదేశము

**మూ. సూ. పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతం
చ బిన్దు స్స్యాత్.** 37

సీ. ధర ద్రుతప్రకృతిశ। బ్దంబులపైఁ బరుషంబులు [2]నెడి సర। ళంబు లగును
ద్రుతములు ఖండబిం। దువు లగు నాపట్ల గాధేయముని వెంటఁ । గదలి నడచెఁ
జరణపంకజధూళిఁ। జట్టు నాతిగఁ జేసె వెసఁ డొక్క మనకుండ । విల్లు విఱిచె
ధాత్రీతనూభవఁ । దగ వివాహం బయ్యె గురువైభవంబునఁ । బురికి వచ్చె

ఆ. ఇనకులేంద్రుఁ డనఁగ । నివి యుదాహరణంబు, లిట్టిబిన్నినున్న। లెల్లఁ గుఱుచ
లిపులమీఁద నుండు। నపుడు గొప్పలు నగుఁ, గడమవ్రాలమీఁద। గావుగాని. 140

---

1 బిలిచితి నన (ప). 2 నిజసరళంబు (పూ. ము; ఓ).

ఆ. ముంగమురువు దాలి♦చెం గాంత యన నిట్లు, గొప్పనున్నలగును♦గుబ్బచమీద
రాజె నగ్ని గాలి♦ చేఁ జాల నన నిట్లు, నిడుదమీఁదఁ గావు ♦ నిండుబొట్టు. 141

## ద్రుతప్రకృత్యంతసరళాదేశము

**మూ. సూ. అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః**

సీ. అవని ద్రుతప్రకృ♦త్యంతద్రుతంబులు చెడి బిందువులు గాని♦యెడల వాని
వలపలిపరుషము♦ల్వరుసతో సరళంబు లవుఁగాని యచట బిం♦దువులు లేవు
తండ్రిపంపునను గాం♦తారంబునకు నేఁగి సమదవిరాధుని ♦ జావ మొత్తె
నతివతోడను దేకు♦టాకుటింట వసించెఁ గనకమృగంబును ♦ దునిమివైచె
తే. భామినిని బట్టుకొనిపోవు♦పఙ్క్తికంఠు
నంతకునిఁ జేర్చెఁ బుత్రమి♦త్రాన్వితముగ
నగరమునకు మహీజాత♦ను గొనివచ్చె
రాముఁ డర్కకులాంబుధి♦సోముఁ డనఁగ. 142

## ద్రుతప్రకృతికాంతద్రుతలోపము

**మూ. సూ. లు గ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్.** 142

సీసమాలిక. సరళంబులును స్థిరా♦క్షరచయంబును ద్రుతప్రకృతిశబ్దంబుల ♦ పైని గదియు
నపుడు తదంతద్రు♦తాక్షరంబులు వికల్పమున లోపంబు లై ♦ పరఁగుచుండు
జనియించె గరుడకే♦తనుఁడు దేవకియందుఁ బెరిగెను గోపికి ♦ బిడ్డఁ డనఁగ
నలినుతిఁ గాంచె జం♦భారిముఖ్యులచేతఁ బూతనను జయించెఁ ♦ బురిటిలోన
ననుపమస్థితి డెంద♦మున భీతి నొందక చంపెను డింభుఁ డై ♦ శకటదైత్యు
నడఁచె దుష్టాత్ముఁ దృ♦ణావర్తు మెడఁ బట్టి తిగిచి వ్రేపట్టెను ♦ దిక్కు లద్రువ
గర్గుచే బహునామ♦కములు గాంచెను నెఱపెను బాలలీలలఁ ♦ బెక్కుగతులఁ
బొడచూపె ఖేచర♦భూచరావలిఁ దల్లి కాననంబునను ఖ♦గాలి మెచ్చఁ
గదలె ఘోషాంగనా♦సదనంబులకు వెన్న ముచ్చిలియెను గంట ♦ మ్రోఁగకుండఁ
జేసె ఛిద్రంబులు ♦ క్షీరభాండంబులఁ బలికెను ఛలవాక్య♦ముల వనితలఁ
బడవైచె ఝంపావ్ర♦భంజనుం డన మద్దు లరిగెను ఝిల్లీర♦వాటవికిని
వదలక కాచె లే♦వలు మీఱఁ గ్రేపుల గోపకులను శీవిఁ ♦ గూడి మాడి
తునిమె ఢక్కుకుః జర్మ♦ముగను నో యన వత్సదనుజుని ఢాకతోఁ ♦ దలఁకక కుండ

నిర్జించె ధీరుఁడై • నిలిచి బకాసురు నఘుని ధాత్రిని గూల్చె • నద్భుతముగఁ
గల్పించె నీరేజ•గర్భుండు డాచిన వలను మీఱఁగ నూత్న•వత్సములను
గ్రీడించె ఫలితశా•ఖిచ్ఛాయలను మౌళిఁ జుట్టెను ఫుల్లప్ర•సూనమాల
నవలీల భంజించె • నావులఁ గాయుచు గర్దభాసురుని భీ•కరశరీరుఁ
గాళియుం మర్దించి • కాళింది వెడలించెఁ ద్రావెను మండెడు•దావవహ్ని
సరసి యాదగకేళి • సలుపుచుండఁగఁ జేకొనియెను యువతుల•కోక లెల్ల
భుజియించె రుచికరం•బుగ విప్రవనితలచేతను రాజాన్న•జాత మెలమి
రక్షించె లేఖభ•ర్త నుతింప నెల్లర హస్తంబునను లీల • నచల మెత్తి
శరమున వరుణకిం•కరుఁ డెత్తికొనిపోవునందుని వెదకి పం•తముననఁ దెచ్చెఁ
దాల్చె శరయాంబుజా•తంబున వేణువు పూరించెను శిరీష•ములు చిగుర్పఁ
బాడె షడ్జస్వర•ప్రభవగీతంబు విరాలిఁ బెట్టెను షట్ప•దాలకలను
జలమున సుందరీ•జనములఁ గిసరించి చనియెను సూనవృ•క్షములనడుమఁ

తే. గరుణ హేమాంబరంబుతోఁ • గానవచ్చి, మాన మెల్లను హరియించి • మరునికేళి
వారి నెల్లను దేల్చెను • వరుసకోలఁది, నన ద్రుతప్రకృతుల కుదా•హరణము లగు.

తే. ధేనుపాల తవర్గ ద్వి•తీయ మొకఁడు, మొదలియనునాసికంబులు • మూఁడులిపులు
నాంధ్రసంస్కృతశబ్దాదు•లందు లేమిఁ, జేసి వానికి లక్ష్యము • ల్చెప్ప నైతి. 144

## ద్రుతప్రకృతికాంతద్రుతశ్లేషము

మూ. సూ. అలుకి చ సంశ్లేష స్స్యాత్. 40

క. లలి సరళస్థిరములడా, పలినాంతపదంబు లూఁది•పలికెడుచో సం
ధులు గాంచును డతవర్గం, బులు నాఱిటిచెంతఁ దక్కఁ • బొల్లు లయి హరీ. 145

క. టతవర్గంబులు రెంటను, సతతము సరళాక్షరములు • సమలిపులును ని
ర్జితమఁర నాంతపదాంత, ద్రుతములనుం గూడుకొనవు • తుదిఁ గదిసినచోన్. 146

## మాలినీవృత్తము

నలువఁ గనిన వేల్పు • న్దంధవాహోదతల్పు
న్నలకలిభయహర్త • జ్జాంబవత్యాత్మభర్త
న్నలినదళసమాక్షు • న్బాణదైత్యేంద్రశిక్షుం
దలఁతు ననఁగ జెందుం • దన్నకారంబు లెందున్. 147

### మహాస్రగ్ధర

నవత ల్పాయం దలంతు • న్ఖగపతిగమను • న్ఛత్రచిత్రధ్వజాంకు
న్నవకందర్పావతారు • న్ఫణిపతిశయను • న్ఘస్రనాథేందునేత్రు
న్నవరత్నాంచత్కిరీటు • న్ఝషపదజనకు • న్భర్మవస్త్రాపిధాను
న్నవనీతక్షీరచోరు • న్నతజనసులభు • న్మానిహృత్పద్మవాసున్. 148

### నరకపుష్పిణీవృత్తము

నరకభయసంహారు • న్యాదవాగ్రేసరు
న్నరకదనుజాంతకు • న్రాహిణేయానుజు
న్నరముఖసురార్చితు • న్లక్ష్మణావల్లభు
న్నరహరిఁ దలంచెద • న్వాంఛితార్థార్తికిన్. 149

### స్రగ్విణీవృత్తము

నీరజాతేక్షణు • న్శేషసింహాసను, న్నారదాదిస్తుతు • న్షట్పదశ్యామలు
న్నారకాపద్ధరు•న్సామజేంద్రావను, న్నే రహస్యంబున • న్హృద్గతుం జేసెదన్.150

### ద్రుతప్రకృతికాంతబింద్వాదేశము

**మూ. సూ. బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్.** 41

తే. కడుఁ దృతీయచతుర్థవ•ర్గములు గలుగు, సరళములు సమలోఫులును • బరము లైన
తఱిని సాంతపదాంతద్రు•తంబుపొల్లు, బెఱికి దైయి నిత్యముగఁ బూర్ణ•బిందు వగును.
క. నన్నయసూత్రమునఁ గ్వచి, త్తన్న దొకటిఁ దక్క బొట్టు • కక్షరనియమం
బెన్నుట లే దాదికవుల్, గొన్ని తెలుఁగు లరసి తెలిసి• కొంటిని వీనిన్. 152

అవి యెయ్యవి యనినఁ దృతీయవర్గసరళంబునకు రాచమల్లువారిషష్ఠస్కంధములోను ప్రయోగము చతుర్థవర్గసరళంబునకు రాఘవపాండవీయములోను భారతార్థమునందు పింగలిసూరపరాజు ప్రయోగము టవర్గద్వితీయమునకు త్రైశంకవోపాఖ్యానములోను కవిసింగరన్న ప్రయోగము. 153

క. డుంఠీశు భైరవుని సితి, కంఠు విశాలాక్షి దండ•కరు జాహ్నవి పై
కుంఠపతి గుహుని లోలా, ర్కుం శేవలు మీఱ భూవ•రుఁడు శొడగనియెన్.154

టవర్గచతుర్థంబునకు అథర్వణాచార్యులవిరాటపర్వమునందు:—

తే. ఢాంఢమిత భేరికాధ్వాన•[1]ముం ఢులీని, నాదమును మిన్ను ముట్ట సం•సారతంబు
పెక్కుగంధర్వపతులు సం•ల్దిక్కులందుఁ, గాచుసౌగంధికంబుఁ దేఁ•గలరెయొరులు.155

---

1 ముంఢు వీని (పూ. ము.).

తవర్గంబునందు ద్వితీయవర్ణము సంస్కృతాంధ్రశబ్దాదులందు లేదుగానఁ బ్రయోగంబు గలుగ నేరదు. చతుర్థాక్షరంబునకు అనంతునిఛందమునందు:—

తే. పేర్చి పొల్లనకారంబు • బిందు వగుచు
మీఁద నున్నధకారంబు • నూఁది ప్రాస
బంధ మగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి
యంతయును నిరుపద్రవం • బయ్యె ననఁగ 156

క. మందర గజబమకారము, లొందిన నాంతములతుదల • నుండు ద్రుతములం
గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులఁ • బెట్టుదు రొకచోన్. 157

సీ. అంగజకేళిఁ దేల్చెం గోపకాంతల నగము హస్తంబున • నగరిమఁ దాల్చెఁ
[1]గుంజి భోజధరావరుం జముకడఁ జేర్చె నరుఁ బ్రోచె రణమున • నగ మెఱుంగ
జాంబవంతుని గెలిచెం బంటుతనమున నటికెఁ జక్రంబున • న్బాణుపాణు
లమ్మకుండలము లిచ్చెం మహీసుతుఁ జంపి నాటె భూతలమున • న్మనువతరువు

తే. దైవమాత్రంబె దేవకీదేవిపట్టి, దేవదేవుఁడు శ్రీవాసుదేవుఁ డనఁగ
గజబమంబులడాపలఁ • గదియనట్టి, నాంతపదముల కెల్ల లక్ష్యంబు లయ్యె. 158

## నమకారద్విత్వమైత్రము

తే. తమతుఁ దాము ద్విత్వంబు లై • యమరునవియుం
బిందువులు డాపలను వెలుఁగొందు నవియుం
నొక్కరూ పయి పూర్వప్రయోగసరణి
నములు ప్రాసంబులకు నిల్చు • దమతుఁ దాము. 159

క. మిన్నేఱుపాదమున ఘాతన్నాభిని గుసుమశరు సెందం గాంచిననీ
సాన్నిధ్యము దొరకుటకై, సన్నుతి సేయందురు నిన్ను • సనకాదు లజా. 160

క. తమ్ములను మల్లికాకుసుమమ్ముల మరువాదిపత్త్రమాలికలను భ
క్తిమ్మురసంహారుపూజలు, సమ్మదమున సలుపఁ గలుగు • సకలార్థంబుల్. 161

## పదాంతనులు కారద్విత్వలోపములు

మా. సూ. ప్రథమ లుగపి ద్విసులోప్యః. 42

1 గెంజి (పూ. ము.); గ్రుంజి (ఓ).

క. సమయంబున వికల్పకంబున, శమితదనుజ తమకుఁ దాము ♦ జడ్డ లయి పదాం
తముల వెలిం గెడి సులువర్ణము లను బ్రథమాక్షరములు ♦ రాజీవాక్షా. 162

తే. కన్ను మూసెను గను మూసెఁ ♦ జన్నుదోయి
గబ్బిచనుదోయి మిన్నువాఁ♦క మినువాఁక
మల్లు నాటెను మలు నాటెఁ ♦ బల్లుగంటి
తరుణి పలుగంటి కల్లుముం♦త కలుముంత. 163

## ద్రుతలోపసమాసములు

మూ. సూ. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. 42

తే. వనధితనయేశ యయినటు♦వంటి యనుచుఁ
బరపదవిశేషణము లేటఁ♦బఱచుకొనుచు
దొలుతటిపదంబుకొనఁ నుండు♦ద్రుతము గుడియుం
సమసనమునందుఁ జెందు లో♦పములు కృతుల. 164

క. కడపలిద్రుతమును గుడియుఁను, బొడ వడఁగినఁ బయిని బరువ♦ములు సరళము లౌఁ
జెడవు పెఱహల్లు లెల్లను, నడలక ప్రాణంబు లెల్ల ♦ సంధులుఁ గాంచున్. 165

తే. జగతిఁ జప్పనికూరకుఁ ♦ జప్పగూర, చనును జక్కనిచాయకుఁ ♦ జక్కచాయ
హెచ్చు[1]పచ్చనిటోపికిఁ ♦ బచ్చడోపి, గరిమఁ గమ్మనితావికిఁ ♦ గమ్మదావి. 166

ఆ. చల్లగాలి తీయ ♦ విల్లు నా సరళస్థి రాక్షరములు తొల్లి ♦ యట్ల నిలుచుఁ
బంచబాణజనక ♦ పచ్చావు నల్లావు, లనుచు నచ్చ లెల్ల ♦ నదుకు నిట్లు. 167

## హేమాచార్యమతసంధులు.

మూ. సూ. హేమోక్తేః పరుషాణాం గసడదవాస్స్యుః పదాత్
ద్వన్ద్వే. 44

క. సుమనస్స్తుత ద్వంద్వసమాసమునను హేమోక్తిని బర♦శబ్దాదిమవ
ర్ణము లగుపరుషాక్షరములు, తమరూపులు విడిచి గసడ♦దవ లగు వరుసన్. 168

ఆ. కనువుకట్టెలనఁగఁ ♦ గాలుసేతు లనంగ, నిక్కు డెక్కు లితఁడు ♦ నేరఁ డనఁగ
నొప్పుదప్పు లనఁగ ♦ నూరుపల్లె లనంగ, జరుగు నిట్లు ద్వంద్వ♦సమసనమున. 169

---

1 పచ్చనితోఁటకుఁ బచ్చదోఁట (పూ. ము); పచ్చనిటోఁపికిఁ బచ్చడోఁపి (ఓ); పచ్చనిపోటికిఁ బచ్చపోటి (ప).

## ప్రథమాంతగసడదవాదేశము

**మూ. సూ. గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్మాస్థదో ర్త్యాస్యాపరుషాః** 45

సీ. శుకమునిస్తుత ద్రుత• ప్రకృతు లౌ నేను దా నను రెండు దక్కంగ•నవని గలుగు
ప్రథమావిభక్తుల • పైని దత్తుల్యశబ్దములమీఁదను గను•కట్టు సాంధ్ర
శబ్దాదిగతపరు•షంబు లేనింటికిఁ గ్రమము దప్పక వచ్చు • గసడదవలు
సిరి గలిగిననాఁడు • పురుషుండు సెలరేఁగి నిక్కంబు డెక్కలు • నెరపుఁ గాని
తే. ప్రియము దళు కొత్త నర్థికిఁ • బెట్ట లేఁడు
కలిమి వోయిన నీగికిఁ • గాంక్ష సేయుఁ
నపుడు గలుగునె తనకుఁ గా • నైన ననఁగ
నివి యుదాహరణము లయ్యె • నెన్నిచూడ. 170

**మూ. సూ. న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః.** 46

సీ. పరమాత్మప్రథమావి•భక్తులమీఁదను దత్సమాసాంధ్రశ•బ్దములమీఁదఁ
గలసంస్కృతపదాది•గతపరుషంబు లెల్లెడ నిజరూపము • ల్చెడక నిలుచు
గాదిలిజవరాలు • కమలనివాసిని చిఱుతముద్దులపట్టి • చిత్తజాతుఁ
డనుఁగుఁజుట్టంబు టం•కాయుధహస్తుండు మక్కువమఱఁది తా•మరసవైరి
తే. నిక్కమర్మిలి మామ పా•నీయరాశి, యరసి చూడంగ నెవ్వని • కట్టివేల్పు
నాఁడు కరుణించి నాకు స్వ•ప్నమున వచ్చి, తెనుఁగు గావించుమనియెను•దీనిననఁగ.

### కల్పితకల్పవల్లీసమాసలక్షణసీమాలిక

[1]పంచదశవిధాంధ్ర•పద్యగర్భితములై కరధృతకరుహాము•ఖ్యంబు లగుచుఁ
బరఁగు ద్వితీయవి•భక్త్యేకవచనాంతసంస్కృతభాషాష్ట•సమసనములు
వాని కధ్యాహార్య • మై సామి యనుధాతుపదము పైకొనునభి•ప్రాయములకు
సమసనాంతస్థితా•క్షరములపైఁ గలతలకట్టులకు శృంగ•ములు ఘటించి
బొట్టులవలపలఁ • బొదలువర్గాద్యక్షరము లెల్లఁ దత్సర•శములు చేసి
యాదివర్గద్వితీ•యములదాపల నుండుపూర్ణంబులకుఁ బద్య•ములకుఁ దుదిని
దనరుసున్నలును బో•ల్లనకారములఁ జేసి పఠియింప నగునాంధ్ర•పద్యవితతి

1 పంచాదశ (ఓ. ప; పూ. ము.)

తరువాతఁ గందపద్యము.తోడఁ గులకమై తలచూపు దానికి ♦ ధాతుపదము
మదనవిలసితయుగ్మం బయ్యెఁ బదపదంబునకు సప్తాక్షరంబులుగఁ జదువ
నిపుడు చెప్పినవృత్త♦మే యంగవిధులచే మధుమతివృత్తనా♦మంబు గాంచుఁ
బాదపాదమునకుఁ ♦ బదునాల్గువర్ణము ల్గావింపఁ బ్రహరణ♦కలిత మయ్యెఁ
దొలుతటిసమసనం♦బుల ద్రుత ప్రకృతు లై పై నొక్క సమసన♦పదముఁ గూడి
[1]పంచదశాక్షరో♦దంచితపదము లై మణిగణనికరస♦మాఖ్యఁ జెందు
నష్టమాత్రావృత్త♦యమళ మయ్యె ద్రుతాంతసమసనం బొక్కొక్క♦చరణ మైన
సాంతసమాసద్వ♦యం బొక్కపాద మై రగడలలో మధు♦రగతియు నగుఁ
దలపోయ నిటుల వ్య♦త్యయలేఖనక్రమవిధులు షోడశలఘు♦వృత్త మంద్రు
ద్విపద పాదం బయ్యె ♦ దీనికిఁ గడపలఁ జూపట్టు ద్రుత మర♦సున్న యైన
వెస ద్రుతాంతంబు లై ♦ నసమాసములు నాల్గు హరిగతి కేకాంఘ్రి ♦ యై తనర్చు
వేములు కడపల ♦ వెలయు సమాసంబు మొదలుగాఁ దుదయంద♦మొదలు గలయఁ
జదువువేళఁ దృతీయ♦సప్తమసమసనచరమబిందులు ద్రుతా♦క్షరము లైనఁ
గనుపట్టు నెనిమిది ♦ కందపద్యంబులు గణయతిప్రాసము ♦ లక్కడమ గాక
తే. నిట్టిగర్భకవిత్వంబు ♦ లెఱిఁగి నీకుఁ, గవిత రచియించు వానిభా♦గ్యంబు వొగడ
నమరనేతకు ధాతకు ♦ నైనఁ దరమె, [2]సహ్యభూ(జా)దక్షిణశై కయో♦జననివేశ. 172

## అవతారిక

అథేదానీం కాకునూర్యప్పకవిపర్యః పంచదశాష్ట)పద్యగర్భితాష్టసమాసాక్
ప్రహారణకలితవృత్తేన సంగృహ్ణాతి.

కరధృతకరుహం ♦ కరిహీతకరణం, కరుహాసఖరుచిం ♦ గరుడఖగరథమ్
ఖరఘనకరభం ♦ ఖరతరకరగం, గరళముఖరిపుం ♦ గరధరకరతమ్. 173

టీక. బాలానాం మందబుద్ధీనాం సుఖావబోధార్థ మేత దష్టసమాసాంతర్గత శబ్దానాం క్రమేణార్థం దర్శయతి ప్రపంచయతి-కరధృతకరుహం కం జలం 'కం శిరోంబునో' రితి నానార్థాభిధానాత్-కే జలే రుహతి ప్రాదుర్భవతీతి -కరుహ మబ్జం శంఖ మితి యావత్ -రుహబీజజన్మని ప్రాదుర్భావేచ ఇతి ధాతుః. కరో హస్తః బలహస్తాంశవః కరా ఇత్యమరః-కరేణ ధృతం కరుహం శంఖం యేన తం కరధృతకరుహం శంఖ ధారిణ మిత్యర్థః. యద్వా కరేణ హస్తేన ధృతం కరుహమంబుజంయేన తం కరధృత కరుహం పద్మస్యాంభోరుహత్వేన కరుహత్వస్య వక్తుంశక్యత్వాత్. తథాచ హస్త

1 పంచాశద (పూ. ము.) 2 సహ్యమీ (పూ.ము.)

ధృతాంభోరుహ మిత్యర్థః. శంఖచక్రగదాపద్మధారిణం వనమాలిన మితి ధ్యానా న్తరప్రసిద్ధేః. 1

కరిహితకరణం-కరో హస్తో స్యాస్తీతి కరీ మతంగజః 'కుఞ్జరో వారణః కరీ'త్యమరః - కరిణో హితం మోక్షణం కరిహితం - కరిహితే కరణః సాధనభూతః- తం కరిహితకరణం - అత్ర కరణాధికరణయో రితి కరణార్థే ల్యుట్. నచాస్య ల్యు డన్తస్య పుంస్త్వం శంకనీయం. నారాయణ ఇత్యాదౌ పుంస్త్వస్యాపి ప్రసిద్ధేః. అశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్యేతి జనపదాదిషు పూర్వై రభిహితత్వాత్. పురా కిల పాండ్యరా డిన్ద్రద్యుమ్నాఖ్యో రాజర్షి రగస్త్యశాపవశా ద్గజేన్ద్రతా మా పన్నస్సన్ కదాచి త్తృష్ణావశాద్దుగ్ధోదధిమధ్య త్రికూటాచలాగ్ర వారుణోద్యానాం తరసరోవరం సమాగత్య దేవలశాపాగతగ్రాహరూపిణా హూహూగంధర్వేణ గ్రస్తః ప్రాక్తనజన్మతపోవిశేషవిజ్ఞానసంపన్న స్సన్ పరమేశ్వర ముద్దిశ్య స్తోత్రం చకార. వైకుంఠభవనస్థో వాసుదేవ స్తత్సమీపం ప్రాప్య మోక్షయామా సేతి సుప్రసిద్ధం భాగవతే. 2

కరుహాసఖరుచిం కే జలే రుహన్తి కరుహా ణ్యమ్భోజాని కరుహాణాం నీర జానాం సఖా హితః కరుహాసఖ స్సూర్యః అత్ర రాజాహస్సఖిభ్య ష్టజితి టచ్ప్ర త్యయః కరుహాసఖస్య సూర్యస్య రుచిరివ రుచి ర్యస్య తం. కించ యథా భాస్వాన్ తమో నివర్తయన్ లోకం దీపయత్యేవం విష్ణు రప్యజ్ఞానరూపతమో నివర్తయన్ లోకదీపకత్వా త్తస్య భాస్కరతేజోవత్త్వం యుక్తం. యద్వా కరుహా ణ్యుత్ప లాని తేషా మపి జలరుహత్వస్య వక్తుం శక్యత్వాత్. కరుహాణా ముత్పలానాం సఖా హితః కరుహాసఖ శ్చంద్రః కరుహాసఖస్య భూషణమయచన్ద్రస్యరుచి ర్యస్య తం బాలభావే హారిణార్ధ చన్ద్రా[1]కార భూషణధారణస్య కర్ణామృతే షూక్తత్వాత్ యద్వా' సూర్యకోటి ప్రతీకాశం చన్ద్రకోటిసమప్రభ' మితి పద్మపురాణే భగవ ద్ధ్యానాంతరస్య సత్వాచ్చ అస్మిన్నర్థే కరుహాసఖేత్యత్ర బహువచనతయా సమాసో జ్ఞేయః బహుత్వస్య త్రిత్వాదిసాధారణత్వాత్ అథవా కరుహా ణీన్దీవరాణి తేషాం సఖా హృదయభూతా తుల్యరూపిణీత్యర్థః-తాదృశీ రుచి ర్యస్య తం శైత్యం హి యత్సాప్రకృతి ర్జలస్యేత్యాదివ ద్భిన్నలింగానా మపి విశేషణవిశేష్య భావ స్సమ్పద్యతే. 3

1 కారణభూ. (వె. ము)

గరుడ ఖగరథం-గరుడో గరుత్మాన్-'గరుత్మాన్గరుడ స్తార్క్ష్య' ఇత్యమరః. గరుడ ఇతి ఖగః పక్షీ గరుడఖగః గరుడఖగ ఏవ రథో వాహనం యస్య తం. యద్వా ఖే గచ్ఛన్తి చరన్తీతి ఖగా ఇతి వ్యుత్పత్త్యా ఖగశబ్దస్య దేవతావాచకత్వస్యాపి వక్తుం శక్యత్వాత్ గరుడఖగో గరుడదేవః స ఏవ రథో యస్య తం. అథవా గరుడ ఏవ ఖగరథో వ్యోమసంచారణపటూ రథో యస్య తం కించ-ఖగ స్సూర్యః 'శరార్క విహంగాః' ఖగా ఇత్యమరః. సూర్యశబ్దస్య శ్రేష్ఠవాచకత్వస్యాపి వక్తుం శక్యత్వాత్ గరుడానాం పక్షిణాం శ్రేష్ఠః గరుడఖగః స ఏవ రథో యస్య తమ్. 4

ఖరఘనకరవిం-ఖరః ఖరాసురః ధేనుకవనవాసీ గర్దభాసురః-అథవా దండకారణ్య నివాసో రావణజ్ఞాతిః ఖరాసురః స ఏవ ఘనః మేఘః 'ఘనజీమూతముదిరా' ఇత్యమరః. కః వాయుః 'మారుతే వేధసి బ్రధ్నే పుంసి క' ఇత్యమరః కానాం వాయూనాం రవిః శ్రేష్ఠ శ్చణ్డమారుత ఇతి యావత్ ఖరఘనస్య కరవిః తం ఖరసమానఖరాసురస్య ప్రళయవాయుస్వరూపః అస్మిన్ పక్షే భాగవతరామాయణప్రసిద్ధి ర్ద్రష్టవ్యా. 5

ఖరతరకరగం-ఖరతరా స్తీక్ష్ణతరాః 'తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వ'దిత్యమరః, కరా అంశవో యస్య సః ఖరతరకర స్సూర్యః తంగచ్ఛతీతి ఖరతరకరగః తం. ధ్యేయ స్సదాసవితృమణ్డలమధ్యవర్తీతి ధ్యానశ్లోకప్రసిద్ధత్వాత్, యద్వా ఖరతరో దర్దురః కరో యస్య సః ఖరతరకరః కుంజరః స ఇవ గచ్ఛతీతి ఖరతరకరగః తం మత్తమాతంగవిక్రమమితి రామాయణే బాలకాండే వాల్మీకివచనప్రసిద్ధేః- నచాత్ర విక్రమపదస్య పరాక్రమార్థపరత్వాశ్రయణీయా తద్వ్యాఖ్యానే తత్పదస్య క్రము పాదవిక్షేపణ ఇత్యస్మాద్ధాతోర్గమనార్థకత్వ స్యోక్తత్వాత్. 6

గరళముఖరిపుం - గరళం విషం ముఖే యస్య సః గరళముఖః కాళియః తస్య రిపుః శత్రుః తం కాళియమర్దన మిత్యర్థః. అత్ర భగవాన్ యమునాహ్రదస్థం కాళియాఖ్యం మహోరగం శిక్షితవా నితి పూర్వభాగవతప్రసిద్ధేః. 7

గరధరకరతం-ధరతీతిధరః డుధాఞ్ ధారణపోషణయో రితిధాతుః గరస్య కాలకూటస్య ధరో గరధరస్సదాశివః స ఏవ గరధరకః స్వార్థే కప్రత్యయః తస్మిన్రతం ప్రీతిమంతం నారాయణప్రియ మనంగమదాపహార మితి స్తోత్రాత్. యద్వా కశబ్దస్య బ్రహ్మవాచకత్వాత్ గరధరశ్చ కశ్చ గరధరకౌ తయోః రతం ప్రీతిమంతం యద్యపి నారాయణస్య సర్వసమత్వ మేవ వక్తవ్యం తథాచ లౌకికసామ్యాత్పురాణ ప్రసిద్ధే శ్చ తద్వ దుక్తి రితి జ్ఞేయమ్. అత్ర నామార్థవ్యాఖ్యానవ్యాహారేణ తథావిధం

గోపాలం సామోత్యర్థః. యద్వా గరధరకరత మిత్యత్ర, గరేతి ధరేతి కరత మితి పద త్రయం ద్రష్టవ్యం తథాచ హేగర విష స్వరూపహాపిష్మేతి యావత్ కేబ్రహ్మాణి రతం ప్రీతిమంతం పూర్వోక్తరీధా దేవం ధర హ్యాని ధ్యాయస్వే త్యర్థః అత్ర కృష్ణస్య గరుడఖగరథమితి విశేషణద్వయసామర్థ్యాత్తద్భజనేనాన్య పాపరోధో భవిష్యతీతి తధ్యోక్తిరితి జ్ఞేయమ్. 8

వ. సప్తాక్షరైకపాదంబైన గర్భమదనవిలసితవృత్తద్వయము.

కరధృతకరుహాలున్, కరిహితకరణున్, గరుహాసఖరుచిన్, గరుడఖగరథున్. 176

## గర్భద్వితీయమదనవిలసితవృత్తము

ఖరఘనకరవిన్, ఖరతరకరగున్, గరళముఖరిపున్, గరధరకరతున్. 177

వ. కొందఱీరెండువృత్తములు మధుమతీవృత్త మందురు.

## చతుర్దశాక్షరైకపాదంబైనగర్భప్రహరణకలితవృత్తము

కరధృతకరుహాలున్ కరిహితకరణున్, గరుహాసఖరుచిన్ గరుడఖగరథున్

కరఘనకరవిన్ ఖరతరకరగున్, గరళముఖరిపున్ గరధరకరతున్. 178

## పంచదశాక్షరైకపాదంబైనగర్భమణిగణనికరవృత్తము

కరధృతకరుహాలుని, కరిహితకరణున్, గరుహాసఖరుచిని, గరుడఖగరథున్

ఖరఘనకరవిని ఖరతరకరగున్, గరళముఖరిపుని గరుడఖగరథున్. 179

## అష్టాక్షరైకపాదంబైనయష్టమాత్రావృత్తద్వయము

కరధృతకరుహాలుని, కరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని. 180

## గర్భద్వితీయాష్టమాత్రావృత్తము

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 181

## షోడశాక్షరైకపాదంబైనగర్భమధురగతిరగడ

కరధృతకరుహాలుని, కరిహితకరణుని, గరుహాసఖరుచిని, గరుడఖగరథుని

ఖరఘనకరవిని, ఖరతరకరగుని, గరళముఖరిపుని, గరధరకరతుని. 182

వ. కొందఱు దీనినె షోడశలఘువృత్తమ నందురు.

## పంచదశాక్షరైకపాదంబైనగర్భద్విపదము

కరధృతకరుహాలుని, కరిహితకరణు, గరుహాసఖరుచిని, గరుడఖగరథు

ఖరఘనకరవిని, ఖరతరకరగు, గరళముఖరిపుని, గరధరకరతు. 183

## ద్వాత్రింశదక్షరైకపాదం బైనగర్భహారిణగతిరగడ

కరధృతకరహుని • గరిహితకరణుని, గరుహాసఖరుచిని • గరుడఖగ[1]రథుని
ఖరఘనకరవిని • ఖరతరకరగుని • గరళముఖరిపుని • గరధరకరతుని. 184

## గర్భప్రథమకందము

కరధృతకరుహుఁ గరిహిత, కరణుఁ గరుహాసఖరుచిని•గరుడఖగరథుఁ
ఖరఘనకరవిఁ ఖరతర, [2]కరగుఁ గరళముఖరిపుని•గరధరకరతున్. 185

## గర్భద్వితీయకందము

గరధరకరతుఁ గరధృత, కరుహుఁ గరిహితకరణుని • గరుహాసఖరుచిఁ
గరుడఖగరథుని ఖరఘన, కరవిఁ ఖరతరకరగుని • గరళముఖరిపున్. 186

## గర్భతృతీయకందము

గరళముఖరిపుఁ గరధర, కరతుఁ గరధృతకరుహుని • గరిహితకరణుఁ
గరుహాసఖరుచిఁ గరుడఖ,గరథుఁ ఖరఘనకరవిని•ఖరతరకరగున్. 187

## గర్భచతుర్థకందము

ఖరతరకరగుఁ గరళము, ఖరిపుఁ గరధరకరతునిఁ • గరధృతకరుహుఁ
గరిహితకరణుఁ గరుహాస,ఖరుచిఁ గరుడఖగరథుని • ఖరఘనకరవిన్. 188

## గర్భపంచమకందము

ఖరఘనకరవిఁ ఖరతర, కరగుఁ గరళముఖరిపునిఁ • గరధరకరతుఁ
గరధృతకరుహుఁ గరిహిత, కరణుఁ గరుహాసఖరుచిని • గరుడఖగరథున్. 189

## గర్భషష్ఠకందము

గరుడఖగరథుఁ ఖరఘన, కరవిఁ ఖరతరకరగుని • గరళముఖరిపుఁ
గరధరకరతుఁ గరధృత, కరుహుఁ గరిహితకరణుని • గరుహాసఖరుచిన్. 199

## గర్భసప్తమకందము

కరుహాసఖరుచిఁ గరుడఖ,గరథుఁ ఖరఘనకరవిని • ఖరతరకరగుఁ
గరళముఖరిపుఁ గరధర,కరతుఁ గరధృతకరహునిఁ • గరిహితకరణున్. 191

---

1 రథుఁ...రవిఁ...రగుఁ...కరతుఁ,(వె. ము.) 2 కరతుఁ. (వె. ము.)

## గర్భాష్టమకందము

కరిహితకరణుఁ గరుహాస,ఖరుచిఁ గరుడఖగరథుని ॥ ఖరఘనకరవిఁ
ఖరతరకరగుఁ గరశము,ఖరిపుఁ గరధరకరశుని ॥ గరధృకకరుహాంక్. 192

## పదప్రకాశితకందము

క. కామెపలినామపురిసు,త్రాము సరోజాప్తకోటి॥ ధాము జలధర
శ్యాము యదుసోము దనుజవి,రాము న్ద్విజస్త్రీమనోభి॥ రాముఁ దలంతున్. 192

## ఆశ్వాసాంతగద్యము

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భరద్వాజగోత్ర కామెపల్లి పురమందిర నందనందన చరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవ వేంకటార్యతనూభవ విద్యావిశేషధురాచార్య కాకునూర్యప్పకవివర్యవిరచితం బైనయంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణశాస్త్రంబునం దష్టాదశార్యావృత్తంబులు నష్టచత్వారింశత్సూత్రంబులుం గలసంధి పరిచ్ఛేద మను పంచమాశ్వాసము.

అప్పకవీయము సంపూర్ణము



# అప్పకవి ఉదాహరించిన గ్రంథములు

## అందులోని పద్యములు.

| | ఆ. | ప. |
|---|---|---|
| **అథర్వణాచార్యుని విరాటపర్వము:—** | | |
| క. ఆకర్ణదురాలాపము | 3 | 142 |
| తే. ధాంధమిత | 5 | 155 |
| ఆ. ధర్మతనయ | 3 | 124 |
| క. శ్రీకంఠు | 3 | 141 |
| **అనంతుని ఛందము:—** | | |
| తే. అఱియనంగను 1-101 | 3 | 193 |
| తే. ఒరులనమ్మయ్య 1-120 | 3 | 228 |
| క. కాకుస్వరయతి 1-95 | 3 | 94 |
| క. ధరనెక్కటి 1-118 | 2 | 237 |
| ఆ. నాస్తియనక 1-99 | 3 | 175 |
| ఉప. పినాకికోదండము 2-35 | 2 | 131 |
| తే. పేర్చిపొల్లు 1-51 | 5 | 156 |
| గీ. మరునితండ్రి 1-119 | 2 | 238 |
| క. యరలవలంతస్థలు 4-124 | 2 | 54 |
| క. లళలకుభేదము 4-125 | 2 | 55 |
| **అష్టమహిషీకల్యాణము:—** | | |
| ద్వి. ఇంతులమేల్బంతి | 3 | 174 |
| **అహోబలమాహాత్మ్యము:—** | | |
| క. నినునాశ్రయించి | 2 | 89 |
| **ఆదిపురాణము:** | | |
| మ. ఒకనాఁడిందుధరుండు * | 3 | 118 |

| | ఆ. | ప. |
|---|---|---|
| **ఆముక్తమాల్యద (విష్ణుచిత్తీయము)** | | |
| శా. అనిష్ఠావిధి 1-84 | 3 | 147 |
| చ. కదళికభీర 1-83 | 2 | 167 |
| ఉ. కందరనీలవర్ణ 5-158 | 3 | 351 |
| మ. గురుగుంజెంచలి 4-134 | 3 | 139 |
| మ. గృహసమ్మార్జనమో 2-91 | 3 | 36 |
| తే. తిరుగుదు 1-41 | 3 | 35 |
| క. తునియలు 1-35 | 3 | 150 |
| మ. దవధూమంపు 2-84 | 2 | 61 |
| ఉ. పూనిముకుందు 1-4 | 1 | 131 |
| | 2 | 76 |
| చ. మలచిపయోజ 1-51 | 3 | 153 |
| ఉ. వేలినమేడ 1-62 | 2 | 257 |
| మ. స్ఫుటభూయో 4-145 | 2 | 102 |
| చ. హితులఁభిషగ్గ్రహ 4-273 | 3 | 31 |
| **ఉత్తరహరివంశము:—** | | |
| శా. నాతోమార్కొన | 3 | 319 |
| **కవికర్ణరసాయనము:—** | | |
| మ. అమరీవిభ్రమ | 3 | 295 |
| తే. దానగుణశాలి | 3 | 318 |
| **కవిగజాంకుశము:—** | | |
| క. ఒదుగుచు | 2 | 166 |
| సీ. జిలుగుచందురు | 2 | 398 |

* ఇది సోముని ఉత్తరహరివంశములోనిది.

శృంగారశాకుంతలములో నున్నది. చూ. 2. 187

* గణితము-పావులూరిమల్లన ఉ శ్రీనిధియైనశివ్వనను 3-55

అప్పకవీయము—22

## చాటువులు



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
వావిళ్ల ప్రెస్సున ముద్రితము.—1951.

# శుద్ధపత్రము

పు పం తప్పు ఒప్పు

2 23 జిరాలన జీవాలన
5 4 లర్ధించ లర్ధింప
6 12 ఆంధృశబ్ద ఆంధ్రిశబ్ద
7 11 బులనని బులనవి
,, 17 సైనె సైన
13 5 తార్క్ష్య తార్క్ష్యి
14 19 చ్ఛందంబును చ్ఛందంబను
16 13 [3]దివి దివి
17 12 శార్జ్గ శార్ఙ్గ
,, 24 మధురతాశబ్దమునకుఁ జూపిన యథోజ్ఞాపిక అనవసరము.
19 28 కర్షణాంబు కర్షణమధి
,, 29 నధికపదంబు సమాప్త పురరాత్రంబు-క పదంబు మఱి సమాప్త పురరాత్రంబును
24 11 మహి(సి) మహి
35 4 ఆచః అచః
53 33 ధాత్ర్యా ధాత్వా
66 8 స్తో=స్సకా స్తోః=సకా
86 5 దోష్మహ్నాబు దోష్మయాబు
104 6 సదలచ సదచల
128 14 పశులయ్యొ పళులయ్యొ
130 20 రుగ్యజురాది రుగ్యజుషాది
135 26 పవితా[4]నం పవితానం[4]
138 7 [2]నాక నా[2]క
167 18 సుదంతని సువంతను
,, 31 చూ. చూ. 4-50. కాని అని మొదలుగాగల నీపంక్తి 1 సంఖ్య ఫుట్ నోటును తరువాత నుండదగినది.
177 2 చేయుంప చేయుంచ
,, 9 దివిజాఘా దివిజాళా
188 6 రగణము రగగణము (చం.గ.)
,, 12 నదము నగము (సూ. గ.)
197 25 క్షితిసురల క్షితిసురుల

పు పం తప్పు ఒప్పు

204 15 [2]ప్రస్తుతింప [2]ప్రస్తరింప
(ప్రస్తుతింప గీటు క్రింద నుండదగు)
208 9 తెన్నని తెన్నెని
223 12 గంబరున్ గంబమరున్
232 16 •బమరుఁ బమరుఁ•
,, ,, క్రమొప్పమీఱ•సజ- క్రమమొప్పమీఱ సజ•
235 14 భజనన్న భజనల్న
236 31 నంది నంద
240 25 ధృత•ప ధృతప•
246 28 కెలమిన్ కెలమి
,, 29 వజాఁగాఁ న్నజాఁగాఁ
250 12 న్నంకరనంది న్నంకరనంద
259 7 బరమాఁ బరముం
260 20 నసనద్వయ నసనత్రయ
261 18 స్వరోర్వర సరోర్వర్వ
262 14 గాకనుత్సా గాకయుంత్సా
266 24 మండితతోర మండితదోర
268 21 వల్గనాహ్వాయ వల్గనాభిధ
269 12 సం•స్థలి సం•ద్దలి

ఉత్కళికల గానుంచినయతిచిహ్నముల పాదాంతసూచకములుగా గ్రహింపవలెను.

272 21 మిగురు ఁదమిః (ఈపాదమున కథస్సూచిలో వ్రాసిన "ఈచరణమున 21 మాత్రలున్నవి" అన్నది అక్కఱలేదు
277 1 అప్పకవీయము చతుర్థాశ్వాసము
278 ఎత్తుగీతి శుద్ధరూపము:—

సురనాథుమీఁద•నూఱు,లిరువురు రెంట•
విరతి; ధరణిబ్రాసంబు•దనరు,వాకిఁ యొత్తు
గీతి•యందు

278 1 చతుర్థాశ్వాసము అప్పకవీయము
278 21 •గృతులఁ గృతులఁ•
284 3 ఇలతో నెనబదినా...లగుఁ
ఇలలో నెనుబదినా...లగుం.